# చతుర

సంపుటి : 3 జూన్ 1980 సంచిక : 5

## ఈ నెల సమగ్ర నవల

ఆమె పేరే రంభ! సార్థక నామధేయురాలామె. ఆమె కోసం అమరత్వాన్ని సిద్ధించుకొన్న ఒక అద్భుత సంగీతమయ లోకంలోంచి దిగివచ్చాడతను. తన గాన సోపానాల మీద ఆమె పద మంజీరాలు రవళిస్తే చాలని పరితపించాడు......ఆక్రోశించాడు....ఆరాధించాడు. కల్లోలిత, సంక్షుభిత కడలి కెరటంలా ఎగిరెగిరి పడ్డాడు – కేవలం ఆమె ప్రేమ కోసం...చిరునవ్వు కోసం...చల్లని స్పర్శ కోసం... మరి ? వ్యామోహం, చంచలత్వం యౌవ్వనోద్వేగంతో మిడిసిపడే ఆ యువతి అతడి ప్రేమని స్వీకరించిందా ? ప్రేమ రాహిత్యం నుండి అతను బయటపడ్డాడా ? మూగ రాగాలను వినిపించే అతని...

# శిలారవళి

ఆ యువతి చెవులకు సోకిందా ? డబ్బుకు తప్ప కళకు విలువలేని ఈనాటి వ్యవస్థలో ఆ కళాకారుడి ప్రేమకున్న స్థానాన్ని అద్భుతంగా నవలీకరించిన

## కిషన్ చందర్

నవల "ఏక్ వయొలిన్ సముందర్ కే కినారే"కు

## గులాం గౌస్

అనువాదం ఈ నెల చతుర సమగ్ర నవల శిలారవళి.



ముఖపత్ర చిత్రం : సౌమిత్ర సిన్హా

రెండవ కవరు : హంపీ విరూపాక్షాలయం, ఫొటో : గీతాదత్త

మూడవ కవరు : ఢిల్లీ కుతుబ్ మీనార్, ఫొటో : బ్రహ్మదేవ్



# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


చతుర

ఈనాడు కాంపౌండ్,

హైదరాబాద్-500004.

# మీరు రిటైరు కాబోయే సమయం కోసం పెట్టుబడి పెట్టవలసిన తరుణం ఇది.



మీరు కష్టించి పని చేసేటప్పుడు, రిటైరుమెంటు, మీ స్వంత ఇల్లు నిర్మాణం తేలికగాను, మరియు చాలా సంవత్సరాలు వాటి విషయంగాను కనిపించవచ్చు. కాని దీర్ఘకాలంలో, పొదుపు చేయటం జ్ఞాపకముంచుకోండి.

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ ఫామిలీ బెనిఫిట్స్ మరియు రిటైర్మెంట్ బెనిఫిట్స్ పథకం మీ అవసరాలకు కావలసిన నెలసరి ఆదాయం మీకు క్రమబద్ధంగా లభింపజేస్తూ మీరు రిటైరైనా ఎలాంటి చికాకులు లేకుండా సహాయపడుతుంది. మీరు చేయవలసిందల్లా రికరింగ్ డిపాజిట్ ఖాతాను తెరిచి గడువు పూర్తి అయ్యేనాటికి దాని విలువ మొత్తాన్ని ఫిక్స్‌డ్ డిపాజిట్ ఖాతాలోనికి మార్చమని బ్యాంకు వారిని కోరటమే. ఆ తర్వాత మీ అదృష్టానికి ఎదురు చూడండి.

ఈ అంశాలపై లేక మా ఇతర పొదుపు పథకాలకు సంబంధించిన వివరముల కొరకు ఎడమవైపున ఉన్న కూపను భర్తీచేసి, మాకు పంపండి. మీకు ఉచితంగా కరపత్రాన్ని వెంటనే పంపిస్తాము.

1. స్పెషల్ టరమ్ డిపాజిట్
2. క్యాష్ సర్టిఫికెట్లు
3. రికరింగ్ డిపాజిట్
4. బీమా డిపాజిట్
5. ఫ్యామిలీ బెనిఫిట్ మరియు రిటైర్‌మెంట్ బెనిఫిట్ పథకాలు

మీ ఇష్టమైన పథకాల నంబర్లపై టిక్కు పెట్టండి.

[1] [2] [3] [4] [5]

పేరు : ______________________

______________________

చిరునామా : ______________________

______________________

______________________

ఇక్కడ కత్తిరించండి.

**స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్**

పబ్లిక్ రిలేషన్స్ డిపార్ట్‌మెంట్

హెడ్ ఆఫీస్, గన్‌ఫౌండ్రి,

హైదరాబాద్-500 17.

Time & Space-812 TL

# శకునం

''కాంతా... తలుపేసుకో... నేసలా కోర్టుపని పూర్తి చేసుకొనివస్తా!" వంటింట్లో ఉన్న భార్య సూర్యకాంతాన్ని కేకేసి బయలు దేరాడు సింగినాథం.

"ఛి... ఛీ... వెధవ కుక్క ఇప్పుడే ఎదురు రావాలా!" సింగినాథానికి ఎదురుగా ఓ పిచ్చికుక్క వచ్చింది.

సింగినాథంకు శకునం మీద చాలా నమ్మకాలున్నాయి. ఎప్పుడు ఏది ఎదురు పడ్డా పక్కింటి జోగినాథంను కన్సల్ట్ చేసి తెలుసుకుంటాడు. మొన్న గాడిద, నిన్న పంది ఎదురొచ్చాయి. వాటి గురించి కనుక్కుందామంటె జోగినాథం గారేమో ఆయన స్వంత పని మీద హైదరాబాదు వెళ్ళి వారమైనా తిరిగి రాలేదు. వాటి శకునం కనుక్కోక ముందే ఈ రోజు పిచ్చికుక్క ఎదురైంది. అతనొచ్చాక అన్నీ ఒక్కసారే అడిగితే ఆయన ఏమనుకుంటాడో... ఏమో! సింగినాథం బుర్ర వేడెక్కి పోతోంది. తలను పిచ్చి పిచ్చిగా రక్కుకుంటున్నాడు.

"అదేంటి! తలుపేసుకోమని చెప్పి అలా కుర్చీలో కూర్చొని తీరిగ్గా జుట్టు పీక్కుంటున్నారు. టైము పదికావస్తోంది. ఇంకెప్పుడు తగలడతారు!" చుస చుస లాడింది కాంతం.

"ఉన్నావుండవే కాంతం... అలా బయటకు కాలు పెట్టానో లేదో వెధవ కుక్కొకటి ఎదురైంది"

"ఇదెక్కడి చోద్యమండీ ... ఎవరైనా పిల్లి, నక్క ఎదురైతే శకునం చూస్తారు గాని గాడిద, పంది, కుక్కల క్కూడా చూస్తారుటండీ!... ఏడ్చినట్లుంది వెళ్ళండి గుడ్లురుమి చూసింది.

ఆ రోజే మధ్యాహ్నం జోగినాథం రానే వచ్చాడు. సాయంత్రం అయిదు కావస్తోంది. సింగినాథం తన డౌట్స్ క్లియర్ చేసుకుందామని జోగినాథం అరుగు మీదకు చేరాడు.

"హలో... అలో ఏమోయ్ సింగి అంతా కులాసేనా ?'' తాపీగా చుట్ట పీలుస్తూ అడిగాడు జోగినాథం.

"బాగానే ఉన్నాను కానీ..." అంటూ నసిగాడు.

"చెప్పుమరి అలా నసుగుతావేం ?"




ఆత్రుతగా సింగి ముఖంలోకి చూశాడు జోగి.

"ఈ రోజు కోర్టుకెళ్దామని బయలు దేరే సరికి...?"

"గుర్రమో, గాడిదో ఎదురొచ్చిందం టావ్. అంతేనా? చూడు సింగీ! నువ్ ప్రతి దానికి శకునం శకునం అంటూ చూస్తే ఎలా చెప్పు'' సింగిని మధ్యలోనే ఆపుతూ అన్నాడు.

"అది సరే! మరి పిచ్చికుక్క కూడా

ఎదురైంది. అది కుడి నుంచి ఎడమవైపు పోతే మంచిదా లేకపోతే ఎడమ వైపు నుంచి కుడికి పోతే మంచిదా" అంటూ జోగినాధం ముఖంలోకి గుడ్లు బయటపెట్టి చూశాడు సింగి. ఎన్ని చెప్పినా సింగినాధం వినేట్టు లేదు.

"ఆ రెండూ కాదు...పిచ్చి కుక్క కరవకుండా పోతే మంచిది" జోగినాధంకు కోపం వచ్చి అరిచాడు.

— వై. నాగార్జున

# విచారం

మాజీ నాయకు డొకరు చనిపోవడంతో ప్రస్తుత నాయకులు విచార సముద్రంలో మునిగి పోవడమే గాక ఒకప్పుడు ఆయన్ని ఘాటుగా విమర్శించిన వారు కూడా ఆయన మరణానికి దిగ్భ్రమ, నిశ్చేష్ట వంటి రొటీన్ పదాలతోనూ, ఒక ఆణిముత్యం, జాతినేత, ముద్దు బిడ్డను కోల్పోయాం వంటి పదాలు కూడా వాడుతూ, ప్రగాఢ సంతాపంతో ఎవరకు తోచిన రీతిలో వారు ప్రకటనలు ఇచ్చేస్తూ ఇలాగైనా తమ పేరు పత్రికల్లో, రేడియోలో వినగలిగినందుకు సంతోషిస్తున్నారు.

ఆకాశవాణి సంతాప దినాల్లో అన్ని కార్యక్రమాలు రద్దు చేసి విషాద గీతాలని వినిపిస్తోంది.

అప్పుడప్పుడు ఆ నాయకుని జీవిత చరిత్రను అంచెలంచెలుగా వినిపిస్తున్నారు ఆకాశవాణిలో.

నానిగాడు రేడియోలో కార్యక్రమం విని కట్టేసి విచారంగా నిట్టూర్చాడు.

వాణ్ణి ఆ స్థితిలో చూసి నాకు ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే ఆ నాయకుని పేరు చెప్పుకుని పైకి వచ్చిన వాళ్ళే తర్వాత అతడ్ని మరచిపోయి ప్రస్తుతం మొక్కుబడి కోసం విచారం ప్రకటిస్తుంటే ఆయన గురించి పెద్దగా తెలియక పోయినా విచారంగా ఉండడం ఆశ్చర్యం కాక మరేమిటి?

"అటువంటి నాయకులు చనిపోయి నందుకు విచారించడం కన్నా ఆయన చెప్పిన మంచిని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించాలి" ... అన్నాను వాడిని బుజ్జగిస్తూ.



"అవును! కానీ నా విచారం ఆయన కోసం కాదు" అన్నాడు వాడు.

"మరెందుకు?"

"వారం రోజులు పాటు సంతాప దినాలుగా ప్రకటించిన వాళ్ళు అన్ని రోజులూ స్కూలుకు శలవు ప్రకటించ నందుకు'' అంటూ వంటింట్లోకి తుర్రు మన్నాడు.

నోరు తెరుచుకుని నేను అలాగే ఉండి పోయాను.

—సుసర్ల సర్వేశ్వరశాస్త్రి



# శిలారవళి

— కిషన్ చందర్



ఎల్లోరా పదమటి భాగంలో ఎత్తైన రాతి పలకల మధ్య కొన్ని వందల సంవత్సరాల నాటి ఓ సంగీతకారుడి నిలువెత్తు ప్రతిమ నిలబడిచూస్తోంది. ఏదో గొప్ప సంగీత మయమైన మాధుర్యంతో ఓలలాడుతున్నట్లు కన్పిస్తోందా శిల్పం. అతడి చేతుల్లో వీణ వుంది. దట్టంగా పెరిగిన కేశాలు భుజాలను తాకుతున్నాయి. అతడి కళ్లు వేల సముద్రాల లోతు గాంభీర్యంతో, అగాథమైన అన్వేషణలో మునిగిపోతూ వున్నాయి. ఆ కళ్ళల్లోకి ఒక్కసారి చూస్తే చాలు చూపరుల గుండెల్లోకి సూటిగా దిగబడిపోతాయా అన్పిస్తోంది.

ఆ ప్రతిమ చుట్టూ కొంతమంది యువతులు గుమిగూడి చూస్తున్నారు. వాళ్ళ కళ్ళ నిండా ప్రశంస తొణికిసలాడుతోంది. వాళ్ళు బొంబాయిలోని ఒక కాలేజీ విద్యార్థినులు.

"అబ్బ ఎంత అందంగా వున్నాడు" ఖుద్వియా నోటి వెంట అసంకల్పితంగా ఆ మాటలు వచ్చేశాయి.

"ఆ కళ్ళు చూడు ఎంత మనోహరంగా వున్నాయో?" అంది రమోలా. "ఈ ప్రపంచాన్ని ఒక్క చూపుతో దొంగదీసుకొనేలా లేవూ? ఎంతటి కోమలత్వం ఆ చూపుల్లో" అని ఒక్కగుక్కలో అనేసి జారుతున్న పయ్యెదను ఎదమీదకు లాక్కుంది రమోలా.

విమలాకపూర్‌కు నోటి వెంట మాటలే రావటం లేదు. వచ్చిన దగ్గర్నుంచి రెప్ప వాల్చకుండా ప్రతిమనే చూస్తోంది. చూసి చూసి అంతవరకు బిగపట్టుకున్న శ్వాశను మెల్లగా సడలిస్తూ అంది "ఆ ఛాతీ ఎంత విశాలంగా వుందో? దృఢంగా వున్న ఆ మెడ వంపులు చూడు. సింహం లాంటి ఆ నడుము, పుష్టిగా మెలితిరిగి మెరుస్తున్న పిక్కల కండరాలు-అహ్-పరిపూర్ణమైన పురుషత్వం ఇతనిలో జలపాతంలా లంఘించాలని చూస్తోంది" స్వగతంలా అనటానికైతే అనేసిందీ మాటలు. కానీ తనచుట్టూ వున్న స్నేహితురాండ్రు తనవైపు చూస్తున్నారని తట్టేసరికి ఆమె ముఖం సిగ్గుతో ఎర్రగా కందిపోయింది. బరువెక్కిన కనురెప్పలు పైకెత్తి ప్రతిమ వైపు మళ్ళీ క్షణం పాటు చూసింది. అంతే అక్కడి నుంచి మరో వైపుకు పరుగెత్తింది.

రజని అంది "ఈనాటి సంగీతకారుల్లో ఏ కోశానా పురుషత్వమే వున్నట్టు కనిపించదు. సారంగీలా ఒకడుంటే, మరొకడు ఏక్‌తార్‌లా ఎండిపోయుంటాడు."

"ఇంతకీ ఇతగాడెవరు?" అయిరీని అడిగింది- రొమ్ముల మీద నుండి జారిన దుపట్టాను సరిచేసుకుంటూ.

అమ్మాయిలందరూ ఒకరి ముఖాల్లో కొకరు చూసుకుంటున్నారు. అందరికీ కొద్ది దూరంలో ఒక యువతి నిలబడివుంది. నెమలి పింఛం రంగు బ్లౌజ్ ధరించింది. గగన నీలిమలాంటి కంచి నేతచీర కట్టుకున్నది. ఎల్లోరా శిల్పాలకు దీటైన సజీవ శిల్పంలా కనిపిస్తోంది.

మరుక్షణంలో అందరు యువతుల చూపులూ ఆ యువతిని చుట్టుముట్టాయి. అయిరీని తను ధరించిన నేరేడు రంగు మస్లిన్లో దాగివున్న సుందర భంగిమను విల్లులా మరికాస్త వంచుతూ "రంభా! నువ్వు చరిత్రను ఔపోసన పట్టిన దానివి, అందునా హిందూ పురాణ తత్వ సారాన్ని గుక్కెడు నీళ్ళలో కరిగించి తాగేసిన దానివి. కొంచెం చెప్పవ్. ఈ ప్రతిమ ఎవరిది?" అని అడిగింది ఆ యువతిని.

రంభ రెండడుగుల్లో రెండు శతాబ్దాల




కాలాన్ని తన వెనుక విడిచివస్తున్నట్టుగా ముందుకు కదిలింది. చిరునవ్వు చిలికిస్తూ ఆ ప్రతిమ ముందుకు వచ్చి, అతడి కళ్ళల్లోకి సూటిగాచూస్తూ అంది "ఈ ప్రతిమ కేశవ్‌ది. రెండు వేల సంవత్సరాలకు పూర్వం మన దేశంలోకల్లా గొప్ప వైణికుడు కేశవ్. అతడి వేళ్ళ కొసల నీడల్లో వీణ మూర్ఛనలు పోవటమే కాదు మాట్లాడుతుందని ప్రజలు ఇప్పటికీ చెప్పుకుంటారు."

"అదంతా కేవలం భ్రమ "ఆయిరీని శ్వాశను ఎగబీల్చుకుంటూ అంది. "వీణ తంత్రుల భాషలో మాట్లాడగలుగుతుందే కాని, మానవ భాషలో ఎలా మాట్లాడ గలుగుతుంది."

"కాదు..." రమోలా మృదుగంభీర స్వరంతో అంది "ఇలాంటి వ్యక్తి రాతినే కాదు ప్రకృతిలో మరే జడపదార్థాన్ని స్పృశించినా రాగాల జడివాన కురుస్తుంది. ఇక వీణ మాట్లాడిందంటే ఆశ్చర్యమేముంటుంది?"

"అతడి మౌనంలో సంగీత భరిత భాష వుంది"ఖుద్సియా ఒక బలమైన నిట్టూర్పు విడుస్తూ అంది.

నుదుటి మీదకు జారిన ముంగురులను వయ్యారంగా సవరించుకుంటూ రంభ అంది "అతడి విశాలమైన కళ్ళల్లో రాజసంలో పుట్టిపెరిగిన కలువ పూల కాంతి వున్న మాట నిజమే కావచ్చు-కానీ మనం ఇలా ఈ ఒక్క శిలా ప్రతిమ దగ్గర అతుక్కు పోవటం ఏమీ బావుండ లేదు. కాలమంతా ఇక్కడ వృధా అయి పోతే ఎలా? కాస్త వెనక్కు తిరిగి శివ తాండవంలో నిమగ్నమైవున్న ఆ నటరాజ మూర్తిని కూడా చూడండి. మరెక్కడా శిలా ప్రతిమలు నాట్యం చేయటం చూసి వుండకపోతే ఆ నాట్యాన్ని చూడండి."

రంభ మాటలతో యువతులందరూ నటరాజమూర్తి వైపుకు తిరిగారు. ఇప్పుడు అందరి వీపులు కేశవ్ వైపు నున్నాయి. అందరి దృష్టి సజీవ నాట్య భంగిమలో నిలబడి వున్న నటరాజును చుట్టుకుని ఆగిపోయింది. చూస్తున్నకొలదీ వారి ముఖాలమీద ప్రసన్నతతో నిండిన ఆశ్చర్య కిరణాలు చోటు చేసుకుంటు న్నాయి.

"ఈ నటరాజమూర్తిని ఎత్తుకుపోయి నా డ్రాయింగ్ రూంలో ప్రతిష్టించు కోవాలనిపిస్తోంది" అంది రజని హఠాత్తుగా.

రమోలా వెంటనే అందుకుంది "నీకు కనిపించిన ప్రతి వస్తువునూ స్వంతం చేసుకోవాలనే అనిపిస్తుంది. ఒక్క నటరాజ్ ఎందుకు- మొత్తం ఎల్లోరానే ఇంటికి పట్టుకు పోరాదూ" అంది పరిహాసంగా.

రమోలాకు, రజనీకి క్లాస్‌లో కూడా పక్కెదురే. అయినా రమోలా మాటలకు ఉడుక్కుని అలవాటు ప్రకారం పొగరుగా ఏదో సమాధానం చెప్పలేదు రజని ఈసారి. కాని మూతి మూడు వంకర్లు తిప్పుతూ వెక్కిరించింది. అది చూచి రమోలా రజనీని కొట్టటానికి పరిగెత్తు కొచ్చింది. రజనీ అందకుండా పరుగెత్తింది. ఒకరి వెనుక ఒకరు పరుగెత్తి ఒక చుట్టు తిరిగి మళ్ళా కేశవ్ ప్రతిమ దగ్గరకు చేరుకున్నారు. రంభ ఇద్దరి మధ్యకు వచ్చి "లేదు లేవే! ఇక వెక్కిరించదులే వదిలెయ్... బాబ్బాబు...పోనీలే" అంది.

"ఏయ్ కోతుల్లారా! కింపడ్డారంటే ఇదిగో ఈ ప్రతిమలాగే దెబ్బతిసగలరు"

అంది రంభ మళ్ళీ.

"ప్రతిమకు గాయమా? ఏది? ఎక్కడ? రమోలా, రజనీ తగవు మర్చిపోయి ప్రతిమవేపు తిరిగారు వెంటనే.

"అదిగో చూడండి వీణదగ్గర... వీణ పట్టుకున్న ఆ చేతివి రెండు వేళ్లు విరిగి పోయాయి" చూపించింది రంభ.

"అరె! ఇదెలా జరిగింది?" రజని ఇంకా పరిశీలనగా ప్రతిమ వేపు చూస్తూ అంది "బహుశా ఏవరో సుత్తితో అక్కడ కొట్టినట్టున్నారు."

"కాదు... ఈ సంగీతకారుడే ఎవరి తోనో దెబ్బలాడి వేళ్ళు విరగ్గొట్టించు కుని వుంటాడు. అందుకనే శిల్పం కూడా ఇలా చెక్కి ఉంటాడనిపిస్తోంది" అంది రంభ తన అందమైన వేళ్ళను గాల్లో నాట్యం చేయిస్తూ. ఒక్క క్షణం ఆగి ప్రతిమవేపు దృష్టిని సారిస్తూ "అవును కదూ... మిస్టర్ కేశవ్?" అని శృంగార భంగిమలో ప్రతిమను వెక్కిరించింది.

ఇంతలో విమలాకపూర్ ఓ మూల నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి రొప్పు కుంటూ చెప్పసాగింది "ఏయ్... అటు వైపు... అక్కడ?"

"ఏమిటే ఏముందక్కడ? అదేదో ముందు చెప్పి ఆ తరువాత ఆయాస పడుతూ వుండు" అంది రంభ చిరుకోపం ప్రదర్శిస్తూ.

విమల అతి కష్టమ్మీద గొంతు పెగుల్చుకుంటూ "అదిగో ఆ మూలన ఇద్దరు స్త్రీ పురుషుల శిల్పాలు లేవూ... అవి... అవి" విమల సిగ్గుపడిపోయింది. మాట పెగిలి రాలేదు.

"వున్నాయి. వుంటే ఏమైంది?" రమోలా విసుగ్గా అంది.

"దే ఆర్ కిసింగ్ ఈచ్ అదర్" ఎలాగో చెప్పేసింది విమల.

"నో..." అనాలోచితంగా అనేసింది ఆయిరీని. ఈసారి అందరూ సిగ్గులో మునిగారు. ఇంక అక్కడ నిలబడలేక మరో వైపుకు పరుగెత్తారు. ఖుద్సియా, రంభ మాత్రం అక్కడే మిగిలిపోయారు.

రంభ కేశవ్ ప్రతిమవేపు గంభీరంగా చూస్తూ అంది- "కేశవ్ తన జీవితకాలంలో ఎవరినీ ప్రేమించి ఎరుగడట. ఏ స్త్రీని వివాహం చేసుకోలేదట. జీవితాంతం తన వీణనుతప్ప మరొకరివేపు కనీసంకన్నెత్తి కూడా చూచి ఎరుగడట- అని ప్రజలు చెప్పుకుంటారు."

"కాబట్టే కదా అంత పెద్ద సంగీత కారుడు కాగలిగాడు. ఆదర్శ కళాకారు లందరి దృష్టి ఒకే బిందువు దగ్గర కేంద్రీ కృతమవుతుంది. ఆ బిందువు స్త్రీఅయినా కావచ్చు, వీణ అయినా కావచ్చు మరొక టయినా కావచ్చు." అని కేశవ్ ప్రతిమ వైపు ఆరాధనగా చూచింది ఖుద్సియా.

రంభ కళ్ళల్లో ఒక చంచల సంచలిత జ్వాల ప్రకాశిస్తుండగా అంది- "నేను నీతో ఏకీభవించను. స్త్రీ ఒక గొప్ప అగ్ని కణం లాంటిది. ఆ అగ్నికణం నెమ్మదిగా రగులుకొంటున్న కళాజ్యోతిని మరికా స్త రగిలించి జ్వాలాయమానం చేస్తుంది. కాంతికి పట్టం కట్టేస్తుంది."

అని మళ్ళీ అదే అగ్ని సమ్మిళితమైన చూపులతో కేశవ్ ప్రతిమను చూస్తూ "ఇతగాడో పెద్ద మూర్ఖశిఖామణి అయి వుంటాడు లేవే" అంది.

ఖుద్సియా చిరునవ్వు నవ్వి "సరేలే. పద! అదసలే శిలా ప్రతిమ. దాన్ని ఇంకెంతసేపు తిట్టుకుంటూ కూర్చుంటా విక్కడ? పద పద..అటు వెళ్ళి ఆ ప్రాచీన కాలపు హాలీవుడ్‌ను కూడా దర్శిద్దాం"





అంటూ ముందుకు దారి తీసింది.

యువతులిద్దరూ శిల్పాన్ని దాటి పోయారు. ప్రతిమ ఏకాంతంలో, ఒంటరితనంలో లీనమైనిలబడి అలాగే చూస్తోంది. చుట్టూ చీకట్లు కమ్ముకుంటున్నాయి. సుందరీమణుల చంచలమైన చిరునవ్వుల శబ్దం అంతా దూర దూరంగా విరజిమ్మబడి శూన్యంలో మమైక్యమై పోయింది. నాలుగు వేపులా కఠోర నిశ్శబ్దం.

* * *

అర్ధరాత్రి గడిచింది. చుట్టూ గాఢమైన శుషుప్తి నిండిపోయింది. హటాత్తుగా ఎల్లోరా శిలా శిల్పాల్లోంచి ఏదో సంచలనం, స్పందన బయలుదేరింది. గాఢ నిద్రలోంచి మేల్కొంటున్నట్టు శివుడు లేచి నిలబడ్డాడు. ఒకసారి ఒళ్ళు విరుచుకుని చిరునవ్వు నవ్వుతూ ఢమురుకాన్ని అందుకున్నాడు. శివుడి చేతుల్లో ఢమురుకం ప్రకంపిస్తోంది. చుట్టూ శబ్దం ప్రతిధ్వనిస్తోంది.

ఆ ఢమురుక శబ్దం సోకిన మరుక్షణంలో శిలా ప్రతిమ లన్నింటికీ జీవం వచ్చేసింది. శిలా ఫలకాల మీద నుంచి దిగివచ్చి ఒక్కొక్కరూ శివుడి పాద పీఠం వేపుకు నడుస్తున్నారు. దేవతలు, అప్సరసలు, యక్షులు, గంధర్వులు, కిన్నెరలు, కింపురుషులు, మునులు, ఋషులు - అందరూ శివుడి పాద పీఠం చుట్టూ సభదీర్చి కూచ్చుండిపోయారు.

అది అమావాస్య రాత్రి. చుట్టూ దట్టమైన చీకటి. ఎవరూ అటురారు. ఎవరూ చూడలేరు. కాబట్టి శివుడు ఈ రోజు నాట్యం చేసాడు. ఎవరూలేని ఏకాంతంలో తప్ప శివుడు నర్తించడు.

శివతాండవపు ఒక భంగిమలో నిలబడి- "కేశవ్! వీణ అందుకో-మ్రోగించు" అని ఆజ్ఞాపించాడు శివుడు. కేశవ్ ఒక మూలన వీణ మీదకు ఒంగి కూర్చుని వున్నాడు. శివుడి ఆజ్ఞ విన్నవెంటనే అతడి చేతులు వీణాతంత్రుల మీదకు పరుగెత్తాయి. కానీ తంత్రుల నుండి ఎలాంటి శబ్దమూ రాలేదు.

"కేశవ్! ఏం జరిగింది?" గంభీర స్వరంతో అడిగాడు శివుడు. అందరి దృష్టి ఒక్కసారిగా కేశవ్ వేపు కేంద్రీకృతమైంది.

"భగవాన్! ఇంక ఈ వీణలోంచి ఏ శబ్దమూ రాదు - రాగం పలకదు" తల వంచుకుని మంద్రస్వరంతో అన్నాడు కేశవ్.

"ఎందుకని?" త్రినేత్రుడు కోపంగా అడిగాడు.

"భగవాన్! నేను ప్రేమలో పడి పోయాను."

"ఎవరి ప్రేమలో"

"ఇవ్వాళ ఇక్కడకు వచ్చిన అమ్మాయిల్లో ఒకరిని ప్రేమించాను."

"ఇవ్వాళ ఇక్కడకు నూటయాభై మంది అమ్మాయిలొచ్చారు. నువ్వు ఎవరిమాట చెపుతున్నావు!"

"అదే నిడుపాటి కేశాలతో గంధం రంగులో మెరిసిపోయే ఆ అందమైన అమ్మాయే! పేరు రంభ-"

శివుడు స్తంభించిపోయాడు. చుట్టూ వున్న దేవతల స్వరాల్లోంచి హాహాకారాలు బయలుదేరాయి. కలకలం చెలరేగింది. శివుడు ఆగ్రహంతో ఊగిపోతున్నాడు. "అభాగ్యుడా! నీవు ఏనాడో మరణించి గతించిన కాలపు నీడల్లో శిలగా వున్నావన్న విషయం నీకు గుర్తుందా?"

కేశవ్ నెమ్మదిగా అన్నాడు. "ఈ

అనంత సృష్టిలో ఒక బిందువు నుంచి బయలు దేరిన కెరటం తిరిగి తిరిగి మళ్ళీ అదే బిందువు దగ్గరకు చేరుకుంటుంది. చావుదగ్గరే పుట్టుక, పుట్టుకను వెన్నంటే చావు. సృష్టి అలా గుండ్రంగా-గుండ్రంగా నిరంతరం పరిభ్రమిస్తూనే వుంటుందని విన్నాను నేను. మరైతే – భగవాన్! ఇది ఎందుకు జరక్కూడదు ? భూతకాలం ఒక చుట్టుతిరిగి వచ్చి వర్తమానం ఎందుకు కాకూడదు?"

"కానీ నువ్వు మరణించావు. నీ శరీరం ఏనాడో మట్టిలో కలిసిపోయింది, శూన్యంలో ఐక్యమైపోయింది. కేవలం నీ గుర్తులు, జ్ఞాపకాలు మాత్రమే మిగిలి వున్నాయి. నీ ఈ రాతి శరీరం ఒక గుర్తు. నీది కాని శరీరాన్ని నీదని ఎలా భావిస్తున్నావు నువ్వు?" అన్నాడు శివుడు.

కేశవ్ జవాబు చెప్పాడు "నా గుర్తులు ఇంకా మిగిలి వుంటే నేను పూర్తిగా మరణించినట్లు ఎలా అవుతుంది భగవాన్! అన్నిటికన్నా అమరమైనవి గుర్తులూ, జ్ఞాపకాలే కదా! ఆగుర్తులు రాతిలోవున్నా, సరిగమల్లో విలీనత చెందినా నేనింకా ఆ రూపంలో జీవించి వున్నట్టే కదా మహాదేవా!"

శివుడు నవ్వాడు; "అయితే ఈ రాతి చట్రంలో జడప్రాయంగా నిలబడి కూడా ప్రేమిస్తానంటావ్? అలాగే కానీ నేనెప్పుడు కాదన్నాను!... రోజూ ఎల్లోరాను చూడ్డానికి వేలకొద్దీ జనం వస్తుంటారు. నిన్ను చూసి ప్రశంసించి వెళ్ళి పోతుంటారు. వాళ్ళ జ్ఞాపకాలు రెండు వేల సంవత్సరాల పూర్వం నాటి నిన్ను



ఆక్షణంలో వర్తమానంలో నిలబెడతాయి. ఆనాటి నీ తాలూకు స్మృతులు అప్పుడు ఆ క్షణంలో పునరుజ్జీవితమౌతాయి. అది అతీతమైన ఒక అదృశ్య రూప కరణం. అంతే! వర్తమాన భౌతిక రూప ధారణ మాత్రం కాదు. అవజాలదు. మనుషులు శిలలు కాలేరు. శిలలు మనుషులుగా రూపాంతరం చెందలేవు. ఆనాటి నీకు, ఈ నాటి నీ కాంక్షకు మధ్య కాలం రెండు వేల సంవత్సరాల ఎత్తైన గోడను నిలబెట్టింది" అన్నాడు.

"భగవాన్! నువ్వు శంకరుడివి... నా దేవుడివి" భక్తి నిండిన స్వరంతో అనునయంగా అన్నాడు కేశవ్ "నీకు అసాధ్యం అంటూ ఏదీ లేదు. అసంభవాలు నీ కుండవు. నీ పాద పీఠం దగ్గర మోకరిల్లి వున్నాను. నాకు మళ్ళీ జీవితాన్ని ప్రసాదించు. నాట్యం చేసే నీ పాదస్పర్శ తాకిన మరుక్షణం ఆ రెండు వేల సంవత్సరాల దూరాన్ని ఒక్క శ్వాసలో లంఘించగలను."

శివుడు కోపంతో గర్జించాడు. ఆ గర్జనకు ఎల్లోరా రాతి గోడలు కంపించి పోయాయి. దేవతలు, గంధర్వులు, మునులు, ఋషులూ అందరూ భయ కంపితులైపోయి తల వంచుకుని నిలుచున్నారు.

హఠాత్తుగా సరస్వతీదేవి పలికింది "మహాదేవా! కేశవ్ కేవలం అమాయకుడు, పరమ మూర్ఖుడు. తన జీవిత కాలంలో స్త్రీ ప్రేమను చవిచూచి ఎరుగని వాడు. ఏ ఒక్కరినీ ప్రేమించినవాడు కాదు. అందుకని ఇతడి జ్ఞానం అసంపూర్ణంగా, ఇతడి అనుభవాలు, అనుభూతులు, జీవితం అసంపూర్తిగా మిగిలిపోయాయి. కేశవ్ నిజానికిప్పుడు తన సంపూర్ణతను కోరుకుంటున్నాడు. ఇతడి రాతి గుండెల్లో బాధ

జ్వలిస్తోంది. అతడి హృదయం ప్రేమ కోసం పరితపిస్తోంది. మనిషి గుండెల్లోని అశాంతిని భరించలేనివాడివి మరి ఇతడి రాతి గుండెల్లోని భయంకర మైన అగ్నిని ఎలా భరించగలవు ప్రభూ! ? అతడి మూగవీణలోని విషాద ఖేదాన్ని ఎంతకని సహించగలుగుతావు. అహో రాత్రాలు అతడు తన కాంక్షలను కళ్ళ నిండా నింపుకొని - దయనీయంగా నీ సమక్షంలో నిలబడిపోతాడు. మనుషుల కళ్ళయితే కన్నీరు కార్చగలుగుతాయి. కానీ ఇతడి రాతి కళ్ళు కనీసం ఏడ్వనైనా లేవు. కనిపించని ఆ కన్నీళ్ళ వెనుక దాగి వుండే మహా విషాదాన్ని చూస్తూ ఊరుకుండిపోగలవా నువ్వు?" అంది సరస్వతి.

పార్వతి తలను శివుడి భుజానికి ఆనిస్తూ అంది "అయ్యో! ఇతడు ఎవరినీ ప్రేమించి ఎరుగడా?...ఇంతకు మునుపు నాకీ విషయం తెలియదు. పాపం... కేశవ్..."

కరుణ నిండిన కళ్ళతో కేశవ్ వైపు చూస్తూ, పార్వతి మళ్ళీ అంది- "నేను ఎన్నో సార్లు అనుకునే దాన్ని- కేశవ్ వీణా నాదంలో మహిమాన్విత మైన హిమన్నగపు చల్లదనం అయితే వుంది. కానీ కైలాస పర్వత వాయువుల్లో విలీనమై వుండే సంవేదనాగ్ని ఒక్క కణమైనా లేదే అని. దానిని సంతరించు కునేందుకు ఇతడికి మళ్ళీ జీవితాన్ని ప్రసాదించండి స్వామీ."

శివుడు కోపంతో పార్వతి వైపు చూచాడు. "దేవీ! మీరిద్దరూ ఎలాంటి కోరిక కోరుతున్నారో తెలుసా మీకు?" అన్నాడు. కాని కోపం అంతలోనే చల్లబడిపోయింది.

"మాకు తెలిసిందల్లా ఒక్కటే. ఇతడి జీవితంలో ప్రేమ లేనిలోటు పెద్ద అగాధంలా కనిపిస్తోంది. అందుకని అతడికి మళ్ళీ జీవితాన్ని ప్రసాదించండి స్వామీ!"

పార్వతి తలను శివుడి భుజాలకు ఆనించేసింది.

"ఇతడు ప్రేమ కావాలని కోరు కొంటుంటే ... ఉన్నాడుగా ప్రేమికుల పాలిటి పరమాత్ముడు శ్రీకృష్ణుడు- ఆయన దగ్గరకు వెళ్ళమనండి. నన్ను అడగటం దేనికి ? నేను కృష్ణుడిని కాను శంకరుడిని" అన్నాడు శివుడు.

సరస్వతి చిరునవ్వు చిందిస్తూ అంది "కృష్ణుడికీ, శంకరుడికీ మధ్య అంతరమేముంది? శంకరుడ్ని తిరగేస్తే కృష్ణుడు అవుతాడు కదా"

సరస్వతి వ్యాఖ్యవిని శివుడు గలగలా నవ్వేశాడు. కోపమంతా మటుమాయ మైంది. కేశవ్ వైపు చూస్తూ అన్నాడు "మూర్ఖుడా! నిన్ను నువ్వు ఎలాంటి సంకటంలోనికి పడదోసుకుంటున్నావో ఎంత చెప్పినా నీకు అర్థం కావడం లేదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు.. నా మాట విను"

"భగవాన్! క్షమించు. ఈ అశక్తుణ్ణి కరుణించు. నేను రంభను మనసారా ప్రేమించాను" కేశవ్ చేతులెత్తి శివుడికి నమస్కరించాడు. తల వంచుకుని శివుడి పాదాల దగ్గర మోకరిల్లాడు.

శివుడు మౌనంగా తల పంకిస్తూ అన్నాడు "సరే నీకు ముందు ఒక సంవత్సరం ఆయుర్దాయాన్ని ప్రసాదిస్తున్నాను. ఈ సంవత్సరంలోగా నువ్వు రంభ ప్రేమను సంపాదించగలిగితే నీకు నూరేళ్ళ జీవితాన్నిస్తాను. కానీ ఒక

షరతు–నువ్వు రంభ ప్రేమను సంపాదించినా, సంపాదించకున్నా వచ్చే సంవత్సరం ఇదే రోజు, ఇదే రాత్రికి, ఇదే సమయంలో, ఇదే చోటుకి మరలి రావాలి. తెలిసిందా?"

"నీ ఆజ్ఞ!" అంటూ అంగీకార సూచకంగా తలూపాడు కేశవ్. మళ్ళీ వెంటనే తలను శివుడి పాదపీఠానికి ఆనించి కూర్చుండి పోయాడు. కేశవ్ తల వంచిన వెంటనే శివుడు తన కుడి పాదాన్ని కేశవ్ తలకు తాకించాడు.

ఆకాశంలో ఎక్కడో దూరంగా ఒక గర్జన వినిపించింది. మరు క్షణంలో మెరుస్తున్న ఒక కాంతి పుంజం మేఘాల నుంచి పిడుగులా దూసుకొచ్చి కేశవ్ రాతి శరీరాన్ని కాళ్ళ నుంచి తల వరకు స్పృశించి వెళ్ళిపోయింది. ఏదో కొత్త సృష్టి జరిగినట్టు ఎల్లోరా రాతి పలకల మధ్య ఓ వింత కాంతి ప్రజ్వలించింది. ఏదో స్పందన ఎల్లోరాను ఒక్క క్షణం సేపు పట్టి కుదిపింది. మరుక్షణంలో చీకటి, నిశ్శబ్దం నాలుగు వేపులా అలుముకుపోయాయి.

* * *

తెల్లవారింది. నటరాజుకు ఎదురుగా రాతి పలకల మధ్య నిలబడి వుండవలసిన ఒక ప్రతిమ మాయమైంది. ఓ మనిషి శివుడు పాదపీఠం దగ్గర ఒక పాత వీణ మీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు.

సూర్యుడి నుంచి వెలువడిన మొదటి కాంతి కిరణం అతడి నుదుట పడగానే ఆ మనిషి తటాలున మేల్కొని తల ఎత్తి చుట్టూ ఆశ్చర్యంగా చూశాడు. తన చుట్టూ వున్న శిల్పాలను పరికించాడు. అతడి దృష్టి నిన్నటి వరకు కేశవ్ ప్రతిమ నిలబడి వుండిన స్థానంలో ఆగిపోయింది. ప్రతిమ అదృశ్యమైన ఆ ఖాళీ స్థలాన్ని చూడగానే ఆ మనిషి శరీరంలోని అణువణువు కొద్దిసేపు కంపించింది. అతడికేదో గుర్తుకొచ్చింది. ఆ జ్ఞాపకాలు అతడి పెదవుల మీదకు చిరునవ్వులను తెచ్చాయి.

అతడు తన శరీరాన్ని ఒక్కసారి తాకి చూసుకున్నాడు. మరుక్షణమే ప్రతిమ లేని ఖాళీ స్థలాన్ని చూశాడు. అతడి చేతులు ఇంకా తన శరీరాన్ని తడుముకుంటూనే వున్నాయి. ఆ చేతులకు మెత్తటి కండరాలు, వెచ్చటి రక్త స్పర్శ తగిలాయి. అతడి ముఖమ్మీద ఉజ్వలమైన ఆనందం చోటుచేసుకుంది. అంతలోనే ఏదో గుర్తుకు వచ్చినవాడిలా చటుక్కున లేచి నిలుచున్నాడు. పక్కనే వున్న ముసలి వీణను చేతిలోకి తీసుకున్నాడు. నెమ్మదిగా ఎల్లోరాలోని చీకట్లను దాటుకుంటూ, తడబడుతున్న అడుగులతో బయట విశాల ప్రపంచపు వెలుగులోకి వచ్చేశాడు.




ఆకాశం నిర్మలంగా వుంది. నేల మీది మట్టి నల్లటి రంగులో మెరుస్తోంది. గరిక పోచలు నిండుగా మంచుతో కప్పబడి వున్నాయి. పక్కనే ఓ రైతు చేనుదున్నుకుంటున్నాడు. నాగలి ఒడుపుగా పట్టుకుని మధ్యమధ్యలో ఎడ్లను అదిలిస్తున్నాడు.

'అదే నేల, అదే ఆకాశం, అదే నాగలి, అవే ఎడ్లు, అదే రైతు' కేశవ్ ఆలోచిస్తున్నాడు. ఈ రెండు వేల సంవత్సరాల్లో ఏ మార్పూ జరగనేలేదా? అతడి గుండెల నిండా ఆనందం పొంగిపొర్లుతుంటే పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ రైతు దగ్గరకు నడిచాడు.

"నేను బొంబాయి వెళ్దామనుకుంటున్నాను. నాకో రథం కావాలి. ఎక్కడ దొరుకుతుంది?" కేశవ్ రైతును అడిగాడు.

రైతు తనను ప్రశ్నిస్తున్న మనిషిని తేరిపార చూశాడు. ఆజానుబాహు విగ్రహం, ఎర్రటి రంగు, భుజాలకు తాకుతున్న జుత్తు, ఎర్రటి గెడ్డం, కళ్ళనిండా సముద్రపు నీలిమ, విశాలమైన ఛాతీ, దృఢంగా వున్న కాళ్ళూ, చేతులూ, భుజాలూ; నడుముకు చుట్టబడివున్న ఖరీదైన పట్టు ధోవతి, చేతుల్లో బంగారు రంగులోవున్న వీణ. ఈ అపరిచితుడు ఏ మహా రుషో, గొప్ప యోగో అయివుంటాడు అనుకున్నాడు రైతు.

కేశవ్‌ను చూడగానే రైతుకు గౌరవ భావం ఏర్పడిపోయింది. వెంటనే రెండు చేతులతో నమస్కరిస్తూ "స్వామీ! చాలా దూరం నుంచి ప్రయాణించి వస్తున్నట్టున్నారే?" అన్నాడు.

"లేదు" కేశవ్ జవాబిచ్చాడు "నేను నీకు చాలా దగ్గర్లోనే వుంటున్నాను."

రైతు నమ్రత నిండిన స్వరంతో అన్నాడు "కానీ. స్వామీ! మిమ్మల్ని ఇదే మొదటిసారిగా చూస్తున్నాను, బహుశా ఏ కాంతంగా తపస్సు చేసుకుంటూ వుండి వుంటారనుకుంటాను"

"అలాగే అనుకో" కేశవ్ స్వరంలో కొద్దిగా విసుగు– "బొంబాయి వెళ్ళటానికి రథం ఎక్కడ దొరుకుతుందో కొంచెం త్వరగా చెప్పి పుణ్యంకట్టుకో అన్నాడు" కేశవ్.

"రథాలెక్కడివి స్వామీ! రైలు బండిలో వెళ్ళాలి"

"ఏమన్నావు ఎడ్లబండా?" కేశవ్ అడిగాడు.

"ఎడ్లబండికాదు స్వామీ – రైలుబండి రైలుబండి" రైతు నవ్వుతూ చెప్పాడు. "ఔరంగాబాద్ నుంచి బయలుదేరుతుంది"

కేశవ్ అనుకున్నాడు. రైలుబండి కూడా ఎడ్లబండిలాగే ఓ వాహనమై వుంటుంది అని. ఈ రైతు సరిగ్గా చెప్పటం లేదు. ఇతడితో అధిక ప్రసంగం అనవసరం.

"అయితే ఔరంగాబాద్ వరకూ ఎలా వెళ్ళాలి. అది చెప్పు చాలు!"

"బస్సు మీద వెళ్ళండి"

"బస్సు" ... కేశవ్‌కు ఆ మాటకు అర్థమే తెలియదు; రైతు పరాచకాలాడుతున్నాడనిపించింది.

"నన్ను పిచ్చివాణ్ని చేద్దామనుకుంటున్నావా ? లేక నువ్వే పిచ్చివాడివా? బస్సు ఏమిటి.. బస్సు... సరిగ్గా చెప్పవయ్యా బాబు – ఔరంగాబాద్ ఎలా వెళ్ళాలి ?"

రైతుకు విసుగనిపించింది. పొద్దున్నే ఎక్కడ దాపురించాడీ స్వామి. ఎన్నేళ్లుగా ఏ చీకటి గుహలో నిద్రపోతున్నాడో అనుకున్నాడు.

"చూడండి స్వామీ! ఈ పొలాలు దాటి ఆ దూరంగా కన్పిస్తున్న తారు రోడ్డు వరకు వెళ్ళండి. మీకు బస్సు అక్కడ దొరుకుతుంది" అన్నాడు రైతు.

"తారు... రోడ్డు"

"అవును స్వామీ బస్సు అక్కడే

దొరుకుతుంది. వెళ్ళండి"

"మళ్ళీ అదే బస్సు... పైగా తారు.. రోడ్డు"

కేశవ్ రైతువైపు కోపంగా చూసి, మరు నిముషంలో బారాటి అంగలు వేసుకుంటూ పొలాలు దాటి రోడ్డెక్కాడు.

'దీని పేరా తారు... రోడ్డు... అన్నీ రాళ్ళు రప్పలు. పైగా ఈ నల్లటి జిగట రంగు ఒకటి. మా కాలంలో రోడ్లు ఎంత మెత్తగా వుండేవి. ఈ రోడ్డును చూస్తుంటే ఈ రెండు వేల సంవత్సరాల్లో రాజ్యం బాగా నాశనమైనట్లు అనిపిస్తోంది. లేకపోతే ఈ రోడ్లు ఇంత నల్లగా కారు చీకటిలా, విషాద వర్ణానికి ఎందుకు మారతాయి?'కేశవ్ ఆలోచిస్తున్నాడు. ఈ రోడ్డు మీద నడిచి ఔరంగాబాద్ వరకు వెళ్ళాలి. అసలు ఈ ఔరంగా... ఔరంగా... ఇదేం పేరు. బహుశా 'శ్రీరంగ'... అయివుంటుంది. చూడబోతే ఈ మనుషులు ఈ రెండు వేల సంవత్సరాల్లో అందమైన పేర్లన్నీ చెడగొట్టి మట్టిపాలు చేసినట్టు కనిపిస్తోంది.

ఇలా ఆలోచించుకుంటూ తారురోడ్డు మధ్యగా నడుస్తున్నాడు కేశవ్. కాసేపట్లో 'పోయ్... పోయ్...'అంటున్న శబ్దమేదో కర్ణకఠోరంగా వినిపించింది. కేశవ్ వెనక్కు తిరిగి చూసి ఆశ్చర్యపోయాడు. స్తంభించి పోయినట్టు రోడ్డు మీద అలాగే నిలబడి పోయాడు.

ఏనుగు కన్నా ఎన్నో రెట్లున్న ఓ పెద్ద ఎర్రటి జంతువేదో పొయ్ పొయ్ మని అరుచుకుంటూ కేశవ్ మీదకు పరుగెత్తుకొస్తోంది. దాని కళ్ళు పెద్దగా, వికృతంగా, భయంకరంగా కెలికిన గాయాల్లా వున్నాయి. కేశవ్ అంతకుమును పెప్పుడూ అలాంటి జంతువును చూచి వుండలేదు! పైగా ఈ జంతువు ఏనుగులు, గుర్రాలకన్నా వేగంగా పరుగెత్తుకువస్తోంది. కేశవ్ ఒక్క క్షణం భయపడ్డాడు. కానీ మరుక్షణమే ఈ జంతువును చూసి భయపట్టం అవివేకం అని నిశ్చయించుకున్నాడు.

కేశవ్ గురువు ఒకసారి- ఏనుగు ఎప్పుడన్నా పిచ్చెక్కి మదంతో మీదకు రాబోతే సంగీతంతోదాన్ని లొంగదీసుకోవచ్చునని చెప్పాడు. అలా ఎన్నో పిచ్చి పట్టిన ఏనుగులను కేశవ్ అనేకసార్లు లొంగదీసుకున్నాడు కూడా. ఈ సంగతి గుర్తుకు రాగానే కేశవ్ నడిరోడ్డు మీద పద్మాసనం వేసుకొని వీణను చేతిలోకి తీసుకున్నాడు. ఆ జంతువును లొంగదీసుకునే రాగాన్ని ఆలపించాలని కళ్ళు రెండూ నిమగ్నతతో మూసుకున్నాడు. చేతిని వీణాతంత్రుల మీదకు జరిపాడు. తంత్రులు మ్రోగుతున్నాయి. హటాత్తుగా పక్కన ఏదో కలకలం బయలుదేరింది. భూకంపం వచ్చినట్టు భూమి దడ దడ వణికింది. కానీ కేశవ్ కళ్ళు తెరవలేదు. తన్మయత్వంలో వీణను వాయిస్తూనే వున్నాడు. ఈ సారి 'పొయ్ పొయ్' అంటూ పెద్ద శబ్దం చెవులకు అతి దగ్గరగా వినిపించింది. ఒక గావు కేక వినిపించింది. పెద్ద భారీ ఆకారం ఏదో పక్కనే ఆగి వున్నట్టనిపించింది. వెంటనే అతడికి మనిషి గొంతుక బిగ్గరగా వినిపించింది.

"ఒరేయ్...వెధవయోగీ...ఏమిటా నడిరోడ్డుమీద తపస్సు చేస్తున్నావు?"

కేశవ్ కళ్ళు తెరిచి చూశాడు. ఏనుగును మించిన ఆ ఆకారం కేవలం తనకు మూడడుగుల దూరంలో నిలబడి వుంది.




కాకీ బట్టలు వేసుకున్న ఒక వ్యక్తి కేశవ్ ముందు నిలబడి అరుస్తున్నాడు.

"ఓయ్ - ముష్టి మునీశ్వరా!...బత కాలని లేదా? నేను గనుక సమయానికి సడన్ బ్రేక్ వేసి వుండకపోతే ఈపాటికి కైలాసయాత్ర చేసి వుండేవాడివి. మల్హార రాగం పాడుకుంటూ ఈ బస్సు నీ మీద నుంచి నడిచి వెళ్ళేది."

కేశవ్ చిరునవ్వు నవ్వి అన్నాడు. "ఎలా వెళ్ళగలుగుతుంది? నేను వీణ వాయిస్తే పిచ్చిపట్టిన పెద్ద పెద్ద ఏనుగులు సైతం లొంగిపోయేవి. చూడరాదూ ఈ జంతువు కూడా లొంగిపోయి ఎలా ఆగి పోయిందో."

"ఒరే పిచ్చి బైరాగీ! ఇది జంతువు కాదు బస్సు... బస్సు- నాకైతే జంతు వులా కనిపిస్తున్నది నువ్వు. ఏ అడవి లోంచి పుట్టుకొచ్చావో గాని..."

"బస్సు అంటే ఇదా?" కేశవ్ దాదాపు ఆశ్చర్యంతో అరిచాడు. వెంటనే రైతు మాటలు గుర్తుకొచ్చాయి. అంతవరకు పరిశీలించని బస్సును పరికించి చూశాడు. బస్సునిండా జనం కూర్చుని వున్నారు.

"ఇది బస్సు... అంటే... ఒక లాంటి రథమన్న మాట. ఇది ఔరంగా బాద్ వెళ్తుందా?" కేశవ్ ఆతృతగా అడి గాడు.

"ఇది రథం కాదు. డీలక్స్ బస్సు. దూర ప్రయాణీకులకోసం వేసిన స్పెషల్ బస్సు. డైరక్టుగా బొంబాయి వెళ్తుంది. రా! వచ్చి బస్సెక్కు. నిన్ను పోలీసు లకు అప్పగిస్తాను. నీకు చావాలని ఉంటే ముందుగా పోలీసులకు చెప్పి తరువాత చద్దువుగాని. నా బస్సుకింద పడి చచ్చి కేసు నా మెడకు ఎందుకు చుట్టబెడతావు?" అని డ్రైవరు కేశవ మెడమీద చేయివేసి ముందుకు నెట్టబోయాడు. కానీ కేశవ్ ఒక్క విసురుతో డ్రైవర్ చేతిని పక్కకు తోసి హుందాగా బస్సులో ఎక్కి కూర్చుంటూ-

"అమరులైన మనుషులు చావుకు భయపడరు. కేవలం అజ్ఞానులు, మూర్ఖులు మాత్రమే భయపడతారు. అయినా నేను చావటానికి కాదు ఈ రోడ్డుమీదకు వచ్చింది. బొంబాయి పోదామనివచ్చాను" అన్నాడు కేశవ్ గంభీరంగా.

"బొంబాయి వెళ్దామనుకుంటున్నావా? కమాన్ ఏదీ టిక్కెట్టు తీసుకో" అన్నాడు కండక్టరు వెంటనే.

"టిక్కెట్టు... అదెలా వుంటుంది?" ఆశ్చర్యపోతూ అడిగాడు కేశవ్.

"నిజంగా నీకు తెలియదా? లేక నన్ను పిచ్చివాడ్ని చేద్దామని చూస్తున్నావా?" అడిగాడు కండక్టర్.

"లేదు తమ్ముడూ నిజంగానే నాకు తెలియదు. నేను ఎక్కడినుంచి అయితే వచ్చానో అక్కడ ఈ తారురోడ్లు, ఈ బస్సులు, ఈ టిక్కెట్లు, ఈ వేగం ఏవీ లేవు" అన్నాడు కేశవ్ అతి నమ్రతగా.

కండక్టర్ బ్యాగులోంచి టిక్కెట్లు రంగు రంగులవి తీసి చూపిస్తూ "ఇదిగో వీటిని టిక్కెట్లు అంటారు. బొంబాయి వెళ్దామనుకుంటున్నావు కదా? అయితే వీటి ల్లోంచి ఒక టిక్కెట్టు తీసుకో" అన్నాడు.

"ఇవ్వు"

కండక్టర్ టిక్కెట్టు తీసిచ్చి డబ్బు లడిగాడు.

"నా దగ్గర డబ్బు లేదు" అన్నాడు కేశవ్.

"అయితే టిక్కెట్టు ఎందుకు చింపిం చావు?" కండక్టర్ అరిచాడు.

"నాకేం తెలుసు ఇది తీసుకుంటే డబ్బులివ్వవలసి వుంటుందని? నేను ఎక్కడినుంచి అయితే వచ్చానో అక్కడ ఎవ్వరూ సంగీతకారుడి దగ్గర డబ్బు అడగరు. నా వీణే నా టిక్కెట్టు. ప్రజలు నా సంగీతాన్ని వినేవారు. నేను కోరుకున్న చోటికి చేర్చేవారు. నీకు తెలుసా? నేటికి రెండు వేల సంవత్సరాలకు పూర్వం నా లాంటి వైణికుడు నోరు తెరిచి అడిగితే చాలు కనకవృష్టి కురుస్తుందని?"

"నేను మాత్రం నువ్వు నోరు తెరచి అడక్కుండానే నీ వీపుమీద గుద్దులవర్షం కురిపించగలను." కోపంతో కేకలు వేస్తున్నాడు కండక్టరు. "ఇస్తే డబ్బులివ్వు? లేదా టిక్కెట్టు వాపస్ చేసెయ్."

"నా దగ్గర నోట్లు లేవు. నారాయణుడున్నాడు. క్షుద్రమైన నోట్ల సంగతి మర్చిపో. నారాయణుడి భజన గీతం వినిపిస్తాను విను శంకరా..." కేశవ్ వీణను అందుకుని ఆలపించబోయాడు. అంతలో కండక్టర్ బెల్లుకొట్టి బస్సును ఆపాడు. "ఈ వెర్రి బైరాగిని పోలీసులకు అప్పగించటం కూడా అనవసరం. పని దండుగ. కాబట్టి వీణ్ని నేనిక్కడ దించేస్తున్నాను" అన్నాడు కండక్టర్ డ్రైవర్‌తో.

"ఎక్కడ దాపురించాడో పొద్దున్నే... దింపు త్వరగా దింపెయ్." "ఏయ్! దిగు త్వరగా!" కండక్టర్ కేశవ్ వైపు తిరిగాడు.

కేశవ్ లేచి నిలబడి జనం వైపు చూస్తూ అన్నాడు "అన్నలారా! మీలో ఎవరైనా నా కోసం ఒక్క టిక్కెట్టు కొంటే నేను అందరికీ వీణ వినిపిస్తాను. ఒక్క టిక్కెట్టు కొనటం వల్ల ఒక్కడి చొక్కా జేబు ఖాళీ అవుతుంది అంతేకదా! కానీ నా వీణ వింటే మీ అందరి ఆత్మల జేబులు బరువుగా నిండిపోతాయి" అన్నాడు హుందాగా.

కానీ అందరూ విచిత్రంగా చూస్తున్నారే కానీ జనంలోంచి ఏ ఒక్కడూ టిక్కెట్టు కొంటానికి ముందుకు రాలేదు. కండక్టర్ మళ్ళీ అరిచాడు, "దిగుతావా? మెడబట్టి కిందకు గెంటమంటావా?"

అతడి మాటలు పూర్తి కాకముందే కేశవ్ బస్సు దిగేశాడు.

* * *

కేశవ్ రోడ్డువెంట నడుస్తున్నాడు.

ఎండ మండిపోతోంది. కాళ్ళు రోడ్డుకు అంటుకుపోతున్నాయి. అయినా కేశవ్ నడుస్తూనే వున్నాడు. మధ్యాహ్నం అయిపోయింది. సాయంత్రమైంది. సూర్యుడు అస్తమించబోతున్నాడు. కేశవ్ వీణను పట్టుకుని నడుస్తూనే వున్నాడు. అంతలో రోడ్డు కవతల కొద్ది దూరంలో గుబురుగా ఎదిగివున్న చెట్లు కనిపించాయి. చెట్ల కొమ్మల వెనుకనించి ఏదో ఆలయపు కలశం సంధ్యా కాంతిలో ధగధగ మెరుస్తూ కనిపించింది. కేశవ్ ఉదయం నుంచీ పచ్చి మంచి నీళ్లైనా ముట్టలేదు. ఆకలి, దాహం విజృంభించాయి. కేశవ్‌ను నిస్సత్తువ ఆవహించుకుంటుండగా వడివడిగా దేవాలయం వైపు నడిచాడు. కేశవ్ దేవాలయపు ప్రాంగణంలోనికి అడుగు పెట్టాడు. చాలా పెద్ద దేవాలయం అది. కానీ చుట్టుపక్కల ఎవ్వరూ వున్నట్టు కనిపించలేదు. మరి కాస్త ముందుకు పోగా ఏపుగా పెరిగి వున్న ఓ నేరేడు చెట్టు నానుకుని ఓ యువతి నిలబడి ఎటో శూన్యంలోకి చూస్తోంది. ఆమె అందమైన గుండ్రటి




మొహంలో ఏదో ఉదాసీనత కనిపిస్తోంది. ఆమె చూపులు ఎండమావుల్లో దిగబడి పోయి వున్నాయి. చాలా అందంగా వుంది. కానీ పగటిపూట చంద్రబింబంలా కళావిహీనంగా వుంది. అన్నీ పోగొట్టుకున్న నైరాశ్యంలో – ఎడారిలో నిలబడి వున్న ఒంటరి పావురంగా కనిపిస్తోంది.

కేశవ్ ఆమెను పరికించి చూశాడు. ఆమె గుండె సహజంగా కాక బాధతో కొట్టుకుంటున్నట్లూ, పెదవులు, శరీరంలో ప్రతి అణువు ఆవేదనతో కంపిస్తున్నట్లూ అనిపించింది. కేశవ్ హృదయం ఆమెపట్ల సానుభూతితో నిండిపోయింది. ఎవరు? ఎవరీమె ?

కేశవ్ త్వరత్వరగా ఆమెకు దగ్గరగా నడిచి పక్కనే నిలుచున్నాడు. ఆ యువతి కేశవ్ వేపు ఒక్కసారి చూసి అంతలోనే మొహం తిప్పేసుకుని అక్కడ నుంచి కదిలి ముందుకు వెళ్ళిపోయింది. కేశవ్ ఆమెను అనుసరించాడు. దేవాలయపు ముఖద్వారం దాటి లోపలికి అడుగు పెట్టాడు. కిందకు దిగటానికి మెట్లు కనిపించాయి. వాటికి ఎదురుగా విశాలమైన ఆలయ ప్రాంగణం, చుట్టూ ఎత్తుగా రాతి గోడ కట్టబడి వుంది. ఓ మూలన బావి వుంది. మరో మూలన పెద్ద అరుగు, దాని పక్కనే నాలుగు తెల్లటి స్తంభాలమీద నిలబడి వున్న మండపం వుంది. మండపం మధ్యలో శివలింగం ప్రతిష్ఠించబడి వుంది. పైన అర్చన గంట వేలాడుతోంది. జాజి తీగలు నాలుగు స్తంభాలను పెనవేసుకుని మండపం పైభాగం వరకు పాకివున్నాయి. అది దాటితే తెల్లటి గోడలతో వున్న పెద్ద దేవాలయం... పైన బంగారు కలశం మెరుస్తోంది.

ఆ యువతి నెమ్మదిగా మెట్లు దిగి బావి దగ్గరకు నడిచింది. బావిలో చేద వేసి ఒక చేదెడు నీళ్లు తోడింది. కేశవ్ ఉదయం నుంచి నీళ్లు కూడా తాగలేదు. ఆ యువతి తోడిన నీళ్లు చూసేసరికి దాహం ముంచుకొచ్చింది. చకచకా బావి దగ్గరకు నడిచి దాహం అన్నట్టు సంజ్ఞ చేశాడు. ఆ యువతి చేదను కేశవ్ ముందుంచింది.

కేశవ్ కడుపు నిండా నీళ్ళు తాగాడు. మొహం, కాళ్ళూ, చేతులూ శుభ్రంగా కడుక్కున్నాడు. తలమీద కాసిన్ని నీళ్ళు చల్లుకున్నాడు. ధోవతి నీళ్ళల్లో తడిపి వీపు తుడుచుకున్నాడు. అంతా అయ్యేసరికి ప్రాణం కుదుట పడినట్టు అనిపించింది.

అప్పటివరకూ మౌనంగా బొమ్మలా వున్న యువతి హఠాత్తుగా అంది– "మా నాన్న మీ కోసం ఎదురు చూస్తున్నారు"

కేశవ్ దిగ్గున ఆమె వైపు చూశాడు.

"ఎవరు మీ నాన్న? నాకోసం ఎందుకు చూస్తున్నారు? ఆయనకు నేనెలా తెలుసు?" అంటూ ఆశ్చర్యపడి పోయాడు.

కేశవ్ ఆలోచిస్తున్నాడు. అసలీ అమ్మాయి ఎవరు? ఈమె తండ్రి ఎవరై వుంటారు? నేను ఇక్కడకు వస్తున్నట్టు ఆయనకెలా తెలుసు? అనేక సందేహాలు చుట్టుముట్టాయి.

ఆ మాట అనేసి ఆ యువతి ముందుకు నడిచింది. ఆమె వెనుకే కేశవ్. ఇద్దరూ మండపం వద్దకు చేరుకున్నారు. మండపం మధ్యలో ప్రతిష్ఠించబడివున్న శివలింగాన్ని అంతకుముందెవరో పూజించినట్టున్నారు. చుట్టూ పాలు చింది కనిపిస్తు

న్నాయి. శివలింగం నిండుగా పూలహారాలతో అలంకరించబడి వుంది. మనోహరంగా కనిపిస్తున్న శివలింగాన్ని చూడగానే మనసంతా ఆనందంతో నిండిపోయింది. శివలింగం దగ్గరకు నడిచాడు. పైన వ్రేలాడుతున్న అర్చన గంటను మ్రోగించి, శివుడ్ని ధ్యానించాడు. సాష్టాంగ ప్రణామాలు చేశాడు.

అతనలా మండపంలో ఆగిపోవటం చూచి ఆ యువతి కూడా ఆగిపోయింది. మండపం స్తంభానికి చేరగిలబడి కేశవ్ వైపు ధ్యానంగా చూస్తోంది. కేశవ్ పూజ ముగించి తను కూడా ఆ యువతి వైపే చూస్తుండిపోయాడు. కేశవ్ తనవైపు పరీక్షగా చూస్తున్నాడని తెలియగానే ఆమె కంగారుపడిపోయింది. తడబడుతున్న అడుగులతో ఆలయం వెనుక భాగానికి నడవసాగింది.

కేశవ్ ఆమె వెనక మందిరం వెనక వైపుకు చేరుకున్నాడు. మందిరం వెనక భాగమంతా పచ్చటి గడ్డితో నిండి ఉంది. కొంచెం అవతలగా చాలా గదులూ, బారాటి వరండా వున్న పెద్ద ఇల్లు కనిపించింది. ఒక్క గది తప్ప మిగతా గదుల తలుపులన్నీ మూయబడి వున్నాయి. తలుపులు తెరచివున్న గదిలోంచి పచ్చటి వెలుతురు బయటకు ప్రతిఫలిస్తోంది. ఆమె ఆ గది ముందుకు చేరుకుని ఒక్క క్షణం పాటు వెనుతిరిగిచూసి లోపలకు వెళ్ళిపోయింది.

కొద్ది నిమిషాలు కేశవ్ గది బయటే వుండిపోయి, తనూ లోపలికి నడిచాడు. చిన్నదీ పెద్దదీ కాని ఆ గదిలో ఒక మూలన కుక్కిమంచంలో ఓ ముసలాడు పడుకుని వున్నాడు. తలా, గెడ్డం తెల్లగా నెరిసిపోయి వున్నాయి. గూట్లో చిన్న దీపం వెలుగుతోంది. ఆ వెలుగులో ముసలి వ్యక్తి చాలా సేపటివరకు కేశవ్‌ను గుర్తించలేకపోయాడు.

చివరికి కేశవ్‌ను గుర్తుపట్టినట్టుగా అతడి మొహంలో కొత్త కాంతి ఏదో తొంగిచూసింది. చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేస్తూ "వచ్చేశావా బాబూ! నీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"నా కోసం ఎదురుచూస్తున్నారా?" కేశవ్ ఆశ్చర్యంగా అడిగాడు. "అవును బాబూ! నీ కోసమే నా ప్రాణం ఇంకా నిలిచి వుంది. నువ్వు వచ్చి చాలా మంచి చేశావు. నువ్వు అతగాడివే అని నాకు నిశ్చయంగా తెలుసు. నిన్ను నా వద్దకు పంపుతానని భగవంతుడు మాటఇచ్చాడు. అన్న ప్రకారమే నిన్ను పంపించాడు. ఇక నేను నిశ్చింతగా కన్నుమూస్తాను. అలా దూరంగా నిలబడ్డావేం? దగ్గరకు రా నాయనా! శోభా...నువ్వు కూడా దగ్గరకు రా తల్లీ" అని ముసలివాడు ఇద్దరినీ దగ్గరకు పిలిచాడు.

కేశవ్ ముసలి వ్యక్తి దగ్గరకు నడిచాడు. ఆ యువతి కూడా జంకుతూవచ్చి కేశవ్ పక్కన నిలబడింది. ఆమె ముఖం సిగ్గుతో ఎర్రబారి వుంది.

కేశవ్ ముసలి వ్యక్తి ముందుకు మరి కాస్త జరుగుతూ-"మీరు నా కోసం ఎందుకు ఎదురుచూస్తున్నారు? మీరు నాకు పూర్తిగా అపరిచితులు. మనిద్దరి మధ్యన కనీస పరిచయం కూడ లేదు. చూడబోతే మీరు మోసపోతున్నట్టున్నారు. మీరు ఎదురుచూస్తున్న వ్యక్తి మరొకరు అయి వుంటారు" అన్నాడు.

"నేను మోసపోవటం లేదు. స్వయంగా ఆ శంకరుడే నిన్ను నా దగ్గరకుపంపాడు"





అన్నాడు ముసలి వ్యక్తి అతి నెమ్మదిగా.

"శంకరుడు పంపాడా?" కేశవ్ ఒళ్ళు ఒక్కసారే జలదరించింది. "అవును. నిన్న రాత్రి శివుడు నా కలలో దర్శన మిచ్చాడు" ముసలి వ్యక్తి నెమ్మదిగా చెప్పుకుపోతున్నాడు "కనిపించి నీచింత నాకు తెల్సు. నీ ఏకైక పుత్రిక శోభ గురించే కదూ నువ్వు దిగులుపడిపోతున్నావు. విచారించకు. రేపు సాయంత్రం సూర్యాస్తమయ వేళ ఒక బాటసారి ఈ ఆలయం దగ్గరకు వస్తాడు. అతడే నీ శోభకు భర్త. నీ కూతుర్ని అతడి చేతుల్లో పెట్టి నువ్వు నిశ్చింతగా స్వర్గానికి చేరుకో అన్నాడు."

"ఇదిగో ఆ క్షణం ఇప్పుడొచ్చింది" ముసలివ్యక్తి అతి కష్టమ్మీద లేచి కూర్చు న్నాడు. కేశవ్‌ను, ఆ యువతిని దగ్గరగా పిలుచుకున్నాడు. ఆ యువతి చేతిని కేశవ్ చేతిలో వుంచుతూ "శివుడు ఈ భారాన్ని నా నుంచి నీకప్పగించమన్నాడు. ఈమెను స్వీకరించు."

"కానీ పూజారిగారూ! నా మాటకూడా కాస్త వినండి" కేశవ్ కంగారు పడిపోతూ అన్నాడు. కానీ అప్పటికే ముసలివ్యక్తి ప్రాణం చివరి ఘడియల్లో వుంది. అతని కళ్ళు తేలిపోతున్నాయి. కాళ్ళు బిగుసుకు పోతున్నాయి. ఆ మరుక్షణంలోనే ముసలి వ్యక్తి నిర్జీవంగా పక్కకు ఒరిగిపోయాడు. యువతి ఒక్క గావుకేక వేసి ఏడుస్తూ కూలబడింది. కేశవ్ నిశ్చేష్టుడై అలా చూస్తుండిపోయాడు.

చాలా సమయం అలానే గడిచి పోయింది. తరువాత ఇద్దరూ బయటకు వచ్చి మసకగా వున్న వెన్నెల్లో దేవా లయపు అరుగుమీద కూర్చున్నారు. శోభ బుగ్గలమీద కన్నీళ్ళు ఎండిపోయి చారలు కట్టాయి. ఇప్పుడామె ఏడ్వటంలేదు. కానీ ఆమె గుండెల్లో బాధతో నిండిన అగ్ని తాలూకు పొగలు వస్తున్నాయి. అప్పు డప్పుడూ చిగురుటాకులా ఒణికిపోతోంది. అంతలోనే తననుసంబాళించుకుని కూర్చుం టోంది.

కేశవ్ ఆమెవైపు చూడటంలేదు. అత డింకా ఆశ్చర్యంలోంచి తేరుకోలేదు. ఎన్ని విధాలుగా ఆలోచించినా 'శివుడు ఇలా ఎందుకు చేశాడు? ఇదెలా సంభవం?' అన్నది తోచడం లేదతడికి.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" నెమ్మ దిగా అడిగింది శోభ.

"అదే మీ తండ్రిగారి కల గురించి ఆలోచిస్తున్నాను" అన్నాడు కేశవ్.

"కలా లేదు, పాడూ లేదు" శోభ మండిపడుతూ అంది. "గత ఆరేడు సంవ త్సరాలుగా నాకు సంబంధాలొస్తున్నాయి. ఎందరో నన్ను చేసుకుంటామని ముందుకు వస్తున్నారు. ఎందుకంటే నేనీ ఆలయ పూజారికి ఏకైక కుమార్తెను. నాకు భర్త అయినవాడే ఈ ఆలయానికి పూజారి అవుతాడు. ఈ ప్రాంతంలోనే ఇంత పెద్ద ఆలయం మరొకటి లేదు. ప్రతి సంవ త్సరం ఇక్కడ తిరునాల జరుగుతుంది. పూజలు ఘనంగా జరుగుతాయి. కానుకలు విపరీతంగా వస్తాయి. బోలెడు డబ్బు పోగవుతుంది. ఇవేకాక దేవుడి పేరుమీద కొంత వుంది. కాబట్టి నేను చాలా అదృష్ట వంతురాల్ని, ధనవంతురాల్ని. అందరికీ ఈ విషయాలు తెలుసు. మా బంధువులు, బయటివాళ్ళు ఎన్నో సంబంధాలు తీసుకుని మా తండ్రిచుట్టూ తిరిగేవారు. కానీ ఆయన మాత్రం నా పెళ్ళి చేయటానికి సిద్ధంగా లేరు!"

"ఎందుకని?" కేశవ్ ఆశ్చర్యంగా అడి గాడు.

"నా పెళ్ళి జరిగిన తరువాత తన పూజారి పదవిని, ఆలయ అధికారాన్ని అల్లుడికి కట్టబెట్టవలసి వుంటుంది. తన చేతుల్లో వున్న అధికారాలను అల్లుడికిచ్చి తను ఒట్టి చేతులతో కూర్చోవటానికి ఆయన సిద్ధంగా లేడు. ఆయన ప్రాణం దానికి అంగీకరించదు. అయితే నా గురించిన బాధకూడా ఆయనకు వుంది. అయితే తన అధికారాలన్నీ నా కోసం త్యాగం చేసేంతవరకూ అది రాలేదు. అందుకని ఆయన చివరి క్షణం వరకు అటు తన స్వార్థపరత్వంతో, అధికారపు మోజుతో, మరోవైపు కొద్దిగా నా పెళ్ళి గురించి ఆలోచిస్తూ దోలాయమానంగా కాలాన్ని వెళ్ళబుచ్చేశారు. ఎన్ని సంబంధాలు వచ్చినా తిప్పికొట్టారు. దాంతో అందరూ విసుగెత్తిపోయి రావటం మానేశారు. బంధువు లందరూ ఈయన బతికివుండగా నా పెళ్ళి చేయడని తిట్టిపోసి, మాతో వున్న కొంత వ్యాలసు





తెంచేసుకున్నాడు. అయినా ఆయన తన అధికారాల్ని వదులుకోవటానికి సిద్ధపడలేదు. పైగా నన్ను ఆయన అధికారాల్ని లాగివేసుకోవటానికి పుట్టిన శత్రువులా చూసేవాడు. చాలా రోజులుగా ఆయన ఆరోగ్యం బావుండలేదు. ఈ మధ్య మరీ పాడైంది. డాక్టర్ చూసి ఇంక లాభం లేదన్నాడు. చివరికి నిన్న ఆయన నా మీద మండిపడి 'రేపు సాయంత్రవేళ ఈ ఆలయం దగ్గరకు ఎవడొస్తే వాడే నీ భర్త. వాడు ఎవడైనా సరే వాడికిచ్చి నీ పెళ్ళి జరిపించేస్తాను. ఇంక వెళ్ళు నా ముందునుంచి' అని కసిరి కొట్టాడు.

నేను ఏడ్చుకుంటూ బయటకొచ్చేశాను. ఇవ్వాళ ఉదయం నుంచి ఆ నేరేడు కింద నిలబడి చూస్తుండిపోయాను"

"ఎందుకు ? ఎవరొస్తారో చూద్దామనేనా ?" అడిగాడు కేశవ్.

అంతవరకు ఆవేశంగా అంతా చెప్పుకొచ్చి శోభ ఇప్పుడు అవునన్నట్టు నెమ్మదిగా తలాడించింది.

"మరి ఆ వచ్చినవాడు నీకునచ్చాడా" అడిగాడు కేశవ్. శోభ కళ్ళెత్తి కేశవ్ మొఖంలోకి చూసింది. అంతలోనే సిగ్గుపడిపోయి తల వంచేసుకుని కళ్ళు రెపరెప లాడిస్తూ అంది "మీరు మా తండ్రి కలలో వ్యక్తి కన్నా చాలా అందంగా వున్నారు"

కంగారు పడుతూనే ఆ మాట అంది శోభ. అన్న తరువాత మరికాస్త కంగారు ఎక్కువై సిగ్గుగా మారిపోయింది. ఆమె అక్కడనుంచి లేచి వెళ్ళి స్తంభం వెనుక తనను తాను దాచేసుకుంది.

వెన్నెల చల్లగా కాస్తోంది. మండపం మీద పాకివున్న జాజి తీగ సువాసనలు వెదజల్లుతోంది. ఆ తెల్లటి నిశ్శబ్దంలోంచి ఏదో మౌనరాగం నెమ్మదిగా వినిపిస్తోంది. కేశవ్ ఆలోచిస్తున్నాడు.

నిజానికిప్పుడు తనా యువతిని దగ్గరగా తీసుకుని ఒడిలో పడుకోబెట్టుకుని ఆమె కన్నీళ్ళు తుడిస్తే ఆమెకు ఎంతైనా ఓదార్పు లభిస్తుంది. చెదిరివున్న ఆమె ముంగురులు సవరిస్తే ఆమె బాధ కొంత వరకు దూరం అవుతుంది. కానీ తన మనస్సు చల్లగావుంది. ఆమెపట్ల ఎలాంటి ఆసక్తి చూపించటంలేదు. పైగా ఆ పూజారి కల కూడా అబద్ధమని తేలిపోయింది. కాబట్టి అలా చేయకున్నా పర్వాలేదు. శివుడి ఆజ్ఞ మీరినట్టు అవదు. అయినా శివుడు అలా వాగ్దానం ఎలా చేయగలడు. అందునా తనపట్ల. కానీ ఆ మరణించిన ముసలివాడి ఆత్మ సంగతేమిటి? తన కూతుర్ని స్వీకరించానన్న తృప్తితో కళ్ళు మూశాడు. అదీ కాక ఈమెకెలా జవాబు చెప్పాలి? ఈమె మనస్ఫూర్తిగా తనను భర్తగా భావిస్తోంది.

అసలు తనీ ప్రపంచానికే చెందిన వాడ్ని కాదనీ, మరో రాతి ప్రపంచం నుంచి వచ్చిన వాడిననీ, తన ఆయుర్దాయం కేవలం ఒక్క సంవత్సరమేననీ ఆమెతో ఎలా చెప్పటం ? ఒకవేళ తను ఈమెను భార్యగా స్వీకరిస్తే- ఒక్క సంవత్సరం తరువాత ఆమె విధవ అయిపోతుంది. ఇది మోసం. అంత పెద్ద నేరాన్ని ఈ అమాయకురాలి పట్ల చేయటం పాపం.వద్దు అలాజరక్కూడదు. ఆమెతో చెప్పేయాలి.... తప్పదు...!

కేశవ్ ఈ రకంగా ఆలోచించుకుంటూ కూర్చుని వున్నాడు. ఇంతలో ఐదుగురు మనుషులు చేతుల్లో లావాటి కర్రలు పట్టుకుని ఆలయ ముఖద్వారం దాటి లోపలకు ప్రవేశించారు. మెట్లు దిగి ఆలయ ప్రాంగణంలోని కడుగు పెట్టారు. వాళ్ళు వస్తున్న అలికిడి వినిపించగానే శోభ ఉలికి పాటుతో అటు చూచింది. మరుక్షణమే స్తంభం చాటు నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి కేశవ్ పక్కన నిలుచుంది. కేశవ్ కాళ్ళు కిందకు జార్చుకుని అరుగు మీద అలాగే కూర్చునివున్నాడు.

"ఎవరు వాళ్ళు?" కేశవ్ నెమ్మదిగా అడిగాడు. శోభ చెప్పింది."వీళ్ల పక్కనే వున్న వూళ్ళో వుంటుంటారు. మాకు దగ్గర బంధువులే. కానీ మా నాన్నకూ వీళ్ళకూ మధ్య విరోధముంది. వీళ్ళు ఎన్నోసార్లు నన్ను తమ కోడలిగా చేసుకుంటామని వచ్చారు. కానీ మా నాన్న పడనీయలేదు. వాళ్ళిద్దరూ మాత్రమే




నాకు తెలుసు. మిగతా ముగ్గురు ఎవరో నాకు తెలియదు"

కర్రలు పట్టుకునివున్న ఆ ఐదుగురు మనుషులు వచ్చి కేశవ్‌కు అతి దగ్గరగా నిలుచున్నారు. వాళ్ళలోంచి ఒక యువకుడు శోభను అడిగాడు-

"మీ నాన్న ఎక్కడున్నాడు ? మేం ఆయన్ని కలవాలని వచ్చాం"

"పాపం వాళ్ళ నాన్నగారు కొద్ది గంటల క్రితమే మరణించారు"

కేశవ్ జవాబిచ్చాడు.

"మీరెవరు?" ఆ యువకుడు కేశవ్ వైపు తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"ఆయన నా భర్త. ఈ రోజునుంచి ఈ ఆలయానికి అధికారి" శోభ హటాత్తుగా జవాబిచ్చింది.

"ఇతను నీ భర్త ఎలా అయ్యాడు? ఇంతలోనే ఈ ఆలయానికి అధికారి ఎలా అయ్యాడు? పెళ్ళి ఎప్పుడు నిశ్చయమైంది? లగ్నం ఎప్పుడు జరిగింది? అబద్ధం చెబుతున్నావు. తండ్రి మరణించగానే నీ ప్రియుణ్ని రప్పించుకుని ఆలయానికి అధికారిని చేద్దామని చూస్తున్నావు. ఈ ఆలయపు అధికారాలు మా వంశం వాళ్ళవి. ఈ రోజునుంచి దీనికి హక్కుదారులం, వారసులం మేము అవుతాం. ఎవరో బయటి వ్యక్తి వచ్చి ఇక్కడ అధికారం చెలాయించటానికి వీల్లేదు"

వచ్చిన ఐదుగురు దాదాపు గర్జిస్తున్నట్లు మూకుమ్మడిగా ఒక్కసారే పలికారు.

వాళ్ళ మాటల వెనుక, వాళ్ళ ప్రశ్నల వెనుక దాగి వున్న క్రోధంలో ఆ ఆలయపు అధికారాల మీద మోజు, డబ్బుమీది వ్యామోహం నగ్నంగా కనిపిస్తుండగా - కేశవ్ వాళ్ళకు జవాబు చెప్పటానికి వుద్యుక్తుడవుతున్నంతలోనే వాళ్ళు కేశవ్‌ను అరుగుమీద నుంచి దిగలాగారు. ఇద్దరు ముగ్గురు కేశవ్‌ను గట్టిగా పట్టుకున్నారు. శోభ నోటి నుండి ఒక ఆర్తనాదం వెలికి వచ్చింది.

"ఎక్కడ నుంచి వచ్చావురా?" ఒకడు అడిగాడు.

"నీ పేరేమిటిరా?" మరొకడు అడిగాడు.

"నీ జాతేమిటిరా?" ఇంకొకడు అడిగాడు.

"నాది రాతి జాతి" కేశవ్ గంభీరంగా జవాబిచ్చాడు.

"ఈ కర్రలు నీ తలను చితకబాదినప్పుడు నీ జాతి దానంతటదే బయటపడుతుంది" క్రోధంగా అన్నాడొకడు. మరొకడు విసురుగా కర్రను పైకెత్తి కేశవ్‌ను కొట్టబోయాడు. కేశవ్ ఒడుపుగా ఆ కర్రను పట్టుకుని లాగేసుకున్నాడు మిగతావాళ్ళు ఒక్కసారిగా విరుచుకు పడ్డారు.

కేశవ్ వాళ్ళ మధ్య శివతాండవం చేస్తున్నట్టు పోరాడుతున్నాడు. కానీ కేశవ్ ఒక్కడు. వాళ్ళు ఐదుగురు. ఎంతకని పోరాడగలడు? చివరికి కేశవ్ అలసిపోయాడు. వాళ్ళు విజృంభించారు. కేశవ్‌ను కొట్టుకుంటూ ఆలయం బయటకు తీసుకొచ్చారు. కసితీరా చితకబాదారు. స్పృహతప్పిన కేశవ్‌ను తారు రోడ్డు మీద పడేసి "రాత్రికి అడవిలోంచి తోడేళ్ళు వచ్చి వీడ్ని పీక్కు తినేస్తాయి. "పదండి పోదాం" అనుకుంటూ వెను తిరిగి ఆలయం వైపుగా వెళ్ళిపోయారు.

రోడ్డు నిర్జనంగా వుంది. పక్క వూరిలో కుక్కలు మొరుగుతున్న శబ్దం వినిపిస్తోంది. ఆ రోడ్డుమీద సగం జీవంతో

కొట్టుకులాడుతున్నాడు కేశవ్. ఒంటి నిండా గాయాలు. రక్తం పారి రోడ్డుమీద నల్లగా మెరుస్తోంది. ఎక్కడో దూరంగా శివుడు నవ్వుతున్నాడు.




కేశవ్ కళ్ళు తెరచి చూసే సరికి – స్వచ్ఛమైన గాలి వీస్తున్న గదిలో తెల్లటి దుప్పటి పరచి వున్న పరుపు మీద తను పడుకుని వున్నట్టు గమనించాడు. ఒంటి నిండా, తల చుట్టూ కట్లు కట్టి వున్నాయి. కొద్ది నిమిషాలసేపు కళ్ళు మూసుకుని, మళ్ళీ తెరిచి చుట్టూ పరికిలిస్తూ పైకప్పు వేపు చూశాడు.

సీలింగ్ ఫ్యాన్ మెల్లిగా తిరుగుతోంది. కేశవ్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు. తనంతట తానుగా తిరుగుతున్న ఈ వస్తువేమిటి? అతను మళ్ళీ తన వంటి వేపు చూసుకున్నాడు. ఒళ్ళంతా పచ్చి పుండులా వుంది. హఠాత్తుగా రాత్రి జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. వెనువెంటనే కేశవ్ నోటి వెంట సన్నటి మూల్గు బయటకొచ్చింది. అప్పటివరకు కేశవ్ మంచం పక్కనే కుర్చీలో కూర్చుని సీరియస్‌గా పేపరుచదువుతుంటున్న వ్యక్తి మూల్గువిని కేశవ్‌ని చూసి చిరునవ్వు నవ్వాడు. అంతవరకు ఆ వ్యక్తినే గమనించలేదు కేశవ్. ఆ వ్యక్తి బలిష్టంగా, ఎత్తుగా వున్నాడు. మొహం మీద గాయాల మచ్చలేవో వున్నాయి. అతని కళ్ళు కూడా కేశవ్‌కి వలెనే నీలిరంగులో వున్నాయి.

ఆ వ్యక్తి చిరునవ్వు నవ్వుకుంటూనే లేచాడు. టీపాయ్ మీదున్న ఫోన్ దగ్గరకు వెళ్ళి ఏదో నెంబర్ డైల్‌చేసి అవతలివ్యక్తితో ఆంగ్లంలో మాట్లాడాడు. "హలో...కెర్రీ...ఆయనకు స్పృహ వచ్చింది. నువ్వు వెంటనేరా'' అని చెప్పి ఫోన్ పెట్టేశాడు. కేశవ్ ఈసారి మరింత ఆశ్చర్యంతో చూస్తుండిపోయాడు. ఆ సీలింగ్ ఫ్యానేమిటో? ఆ ఫోను ఏమిటో అతడికేమాత్రం అంతు పట్టలేదు. కనీసం తను ఏ స్థలంలో వున్నాడో కూడా తెలియలేదు. ఒకవేళ మరణించి ఏదో దేవతలలోకానికి వచ్చి చేరుకోలేదు కదా! అనిపించింది.

కేశవ్ అలా ఆలోచిస్తుండగానే ఒక యువతి గదిలోకి అడుగు పెట్టింది. సన్నగా పొడవుగా వుంది. నెమ్మదిగా నడుస్తోంది. చిరునవ్వు చిందిస్తోంది. ఆమె జుత్తు దాడంకాయ రంగులో వుంది తాకకుండానే మెత్తగా వుండి వుంటుందని తెలిసిపోతోంది. ఆ యువతి కేశవ్ దగ్గరగా వచ్చి పక్కనే మంచం మీద కూర్చుంది. ఆ యువతి శరీరంలోంచి ఒకవిధమైన సుగంధ పరిమళం గుప్పున కేశవ్‌ను తాకింది. ఆమె కేశవ్ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ కరుణ నిండిన స్వరంతో అడిగింది, "ఇప్పుడెలా వుంది?''

ఇందాకటి వ్యక్తి మాట్లాడిన భాష కేశవ్‌కు అర్థంకాలేదు, కానీ ఈవిడ కేశవ్‌కు తెలిసిన భాషలోనే మాట్లాడుతోంది. అయితే అది ఈవిడ మాతృభాష కాదు. నేర్చుకుని మాట్లాడుతోంది అని

పించింది.

"నేనెక్కడున్నాను? మీరెవరు?" కేశవ్ అడిగాడు.

"మీరు మా యింట్లో వున్నారు. నా పేరు క్రైరీ లీన్ టాంసన్. అందరూ 'క్రైరీ' అని పిలుస్తారు. పీరు మా డాడీ. పేరు టాంసన్" కుర్చీలో కూర్చుని వున్న వ్యక్తిని చూపిస్తూ అంది.

టాంసన్ జవాబుగా మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

"నన్ను మీరు ఎక్కడనుంచి తెచ్చారు?" అడిగాడు కేశవ్. క్రైరీ చెప్పింది- "మీరు ఔరంగబాద్ రోడ్డుమీద పడి వున్నారు. మీ శరీరం రక్తసిక్తమై గాయాలతో నిండిపోయి వుంది. అప్పుడు మా కారు అటుగా వచ్చి వుండకపోతే మీరు జీవించి వుండేవారు కాదు. అప్పటికే మీ ప్రాణం సంకట స్థితిలో వుంది."

కేశవ్ అంతరాంతరాల్లో నిశ్శబ్దంగా నవ్వుకున్నాడు. శివుడు ఒక సంవత్సరం ఆయుర్దాయాన్ని ప్రసాదించగా తను మరణించటమా? అసంభవం. కానీ అది బయటకు చెప్పకుండా ధన్యవాదాలు తెలియజేశాడామెకు.

ఎత్తుగా భారీగా వున్న టాంసన్ కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళబోతూ "నేను మ్యూజియం వరకు వెళ్తొస్తాను. డాక్టర్ సాయంత్రం వస్తానన్నాడు. ఇంకేమైనా కావలసినవి వున్నాయా?" క్రైరీని అడిగాడు.

"లేవు" క్రైరీ ఒక్కమాటలో జవాబిచ్చింది.

కేశవ్ అనుకున్నాడు. ఈ అమ్మాయి ఎంతో తూచి తూచి మాట్లాడుతోంది. చటుక్కున సమాధాన మిచ్చేస్తోంది. ఆ రోజుల్లో ఆడవాళ్ళు ఇలా మాట్లాడేవాళ్ళు కాదు. ఇలాంటి దుస్తులూ ధరించే వారు కాదు. ఇలా మగవాళ్ళ కళ్ళల్లో కళ్ళు పెట్టి మాట్లాడేవాళ్లు కాదు. ఆ స్త్రీలు ఎంత అందంగా వుండేవాళ్ళు! బాదంకాయల ఆకారంలో కళ్లు. ఆ కళ్ళ రెప్పలమీద సిగ్గు బరువుగా తూగుతూండేది. వాళ్ళు మాట్లాడే తీరు అతి కోమలంగా, అతి సున్నితంగా వుండేది. మగవాళ్ళను చూస్తేనే కంపించిపోయేవారు. మరి ఈనాటి స్త్రీలు ఏ రకానికి చెందినవారనుకోవాలి?

"మీ స్వస్థలం ఏది?" అడిగాడు కేశవ్ ఆలోచనల్లోంచి తేరుకుని.

"అమెరికా"

"అమెరికా! అదెక్కడుందీ?"

"మీరు పడుకుని ఉన్న చోటికి ఖచ్చితంగా కింద భాగములో. ఈ భూ భాగానికి రెండో వైపు."

కేశవ్ అన్నాడు "ఓహో అయితే మీరు పాతాళవాసులన్నమాట?"

"అవును."

"అలాగా!" కేశవ్ లోపల్లోపలే నవ్వుకుంటూ సంకోచం లేని స్వరంతో "అక్కడ మాయల ఫకీర్లు, మంత్రగాళ్ళు ఇప్పటికీ ఉన్నారా?" అడిగాడు.

"మాయల ఫకీర్లు, మంత్రగాళ్లు ఏనాడో మట్టిలో కలిసి పోయారు. మిస్టర్! అయినా మీరు ఏ యుగం నాటి మాట అడుగుతున్నారు" క్రైరీ ఆశ్చర్యంగా చూసింది.

కేశవ్ నొచ్చుకుంటున్నట్టు క్రైరీవైపు చూస్తూ "నేను పాత పుస్తకాల్లో చదువుకున్నాను లెండి" అన్నాడు.

"విచిత్రదేశపు మనుషుల్లా వున్నారు ఇక్కడి వాళ్ళు. ఎప్పుడూ పాత పుస్తకాలు, పాత విషయాలుగురించి మాట్లాడుతుంటారు. కొంచెమైనా ఆధునికత లేదు.

ఇక్కడకు వచ్చింది మొదలుకుని ఇలాంటి మాటలే అందరి నోటివెంట వింటున్నాను" క్రైరీ కాస్త విసుగునిండిన స్వరంతో అంది.

కేశవ్ అన్నాడు "ప్రాచీన శాస్త్రాల్లో ఎన్నటికీ మారని శాశ్వత సత్యాలు దొరుకుతాయి."

"ఏవి...అమెరికాలో మంత్రగాళ్ళు, మాయల పకీర్లు వుంటారు; ఇలాంటి సత్యాలేనా?" వ్యంగ్యంగా అంది క్రైరీ.

"వాళ్ళూ మనుషులే- మనమూ మనుషులమే. అంతా ఆ భగవంతుడి మాయ" అన్నాడు కేశవ్ గంభీరంగా.

క్రైరీకి ఎలాంటి కోపం వచ్చిందంటే వెంటనే పకాపకా నవ్వేసింది. ఒక్కోసారి వచ్చే కోపంలో మనం నవ్వటం తప్ప మరేమీ చేయలేని స్థితిలో వుంటాం. అదీ గాక ఈ భారతీయ క్షతగాత్రుడు క్రైరీకి బాగా నచ్చాడు. దట్టంగా ఎదిగివున్న అతడి జుత్తు, ఆ ఎర్రటి గెడ్డం తీసేస్తే కేశవ్ ఆధునిక మన్మథుడిలా- అత్యంత మనోహరంగా- చూడగానే గుండెలకు హత్తుకోవాలనిపించే విధంగా వుంటాడు.

"సారీ నేనింతవరకూ మీ పేరేమిటో కూడా తెలుసుకోలేక పోయాను" అంది క్రైరీ.

"కేశవ్"

"ఏం చేస్తుంటారు?"

"వీణ వాయిస్తాను"

"నిజంగానా?" క్రైరీ ఆనందంతో అరిచింది.

"మేము ప్రాచీన భారతదేశ సంగీతం మీద పరిశోధన చేయాలని హార్వర్డ్ నుంచి భారతదేశం వచ్చాం. మా పరిశోధనా కాలం ఐదు సంవత్సరాలు. జానపద, శాస్త్రీయ సంగీతాలు రెండూ మా పరిశోధనలో వున్నాయి. సితార్, వయోలిన్ కన్నా వీణ చాలా పాత వాయిద్యం కదా?" క్రైరీ చకచకా చెప్పుకుపోయింది.

"సితార్ అంటే ఏమిటి?"

"మీకు సితార్ అంటే తెలియదా?"

"తెలియదు. ఆ రెండో పేరేమిటి చెప్పారు?" కేశవ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"వయోలిన్....వయోలిన్."

క్రైరీ కళ్ళు ఆశ్చర్యంతో ఇంతలేసయ్యాయి. "సితార్, వయోలిన్ అంటేనే మీకు తెలియదు. మీరెలాంటి వైణికులండీ బాబు. అయితే మీరు అబద్ధం చెప్పి వుండాలి లేదా పిచ్చివాళ్ళై వుండాలి" అంది క్రైరీ. "నేను ఎక్కడనుంచి అయితే వచ్చానో అక్కడ ఎవరికీ సితార్ అంటే ఏమిటో, వయోలిన్ అంటేఏమిటో బొత్తిగా తెలియదు. నేను ఎన్నటికీ అబద్ధం చెప్పను. ఎందుకంటే నేను ఎక్కడినుంచి అయితే వచ్చానో అక్కడ అబద్ధానికి మించిన పాపం మరొకటి లేదు"

"మీరు ఎక్కడ నుంచి వస్తున్నారు?" క్రైరీ అడిగింది.

"చాలా దూరం నుంచి" కేశవ్ జవాబిచ్చాడు.

"అంటే ఎంత దూరం?" క్రైరీ మళ్ళీ అడిగింది.

"రెండు వేల సంవత్సరాల దూరం" కేశవ్ వాస్తవం నిండిన స్వరంతో అన్నాడు.

క్రైరీ మళ్ళీ వ్యంగ్యంగా అంది "ఈ దేశంలో ముఖ్యంగా రెండు రకాల మనుషులు కనిపిస్తారు. ఒక రకం అచ్చం పాశ్చాత్య ధోరణిలో మాట్లాడితే, మరో రకం సామెతలు పొడుపుకథల ధోరణిలో మాట్లాడతారు."

 

"మీరే రకం వాళ్ళను ఇష్టపడతారు?" కేశవ్ ఉత్సుకతతో అడిగాడు. కైరీ ఒక్క క్షణం విశాలంగా వున్న కేశవ్ నీలి కళ్ళల్లోకి చూస్తూ మరుక్షణంలోనే వాటిల్లో లీనమైపోయి నెమ్మదిగా అంది "నాకు మౌనంగా వుండి మాట్లాడేవాళ్ళంటే ఇష్టం"

కైరీ మంచం మీదనుంచి లేచి పక్కనే టేబిల్ దగ్గర కేశవ్ కోసం కమలా కాయల రసం తీయసాగింది.

* * *

మూడు రోజులు గడిచిపోయాయి. కేశవ్‌కు కొంచెం స్వస్థత చేకూరింది. ఆ రోజు కైరీ అడిగింది-

"మిమ్మల్ని అలా కొట్టిపారేసిన వాళ్ళెవరు?"

"ఏమో నాకూ తెలియదు?"

"తెలీదూ? మరి వాళ్ళు మిమ్మల్ని ఎందుకు కొట్టినట్టు?"

కైరీ ఆశ్చర్యచకితురాలైంది.

కేశవ్ తను ఆలయం దగ్గరకు చేరింది మొదలు చివరివరకు జరిగిన కథంతా పూసగుచ్చినట్టు వివరంగా చెప్పాడు.

అంతా విన్నాక కైరీ అంది "ఈ కథ ఎవరికైనా చెబితే నిజమని నమ్మరు. ఈ కథ నేటిది కాదు. ఎప్పుడో పూర్వ యుగాల్లో జరిగివుంటే వుండవచ్చు. అదీ నిజంగా కాదు. కేవలం కల్పనలో అనుకుంటారు" అంది.

* * *

మరో పది రోజులకు కేశవ్ ఆరోగ్యం మరికొంత మెరుగుపడింది చేతులకున్న కట్లు ఊడదీశారు. ఇంకా తల మీద, కాళ్ళ మీద కట్లు మాత్రం అలానే వున్నాయి. కైరీ తనే స్వయంగా కేశవ్ చేతులకు నూనె పట్టించి మాలిష్ చేసింది. ఇంతింత బారున్న కేశవ్ వేళ్ళు చూసి ఆశ్చర్య పడిపోయింది కైరీ. మాలిష్ చేస్తూ ఆ బారాటి వేళ్ళను పదేపదే తాకి చూచి ఎంతో అనుభూతికి లోనయ్యింది. కైరీ పనులన్నీ చూచి విచిత్రమైన అమ్మాయనుకున్నాడు కేశవ్. వున్నట్టుండి హటాత్తుగా అంది కైరీ-

"వయొలిన్ వాయిస్తాను వింటారా?"

కేశవ్ ఉలిక్కిపడి కైరీ వైపు చూశాడు.

"ఆ రోజు వయొలిన్ ఎలా వుంటుందని అడిగారు కదా? ఈ రోజు నేను వయొలిన్ వాయిస్తాను వినండి" అంది కైరీ

కేశవ్ ఇంకా ఉలికిపాటునుంచి తేరుకోకుండానే "వింటాను ... వింటాను" అన్నాడు.

కైరీ బాత్ రూంలోకెళ్ళి చేతులు కడుక్కొంది. మళ్ళీ వెంటనే ఆ గదిలోంచి మరో గదికెళ్ళింది. కొద్ది క్షణాలనంతరం వయొలిన్ తీసుకుని కేశవ్ వున్న గదిలోకొచ్చింది.

కేశవ్ ఉత్సాహంగా వయొలిన్ వైపు చూస్తూ "ఏదీ ఒకసారి నన్ను చూడనివ్వండి" అన్నాడు.

కైరీ వయొలిన్ కేశవ్ చేతుల్లో వుంచింది. కేశవ్ చాలాసేపు దాన్ని అటూ ఇటూ తిప్పి పరీక్షించాడు. నున్నగా వున్న వయొలిన్ కమాన్‌ను పదే పదే తడిమాడు. తంత్రులు మీటాడు. చివరికి-

"ఓ-ఇది సగం వీణ!" అన్నాడు.

కైరీ వయొలిన్ తన చేతుల్లోకి తీసుకుంది. కిటికీ దగ్గరకు నడిచి కిటికీకున్న పరదాలన్నీ తొలిగించింది. వయొలిన్ గుండెలకు ఆన్చుకుని నిలబడింది. ఆమె

వేళ్ళు వయోలిన్ తంత్రులపై అతి సున్ని తంగా కదులుతున్నాయ్. నెమ్మదిగా ఆమె కంఠం విప్పింది. పాట మొదలైంది. సూటిగా గుండెల్లోకి దూసుకెళ్ళి ఆత్మ తంత్రులను మీటుతున్నట్టుందా పాట. కేశవ్ కళ్ళు మూసుకుని ఆ రాగలహరిలో తేలుతున్నాడు. ఎంత సేపు అలా గడిచి పోయిందో తెలియదు. ఒక రాగం కేశవ్ చేతిమీద, ఒక రాగం కేశవ్ గుండె మీద, మరో రాగం అతడి మంచమ్మీద, అతడి ఒడిలో-అతడి పక్కనే కూచ్చున్నాయి. ఇంతలో ఇంకో రాగం అతడి చెవిలో గుస గుస లాడుతున్నట్టు అంది-

"ఎలావుంది కేశవ్?" -అంతలో పాట ఆగిపోయింది.

కేశవ్ తన్మయత్వంలో కళ్ళు రెండూ మూసుకుని వున్నాడు. అతడి కళ్ళ నుంచి కన్నీరు ధారలుగా ప్రవహిస్తోంది. అలాగే కూచ్చుని వుండి అన్నాడు కేశవ్- "ఆకాశం నిండా తెల్లటి మబ్బులు గుమి గూడి వున్నాయి. ఆ మబ్బులను తాకుతూ ఒక దేవదారు వృక్షం నిలబడి వుంది. గట్టుమీద ఆ చెట్టు నీడలో పర్ణశాలలాంటి ఓ ఇల్లుంది. మెత్తటి మంచు... చల్లగా.. మెల్లగా... నిశ్శబ్దంగా జారిపడుతోంది. చల్లటి మెత్తటి మంచు... పరిమళాలు వెదజల్లుతున్న మంచు... తెల్లటి పట్టు లాంటి మెత్తటి మంచు... ప్రేయసి



యెద పిలుపులాంటి మంచు... కన్నతల్లి ప్రేమలాంటి మంచు...జారిపడుతోంది" కేశవ్ ఆగిపోయాడు.

అంతవరకు కేశవ్ మాటలు వింటూ స్తంభించిపోయి నిలబడి వున్న క్లైరీ ఓ దీర్ఘ శ్వాసను పీల్చుకుంది. నెమ్మదిగా అంది–

"పాట అంత బావుందా కేశవ్?"

కేశవ్ కన్నీళ్ళు తుడుచుకుని కళ్ళు తెరచి చూశాడు.

క్లైరీ మాటకు జవాబు ఇవ్వకుండానే అడిగాడు–

"నాకు వయోలిన్ నేర్పుతారా?"

క్లైరీ ఆనందంతో ఉక్కిరి బిక్కిరైంది. వెంటనే వయోలిన్ కేశవ్ చేతుల్లో వుంచింది.

* * *

ఆరు వారాలు గడిచాయి. కేశవ్ మరికాస్త ఆరోగ్యాన్ని పుంజుకున్నాడు. కాళ్ళకున్న కట్లు విప్పేశారు. తల మీద కట్టు మాత్రం అలాగే వుంది. ఇంకా మంచం దిగి బయటి ప్రపంచాన్ని చూడ లేదు. కానీ ఈ ఆరు వారాల కాలంలో క్లైరీ శిష్యరికంలో వయోలిన్ నేర్చుకున్నాడు. ఇప్పుడు వయోలిన్ వాయించ గలుగుతున్నాడు.

"మీకు వయోలిన్ నచ్చిందా?" క్లైరీ అడిగింది.

"నచ్చుతూనే వుంది కానీ ఏవో అపరిచిత సీమల్లో తిరుగుతున్నట్టు అనిపిస్తోంది. దారి కొత్తగా, కఠినంగా వుంది. అయినా ఉత్సాహంగానే వుంది"

"మరి వీణ" హటాత్తుగా అడిగింది క్లైరీ.

"వీణ–? నా ఆత్మ" అత్యంత సాత్త్వికంగా అన్నాడు కేశవ్.

"అయితే వయోలిన్ మీ ఆత్మ తంత్రులను మీటటం లేదా?" అడిగింది క్లైరీ.

"మీటుతుంది. కానీ అది మీ చేతుల్లో వున్నప్పుడు" కేశవ్ చిరునవ్వు నవ్వాడు.

"వయోలిన్ నా చేతుల్లోకి రాగానే దానిలోవుండే సంవేదన చల్లబడి పోతుంది. తన ఆత్మను నాకు అర్పించటానికి నిరాకరిస్తున్నట్టు అనిపిస్తుంది."

"కళాకారుడు తన వాయిద్యాన్ని ప్రేమించాలి కదా?" అంది క్లైరీ.

"కానీ మనిషి ఒక్కసారే కదా ప్రేమించ గలుగుతాడు" కేశవ్ భారంగా నిశ్వశిస్తూ అన్నాడు.

"అబద్ధం" క్లైరీ తీవ్రంగా అంది. "మనిషి ఒకసారికన్నా ఎక్కువసార్లు ప్రేమించ గలుగుతాడు. ఒక వస్తువునే కాక అనేక వస్తువులను ప్రేమించ గలుగుతాడు. అది వయోలిన్ అయినా కావచ్చు. శిల...శిల్పం...దేశం....ఆహార పానీయాలు ఏవైనా కావచ్చు."

"కానీ మనిషి తనను తాను సంపూర్ణంగా అర్పించుకోవటానికి ఒక్కరి ప్రేమ సరిపోతుంది. ప్రేమ ఒక్కరికే అర్పితమౌతుంది. అది నిజం. ఈ సంగతి వంటవాడి దగ్గరనుంచి కళాకారుడి వరకు అందరికీ తెలుసు" కేశవ్ చెబుతూ ఒక్క క్షణం ఆగి మళ్ళీ అన్నాడు "ఈ సంగతి మీకు తెలియదా?"

క్లైరీకి ఏం చెప్పాలో తోచక, విషయాన్ని పక్కకు నెడుతూ "మీరు ఈ వయోలిన్‌ను ప్రేమిస్తే– అది నా చేతుల్లో ఎలా పలుకుతుందో మీ చేతుల్లోనూ సరిగ్గా అదే విధంగా పలుకుతుంది" అంది.

కేశవ్ అన్నాడు "ఏం చేయను. నా

భాష చాలా ప్రాచీనమైనది."

"మీరు పొరబడుతున్నారు" క్రైరీ ముఖంలో కొద్దిగా కోపం చోటు చేసుకుంది. "వయోలిన్ భాషలో, వీణభాషలో అంతరం ఏముంది? సరే ఈరోజు మీకు యూదుల మన్‌హన్ సంగీతం వినిపిసాను విని తరువాత చెప్పండి" అని క్రైరీ లేచి నిలబడింది.

కేశవ్‌ను మంచంమీదనుంచి దింపి కిటికీ పక్కన కుర్చీలో కూర్చోపెట్టింది. అంతవరకు బయటి ప్రపంచాన్ని చూచి ఎరుగడు. కేశవ్ విచిత్రమైన ఉత్సాహంతో కిటికిలోంచి బయటకు తొంగి చూచాడు. దూరంగా అర్ధచంద్రాకారంలో సముద్రం కనిపిస్తోంది. పక్కన విశాలమైన రోడ్డు వుంది. రోడ్డునిండా వేలమంది జనం హడావుడిగా నడుస్తున్నారు. రోడ్డు రెండువేపులా ఎత్తైన భవంతులు వరుసగా నిలబడి వున్నాయి.

"ఈ వూరు పేరేమిటి?" ఇంకా విచిత్రంగా కిటికీలోంచి బయటకు చూస్తూనే అడిగాడు కేశవ్.

"బొంబాయి" క్రైరీ జవాబు చెప్పి వయోలిన్ వాయించటంలో నిమగ్నమైంది.

ఇది బొంబాయా!... బొంబాయి... బొంబాయి... కేశవ్ గుండెల్లో ప్రతిధ్వనించిందా పేరు. కేశవ్ ఆలోచిస్తున్నాడు. రంభ ఇక్కడే వుంటుంది. బహుశా ఆ రోడ్డుమీద జనంలో రంభ కూడా వుందేమో? ఆ సముద్ర తీరాన కూర్చుని వుందేమో?... రంభ...

వయోలిన్ మ్రోగుతూనే వుంది.

క్రైరీ ఆలోచిస్తోంది. ఎంత అందంగా వున్నాడు కేశవ్? ఏదో అపరిచిత లోకాల నుంచి ప్రయాణించి వచ్చిన అద్భుత వ్యక్తి. ఇతడి మీద భారతజల వాయువుల ప్రభావమే వున్నట్టు కనిపించటంలేదు. ఈ వర్తమాన ప్రపంచానికి చెందిన వాడు కాదు అన్పిస్తోంది. మొదటిసారిగా భారత దేశానికి వచ్చిన అమ్మడిలా వున్నాడు. అలాంటి ఎర్రటి కేశాలు, విశాలమైన నుదురు, పరిపూర్ణ పురుషత్వాన్ని నింపుకొన్న వెడల్పాటి ఛాతీ, దృఢంగా వున్న మెడ, బాహువులు, కోదేరులాంటి ముక్కు, నీలి కళ్ళు, దేవతలను మించిన శరీర ఛాయ. తెల్లటి మేఘాల్లోంచి ఉదయించిన సూర్యబింబంలా చాలా అందంగా వున్నావు కేశవ్. అతి సుందరంగా వున్నావు నా అడోనిస్.

కేశవ్ ఆలోచిస్తున్నాడు. ఎక్కడున్నావు రంభా నువ్వు? నేను నీ కోసం నా అమరత్వాన్ని త్యాగంచేసి, శివ సన్నిధిని వదులుకొని కేవలం ఒక్క సంవత్సరం ఆయుర్దాయంతో నీ ప్రేమ కోసం నిన్ను వెతుక్కుంటూ బయలుదేరాను. కానీ ఇంతవరకు శివుడు నీ దర్శన భాగ్యాన్ని కల్పించలేదు. ఎంత అందమైన ముఖం నీది. అన్ని కళలు నిండిన ఆ కళ్లు..సూర్య కిరణాలతో చెక్కిన బంగారు రంగు శరీరం...రంభ ప్రతిబింబం కేశవ్ దగ్గరగా వచ్చింది. దూరంగా కనిపిస్తున్న సముద్రపు అలల మీదనుంచి ప్రయాణించి వచ్చింది. మళ్ళీ అంతలోనే దూరంగా వెళ్ళిపోయింది. మళ్ళీ దగ్గరగా ...

కేశవ్ అశాంతిగా రెండు చేతులూ చాపి కిటికీ ఊచలు పట్టుకున్నాడు. అప్పుడే హటాత్తుగా వయోలిన్ ఆగిపోయింది. రంభ రూపం దాంతోపాటే కేశవ్ స్మృతి పథంలో అదృశ్యమైపోయింది. కేశవ్ ఇంకా బయటికే చూస్తు




న్నాడు.

భావోద్వేగంలో అలసిపోయిన క్యారీ మంచంమీద ఒరిగి పడిపోయింది. కేశవ్ తన ఆలోచనల్లోనే నిమగ్నమై క్యారీ పరిస్థితిని గమనించలేదు.

"ఈ సంగీతం పేరేమిటి" కేశవ్ సాదాగా అడిగాడు-ఇంకా బయట దూరంగా కనిపిస్తున్న సముద్రం వైపు, జనం వైపు చూస్తూ.

"ఒక రాత్రి ప్రేమ" బాధగా పలికింది క్యారీ. మరు క్షణంలో తనను అదుపులోకి తెచ్చుకుంటూ చెదిరిన ముంగురులను సవరించుకుంటూ లేచి నిలబడింది. కేశవ్ వైపు చూపన్నా మరల్చకుండా అతివేగంగా గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది.

* * *

మూడు మాసాలు గడిచిపోయాయి. కేశవ్ దాదాపు ఆరోగ్యవంతుడయ్యాడు. గదిలో పచార్లు చేయగల్గుతున్నాడు తలమీద కట్టు కూడా ఊడదీసేశారు. క్యారీ విపరీతంగా ఆనందించింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని క్యారీ ఒక పార్టీ ఏర్పాటు చేయాలనుకుంది.

క్యారీ అంది "పార్టీలో మీరు వయోలిన్ వాయించాలి. అది విని ఇంత తక్కువ సమయంలో మీరు వయోలిన్ ఎలానేర్చుకోగలిగారని అందరూఆశ్చర్యపోవాలి" అంది.

"కానీ నేను వీణ వాయిద్దామనుకుంటున్నాను" అన్నాడు కేశవ్.

"మరి మీ వీణ ఎక్కడుంది?"

"అది ఆలయంలోనే వుండిపోయింది"

క్యారీ రెండు రోజుల పాటు మ్యూజికల్ దుకాణాలన్నీ గాలించింది. కానీ వీణ ఎక్కడా దొరకలేదు.

మూడో రోజున కేశవ్ దగ్గరకొచ్చి చెప్పింది క్యారీ "దుకాణాలన్నీ గాలించి వచ్చాను. వీణ ఎక్కడా దొరకలేదు. పాత సంగీతకారులుంటే వారి దగ్గర దొరకవచ్చునని తెలిసింది. ఈలోగా నేను ప్రయత్నిస్తాను. దొరికితే మంచిదే. దొరక్కపోతే పార్టీ రోజున వయోలిన్ వుండనే వుందికదా?" అంది.

కేశవ్ మౌనంగా వూరకుండిపోయాడు.

పార్టీకి ఒకరోజు ముందు క్యారీ ఉదయాన్నే కేశవ్ గదిలో కొచ్చింది "ఒక వీణ దొరికింది. కానీ అమ్మే మనిషి చాలా రేటు చెబుతోంది. వెయ్యి రూపాయిలట. మీరూ ఒకసారి చూడండి. మీకు నచ్చితే తీసుకుందాం" అంది.

"ఎవరావిడ?" కేశవ్ అడిగాడు.

"పారస్ రోడ్డులో నివసించే ఒక వ్యభిచారిణి" క్యారీ అసహ్యం నిండిన స్వరంతో అంది - "నేను ఆవిడను ఇక్కడకు పిల్చుకు వస్తాను!" అని చెప్పి బయటకు వెళ్ళిపోయింది. కొద్ది నిమిషాలు గడిచాక క్యారీ మళ్ళీ వచ్చింది. ఆమె వెనకే ఒక పాత వీణను పట్టుకొని వున్న యువతి కూడా వచ్చింది.

ఆ యువతిని చూడగానే కేశవ్ ఉలిక్కిపడ్డాడుఆశ్చర్యంతో అతడి నోటి వెంట చిన్న కేక వెలువడింది.

"అరే ఈ అమ్మాయి శోభ" అన్నాడు కేశవ్.

శోభ మౌనంగా కేశవ్ వైపు చూస్తూ నిలబడింది. కట్టుకున్న చీర బాగా మాసిపోయివుంది. శరీరం చిక్కించుకుపోయి వాడిపోయి వుంది. ఆనాటి కోమలత్వం, సున్నితత్వం ఏ కోశానా లేవు. ఆనాటి సిగ్గరితనం శోభ ముఖంలో లేదిప్పుడు.

"శోభా ఇలా తయారయ్యావేమిటి?" ఆందోళనగా అడిగాడు కేశవ్.

"అసలు ఇక్కడికెలా వచ్చావు?"

శోభ! తలవంచుకుని మెల్లగా చెప్ప సాగింది "మీరు మరణించారనుకుంటు న్నాను నేను. వాళ్లు నాతో అలాగే చెప్పారు". శోభ కంఠం రుద్ధమైంది. గొంతులో బాధ అడ్డంగా ఇరుక్కుంది. చిన్న దగ్గు దగ్గి శోభ మళ్ళీ చెప్పసాగింది-

"వాళ్లు నన్ను కూడా విపరీతంగా కొట్టారు. పెళ్ళి చేసుకొమ్మని బలవంత పెట్టారు. నేను నిరాకరించాను. వాళ్ళు నన్ను అంతటితో విడిచి పెట్టలేదు. నా శీలాన్ని దోచుకున్నారు. నన్ను ఆ ఆలయం నుంచి, ఆ వూరినుంచి బయటకు తరిమేశారు. ఆలయాన్ని స్వాధీనం చేసు కున్నారు. తరువాత నేను ఔరంగాబాద్ చేరుకున్నాను. తరువాత హైదరాబాద్, అక్కడినుండి బొంబాయి వచ్చాను. నేను ఎక్కడ తిరిగినా వీణను మాత్రం విడచి పెట్టలేదు. నాకు తోడుగా వుండి నా గడ్డు రోజులన్నింటినీ, నా పతనాన్ని, నా దారి ద్ర్యాన్ని చూచింది వీణ. పోనుపోను జీవితం ఇంకా కిందకు దిగజారుతోంది. అందుకని ఈ వీణ నా దగ్గర వుండటం మంచిది కాదనిపించింది. అమ్మజూపాను. మీరు కొంటానని పిలుచుకొచ్చారు. మీరు ఇక్కడ వుంటారని నాకేం తెలుసు?" అంతవరకు చెప్పి గొంతు పూర్తిగా పూడుకుపోయినట్టు ఆగిపోయింది.

"ఇలా ఎందుకు తయారయ్యావు?" నీరసంగా అడిగాడు కేశవ్.

"దిక్కులేని ఒంటరితనంలో శీలాన్ని పోగొట్టుకున్న స్త్రీ, మందభాగ్యురాలు... ఇంతకన్నా ఎలా వుంటుంది?" అంటున్న ప్పుడు శోభ గొంతులో-చవిచూచిన చేదు అనుభవం జీర పారాడింది.

ఇంతలో పక్క గదిలోంచి నోట్లు లెక్కించుకుంటూ కైరీ వచ్చింది. "ఇదిగో తీసుకో నీ వెయ్యి రూపాయలు. వీణ ఖరీదు" అంది.

"వద్దు! నాకీ వెయ్యి రూపాయలు అవసరం లేదు" శోభ నిరాకరించింది.

"మరేం కావాలి నీకు?" కైరీ ఆశ్చ ర్యంతో అడిగింది.

"నాకు నా భర్త కావాలి!" శోభ కేశవ్ వైపు చూస్తూ అంది. ఆమె కళ్ళ నుంచి కన్నీళ్ళు జారుతున్నాయి.

"ఈయన నీ భర్త కాదు" కైరీ కఠి నంగా అంది. "నీకు వెయ్యి రూపాయలు కావాలంటే తీసుకో! లేదా ఇక్కడ నుంచి వెంటనే వెళ్ళు"

"నాకు నా భర్తే కావాలి"

"పన్నెండు వందలు తీసుకో. కావా లంటే పదిహేను వందలు తీసుకో. ఇంకా అవసరమైతే రెండు వేలు తీసుకో-లేదా నీకెంత కావాలో అడుగు. నీకింతటి ధర ఎవ్వరూ ఇవ్వరు" కైరీ కోపంగా అరి చింది.

శోభ విషాదంగా అంది-"నాభర్తనాకు లభించనప్పుడు ఈ డబ్బు నాకెందుకు? ఈ వీణ కూడా నా సొంతం కాదు. కానీ నిన్నటి వరకు దీంతో నాకో జన్మాం తర అనుబంధం వుంది. ఇవ్వాళ ఆయన మౌనాన్ని చూడగానే ఆ బంధం కాస్త తెగిపోయింది."

శోభ కన్నీళ్ళు నిండిన కళ్ళతో కేశవ్ వైపు చూచింది. వెంటనే ఆమె కళ్ళు కిందకు వాలిపోయాయి. వీణను అలాగే పట్టుకుని ఆమె కేశవ్ వైపు నడిచింది. వీణను కేశవ్ చేతుల్లో వుంచింది. కిందకు వంగి కేశవ్ పాదాలకు మొక్కింది. ఏడ్చు




కుంటూ వెనుతిరిగి వేగంగా గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది.

* * *

పార్టీ ముగిసిపోయింది. అతిథులందరూ వెళ్ళిపోయారు. కేశవ్ తన గదిలో కొచ్చాడు. లైటు తీసివేసి చీకట్లో మంచమ్మీద పడుకుని పార్టీలో జరిగిన సంఘటనలన్నీ ఒకటొకటిగుర్తుచేసుకుంటున్నాడు.

కేశవ్‌కు రెండు వేల సంవత్సరాల నాడు జరిగిన ఒక అద్భుత సంఘటన కళ్ళముందుకొచ్చి నిలుచుంది. ఒక రోజు విశాల దేవ మహారాజు కేశవ్‌ను సంగీత కచేరి కోసం ప్రత్యేకంగా పిలిపించుకున్నాడు. ఏదైనా అద్వితీయ రాగాన్ని పాడి వినిపించమనికోరాడు. సభ నిండుగా జనం కిక్కిరిసిపోయి వున్నారు. అప్పుడు కేశవ్ ఆ సభలో వీణాగానం చేశాడు. ఒక అద్భుత రాగాన్ని ఆలపించాడు. మహారాజు, ప్రజలు మంత్రముగ్ధులైపోయారు. కచేరి జరిగినంతసేపూ అందరూ ఒక స్వప్న లోకములో విహరించినట్టున్నారు. కచేరి ముగిసిన కొన్ని క్షణాల వరకు కూడా అందరూ ఒక వింత మౌనాన్ని పాటించారు. తరువాత ఆ స్వప్న లోకంలోంచి బయట రావటం ఇష్టంలేని వాళ్ళల్లా ఒకరొకరు నెమ్మదిగా తేరుకున్నారు.

తరువాత ఏం జరిగిందో కేశవ్‌కు చాలా సేప టివరకు అంతు పట్టలేదు. కేశవ్ గమనించబోయే సరికి కేశవ్ చుట్టూ పూల మాలలు ఇంతెత్తున పడివున్నాయి. కేశవ్ మెడలో విశాల్ మహారాజు స్వయంగా ధరింప జేసిన ముత్యాల హారాలు ధగ ధగ మెరుస్తున్నాయి.

పార్టీలో కూడా దాదాపు అలాగే జరిగింది. కేశవ్ వీణానాదం మొదలైంది. అంతవరకు రకరకాల చర్చల్లో మునిగి వున్న అతిథులందరూ ఒక్కసారే నిశ్శబ్దంగా ఎక్కడ వారక్కడే నిల్చుండి పోయారు. ఆ రోజు విశాల్‌దేవ్ మహారాజు కొలువులో పాడిన ఆ పాత రాగమే రెండు వేల సంవత్సరాల తరువాత కేశవ్ మళ్ళీ ఈ రోజు పాడి వినిపించాడు ఆ రోజులాగే జనం మంత్ర ముగ్ధులై విన్నారు.

వీణానాదం ఆగిపోయిన వెంటనే చప్పట్లు విపరీతంగా మోగాయి. ప్రతి ఒక్కరి నోటి వెంట ప్రశంసలు వినిపించాయి. అప్పుడు టాంసన్ లేచివచ్చి కేశవ్‌ను గట్టిగా కౌగలించుకుని అన్నాడు "బహుశా ఇలాంటి సందర్భం కోసమే నేమో ఐన్‌స్టీన్ జ్ఞానంకన్నా కల్పన గొప్పదన్నాడు"

ఐన్‌స్టీన్ అంటే ఎవరో కేశవ్‌కు అర్థంకాలేదు. తల పంకిస్తూ ఆలోచనలో పడ్డాడు. ఈ రెండు వేల సంవత్సరాల్లో ఎందరో కొత్త కొత్త దేవతలు పుట్టి వుంటారు. బహుశా ఈ ఐన్‌స్టీన్ కూడా ఒక దేవత అయివుంటాడు. ఎందుకంటే రాగాలను గురించి క్షుణ్ణంగా దేవతలకు మాత్రమే తెలుస్తుంది. కానీ కల్పనజ్ఞానం కన్నా ఎలా గొప్పదవుతుంది? చూడబోతే ఈ కొత్త ప్రపంచంలో దేవతలు కూడా మూర్ఖులైనట్టున్నారు అనుకున్నాడు కేశవ్

పార్టీలో ఖుద్సియా కనిపించింది. కాని ఖుద్సియా కేశవ్‌ను ఎంత మాత్రమూ గుర్తు పట్టలేదు. అయినా ఆమె ఎలా గుర్తించగలుగుతుంది. కేశవ్ ఆమె దగ్గరకు వెళ్ళి "నన్ను గుర్తుపట్టారా? ఆ రోజు మీరు ఎల్లోరాలో చూచిన రాతి

ప్రతిమను నేను" అని చెబుదామను కున్నాడు. కానీ చెప్పి మాత్రం ప్రయో జనమేమిటని ఊరుకుండిపోయాడు.

ఖుద్సియాతో పాటు ఆయిరీని కూడా వుంది. ఆవిడ కైరీకు స్నేహితురాలని కూడా తెలిసింది. ఆయిరీని ఖుద్సియాతో అనటం వినిపించింది. "రంభ పరీక్షలు వ్రాసి కాశ్మీర్ వెళ్ళిపోయింది. ఎండా కాలం శలవలన్నీ అక్కడే గడిపివస్తుం దట"

రంభ పేరు వినిపించగానే కేశవ్ చెవులు రిక్కించి విన్నాడు. కానీ వాళ్ళ సంభాషణ అంతకు మించి ముందుకుసాగ లేదు. కేశవ్ చాలా నిరాశకు లోనయ్యాడు లోపలశాంతి పేరుకుపోయింది. ఒక్క సంవత్సరం ఆయుర్దాయాన్ని మాత్రమే ప్రసాదించి శివుడు ఎంతటి అన్యాయం చేశాడు అనిపించింది. ఐదారు నెలలు ప్రయాణంలో, జబ్బులోనే గడిచి పోయాయి. కనీసం రంభ బొంబాయిలో నైనా లేదు. కాశ్మీర్ వెళ్ళిపోయిందట. చాలా అ న్యా య ం... శంకరా... అన్యాయం అనుకున్నాడు కేశవ్.

మంచం మీద కళ్ళు మూసుకుని పడు కుని వున్న కేశవ్‌కు శివుడి మీద ఎక్కడ లేని కోపం ముంచుకొచ్చింది. అతడి గుండెల నిండా బాధ, దుఃఖం. చాలా సేపు ఏడ్చాడు. తన దురదృష్టానికి నిందించు కున్నాడు. అంతలో కైరీ గదిలోకొచ్చింది

"అప్పుడే అప్పుడే నిద్రపోయారా ?" అడిగింది కైరీ

"లేదు. కొంచెం అలసటగా వుంటేను.. పడుకుండిపోయాను."

"మేం రేపు కాశ్మీర్ వెళ్తున్నాం" కైరీ ఉత్సాహంగా చెప్పింది.

"కాశ్మీర్" కేశవ్ గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. మహాదేవా నీ లీల ఎంత విచిత్రం. నా బాధ అప్పుడే విన్నావా శివుడిపట్ల భక్తి పొంగి పొర్లింది

"మీరు కూడా మాతో వస్తారుకదూ!" కైరీ అభ్యర్థిస్తున్నట్టు అడిగింది.

"తప్పకుండా వస్తాను" కేశవ్ వెంటనే అన్నాడు. కైరీ అడిగింది "మరి బొంబా యిలో మీకేదో పనుందన్నారుగా?"

"నా పనా? అది కాశ్మీర్‌లో కూడా జరుగుతుంది" అన్నాడు. కైరీ ఆనందానికి అవధులు లేవు. విజయం సాధించినట్టు పొంగిపోయింది. కేశవ్ ఖచ్చితంగా తన కోసమే కాశ్మీర్ వస్తున్నాడు. కైరీ వెంటనే వెళ్ళి కేశవ్ విశాలమైన ఛాతీమీద వాలిపోవాలనుకుంది. కానీ కేశవ్ మంచం మీద బోర్లా పడుకుని వున్నాడు. ఆ స్థితిలో అతణ్ని కౌగిలించుకోవాలను కోవటం అనుచితమనిపించింది. అయినా కైరీకు కేశవ్ తనవాడయ్యాడన్న భావనే పూర్తి సంతృప్తినిచ్చింది. కైరీ గొప్ప ఉల్లాసంతో హై హీల్స్ టక టక లాడించు కుంటూ హుషారుగా గదిలోంచి బయటక వెళ్ళిపోయింది.




మరో మూడు మాసాలు గడిచిపోయాయి. కానీ రంభ మాత్రం కనిపించలేదు. వీళ్ళు బొంబాయి నుంచి శ్రీనగర్ వరకు రావ టానికి మూడు మాసాలు పట్టింది. ముందు

పఠాన్‌కోట్ నుంచి కులూ వెళ్ళారు. అక్కడనుంచి జమ్మూ వెళ్ళారు. జమ్మూలో ఒక్క రోజు వున్నారు. దారిలో చాలా చోట్ల ఆగుతూ వచ్చారు. ఎందుకంటే టాంసన్ ఆయా ప్రాంతాల్లో తనకు కావలసిన సంగీతాంశాలను రికార్డ్ చేసుకుంటున్నాడు. కైరీ తండ్రికి సహాయపడుతోంది.

ఆ రోజు గాయాలపకుండా వుంటే కేశవ్ నడిచి అయినా సరే బొంబాయి చేరుకునేవాడు. ఆ గాయాలు తగలటంతో స్పృహలో లేకుండా పడిపోయాడు. శివుడు తనకు ఒక సంవత్సరం ఆయుర్దాయాన్నిచ్చాడు. ఈలోగా ఎవ్వరూ తన ప్రాణాలు తీయలేరని కేశవ్‌కు నిశ్చయంగా తెలుసు. కానీ రక్తమాంసాలు నిండిన శరీరం అపటంతో, రక్తం విపరీతంగా స్రవించి పోపటంతో శక్తి నంతటినీ కోల్పోయాడు. బాగా నీరసించిపోయాడు. పోయిన పాత బలాన్నంతటినీ ఇంకా పుంజుకోలేదు శరీరం. అందుకని వాళ్లు ఎక్కడాగితే, వాళ్లతో పాటే కిక్కురుమనకుండా వుండిపోవల్సి వచ్చింది. అంతా కొత్త ప్రాంతం. పైగా నిస్సత్తువ. అప్పుడప్పుడు వీణగానీ వయోలిన్ గానీ వాయించేవాడు. కానీ ఆ రెంటిలోనూ అతడికి ఉత్సాహం అణగారిపోయింది.

కైరీ అతడ్ని చిన్నపిల్లాడ్ని సాకినట్టు సాకుతోంది. కేశవ్ కేవలం తన సపర్యల వల్ల మళ్ళీ బ్రతికి బయటపడగలిగాడు అని కైరీ నమ్మకం. ఆ భావనతో కేశవ్ ఆరోగ్యం విషయంలో కైరీ అవసరానికి మించిన సావధానతను ప్రదర్శించసాగింది.

అలా మూడు మాసాలు దారిలో గడిచిపోయాక చివరికి శ్రీనగర్ చేరుకున్నారు. పిండ్ దగ్గర ఝెలంలో ఒక హౌస్ బోట్ అద్దెకు తీసుకున్నారు. ఎప్పుడూ నీళ్ళ మీదే తేలుతుండే ఆ కర్రలతో చేసిన హౌస్‌బోట్ కేశవ్‌ను విపరీతంగా ఆకట్టుకుంది. ఆ బోటులో ఎప్పుడూ కిటికీ పక్కనే పడకకుర్చీ వేసుకుని కూర్చుండిపోయేవాడు. కొద్ది రోజులు కైరీతో కలసి చుట్టుపట్ల ప్రాంతాలు తిరిగివచ్చాడు. తరువాత ఒంటరిగానే వెళ్ళసాగాడు. అతడు వెళ్ళిన ప్రతిచోటా రంభ కనిపిస్తుందేమోనని వేయికళ్ళతో వెదికేవాడు. ఇంతలో టాంసన్ జమ్మూ వెళ్ళవలసిన అవసరం ఏర్పడింది. ఒక రోజు కైరీ అడిగింది–

"మీరుకూడా మా వెంట జమ్మూ వస్తారా? ఎందుకంటే నేను ఇక్కడ ఉంటానికి వీలుపడదు. డాడీ ఒక్కరే రీసెర్చి పనులు చేసుకోలేరు. ఆయనకు సహాయంగా నేను వెళ్ళవలసి వుంటుంది."

"నేను ప్రయాణాలు చేసిచేసి బాగా అలసిపోయాను. ఇంక నాలో ఓపికలేదు. బాగా నీరసంగా వుంటుంది. ఇంక రాలేను" అన్నాడు కేశవ్.

అది నిజమేనని కైరీకు తెలుసును. కైరీ వెంటనే అంది–

"మీరు ఇక్కడే శ్రీనగర్‌లోనే వుండండి. ఈ హౌస్‌బోట్ తాలూకు మనుషులు మిమ్మల్ని జాగ్రత్తగా చూస్తారు. మేము వెళ్ళాక మీకు ఎలాంటి ఇబ్బందీ లేకుండా నేను అన్ని ఏర్పాట్లు చేసి వెళతాను. మేము త్వరలోనే పని ముగించుకుని తిరిగి వచ్చేస్తాము. ఈలోగా ఖర్చుల కోసం ఈ మూడొందలు వుంచుకోండి"

కేశవ్ కైరీని అంతరాంతరాల్లోనే హృదయపూర్వకంగా అభినందించాడు. కైరీ వెళ్ళగానే రంభకోసం వెతకవచ్చు. రోజల్లా వెతకవచ్చనుకున్నాడు.

కేశవ్ అనుకున్న విధంగానే చేశాడు. శ్రైకీ వెళ్ళగానే శ్రీనగర్‌లోని అణువణువునూ రంభకోసం గాలించాడు. కానీ రంభ ఎక్కడా కనిపించలేదు. అతడికి కేవలం ఆమె పేరు మాత్రమే తెలుసు.

సెప్టెంబర్ నెల వచ్చేసింది. కేశవ్ ఒక రోజు స్టీమ్‌బోట్‌లో కూర్చుని షికారుకు బయలుదేరాడు. అతడిలోవున్న హుషారంతాపోయి ఉదాసీనంగా తయారయ్యాడు. అతడి కళ్ళు ప్రతిక్షణం రంభ కోసం వెతుకుతున్నాయి. ఇంతలో అతడున్న స్టీంబోట్ పక్కనుంచి మరో స్టీం బోట్ వేగంగా దూసుకెళ్లిపోయింది. ఆ బోటులో ఒక అమ్మాయి కూర్చునివుంది. ఆమె కట్టుకున్న ఎర్రటి చీరకొంగు గాలి వేగానికి రెపరెపలాడుతూ ఎగురుతోంది. ఆమె ముఖం ఒక్క క్షణం పాటు, అదీ ఒక ప్రక్క నుంచి కనిపించింది. కేశవ్ ఆమెను వెంటనే గుర్తించాడు. అతడినోటి నుంచి అనాయాసంగా 'రంభ' అనే పిలుపు వెలికి వచ్చేసింది. కానీ అప్పటికే స్టీంబోటు కనుచూపు మేర దాటిపోయింది. కేశవ్ తను కూర్చున్న స్టీం బోటును ఆ బోటు వెనకే పోనివ్వమన్నాడు. కానీ లాభం లేకుండాపోయింది. బోటుఎక్కడా కనిపించలేదు.

కేశవ్ విసుగూ విరామం లేకుండా గంటల తరబడి రంభ కోసం ఆ ప్రాంతమంతా గాలించాడు. ఓ క్షణం ఎవరినో చూచి పొరపాటున రంభ అనుకోలేదు కదా? అన్న అనుమానం వచ్చింది. కానీ ఆమె రంభేనని అతడి హృదయం పదే పదే చెబుతోంది. అతడి కళ్ళు పొరపాటు పడవచ్చు. గుండెలు ఆమెను చూడనేచూచాయి రంభ శ్రీనగర్‌లోనే వుందని నిశ్చయంగా అనుకున్నాడు కేశవ్.

కేశవ్ అన్వేషణ సాగిస్తూనేవున్నాడు. ఒకరోజు అదృష్టవశాత్తు రంభ కనిపించింది. హారూ సరస్సు పక్కన పిక్‌నిక్ కోసం వచ్చి వుంది. రంభతోపాటు మరి కొందరు యువతులు, ఇద్దరు యువకులు కూడా వున్నారు. ఆ యువకుల్లో ఒకడు కళ్ళజోడు పెట్టుకుని సన్నగా పొడుగ్గా వున్నాడు. మరొకడు ఎత్తుగా బలిష్టంగా వుండి ఖరీదైన అమెరికన్ సూట్ ధరించి వున్నాడు. రంభ వాళ్ళిద్దరిమధ్య నిలబడి నవ్వుతూ మాట్లాడుతోంది.

కేశవ్ దూరంనుంచే రంభను గుర్తించి ఆమె కోసం పరుగెత్తసాగాడు. కానీ దారిలో ఇద్దరు ఆంగ్లో ఇండియన్ వ్యక్తుల్ని ఢీ కొని కింద పడిపోయాడు. లేచి బట్టలు దులుపుకుని చూసేసరికల్లా రంభ ఆ యిద్దరు యువకులతో కలసి కారులో కూర్చోబోతూంది. రంభ ఇంకా ఏవో మాటలు చెబుతూ నవ్వుతూనేవుంది. ఆఖరున కారులో కూర్చోబోయేముందు కళ్ళజోడు పెట్టుకునివున్న యువకుడి భుజమ్మీద చేయివేసి నవ్వింది. ఆ చెయ్యి ఒక పదునైన ఖడ్గంలా కేశవ్ గుండెల్లో చివరివరకు దిగబడిపోయింది. వాళ్ళు ముగ్గురూ కారులో కూర్చున్నారు. కారు ముందుకు కదిలింది, కేశవ్ ఒగర్చుకుంటూ కారువైపు పరుగెత్తాడు. కానీ అప్పటికే కారు వేగంగా ముందుకు దూసుకెళ్ళిపోయింది. అనుకోకుండా కేశవ్ మెదడు తెలివితేటలు ప్రదర్శించింది. కేశవ్‌కు ఆ కారు నంబర్ గుర్తుండిపోయింది. అలా ఎందుకు గుర్తుందో కేశవ్‌కు తెలియదు.

కేశవ్ వెనుతిరిగి హౌస్ బోట్‌కు చేరుకుని అక్కడ పనిచేస్తున్న ఒక మనిషిని పిలిచాడు, కారు నంబర్ అతడికిచ్చి ఆ కారు యజమాని ఎవరో తెలుసు

 

కుని రమ్మని ఆ మనిషికి ఇరవై రూపాయిలు అందించాడు. ఆ మనిషి వెళ్ళిపోయాడు.

ఆ మనిషి మళ్ళీ సాయంత్రానికి తిరిగి వచ్చి "అది ఒక టూరిస్ట్ ఏజన్సీవాళ్ళ కారు, రోజూ అద్దెకు ఇస్తుంటారట" అని చెప్పాడు.

అయితే ఆ రోజు దాన్ని ఎవరు అద్దెకు తీసుకున్నారో కనుక్కొని రమ్మన్నాడు కేశవ్. ఆ మనిషి కొద్ది క్షణాలు అక్కడే తలవంచుకు నిలబడి చివరికి అన్నాడు "దానికోసం మరో ఇరవై కావాలి."

కేశవ్ వెంటనే అతడికి ఇరవై రూపాయ లిచ్చేసాడు.

ఆ మనిషి మళ్లీ రెండోరోజు సాయంత్రానికొచ్చి "మిస్ రంభ జౌహరీ అనే ఆవిడ అద్దెకు తీసుకున్నారట" అని చెప్పాడు.

"మిస్ రంభ జౌహరీ చిరునామా ఏమిటి? ఎక్కడ వుంటారు?" కేశవ్ ఆత్రంగా అడిగాడు.

ఆ మనిషి తల వంచుకు నిలబడి పోయాడు. చాలా సేపు తన బూట్లను పరీక్షించుకుని అన్నాడు. "దాన్ని కనుక్కొని రావాలంటే ముప్ఫై రూపాయలు అవుతాయి అన్నాడు."

కేశవ్ వెంటనే ముప్ఫై రూపాయిలు తీసిచ్చాడు.

రంభ చిరునామా ఆ మనిషికి ఆరోజే టూరిస్ట్ ఏజన్సీవాళ్లు చెప్పారు. కానీ అతడు తనుచేస్తున్న ఘనకార్యానికి సాధ్యమైనంత డబ్బు గుంజకపోతే ఎలా అనుకున్నాడు. తెలివి తేటలను తక్కువ ఖరీదుకు అమ్మటం అవివేకం అనుకున్నాడు. అందుకే అతడు ఈసారి నాలుగురోజుల తరువాత గాని కేశవ్ దగ్గరకు రాలేదు. వచ్చి- అడ్రస్ ఇస్తూ

"చాలా కష్టపడితే కాని దొరకలేదు. ఏదైనా ఇవ్వండి" మళ్ళీ చేయిచాపాడు.

కేశవ్ ఐదు రూపాయిలు తీసి అతడి కిచ్చాడు. కాగితం తీసి చదువుతున్నాడు కేశవ్.

లేకవ్యూ బోట్ హౌస్- శ్రీనగర్- డల్.

* * *

కేశవ్ వెంటనే లేక్‌వ్యూ బోట్ హౌస్ దగ్గరకు వెళ్ళాడు. కౌంటర్‌లో కూర్చుని వున్న వ్యక్తిని అడిగాడు-

"మిస్ రంభా జౌహరీ లోపల వున్నారా?"

"లేరు. ఆవిడ నాలుగు రోజుల క్రితం పహల్‌గావ్ వెళ్ళారు!"

"మళ్ళీ తిరిగి ఎప్పుడొస్తారు?"

"ఏమో నాకు తెలియదు? పనేమిటి?"

"ఆవిడతోనే పనివుంది" కేశవ్ గంభీరంగా అని "ఆవిడ పహల్‌గావ్‌లో ఎక్కడ దిగుతారు."

"అది కూడా నాకు తెలియదు" ఆ వ్యక్తి చిరాగ్గా సమాధానమిచ్చి అక్కడ నుంచి లేచి లోపలకెళ్ళిపోయాడు.

కేశవ్ తల వంచుకుని వెనుదిరిగాడు. బాధతో అతడి గుండె మండిపోతోంది. మరు క్షణం శివుడిమీద కోపంతో ఊగిపోయాడు కేశవ్.

'శంకరా... ఏమిటి ఆట? నా ప్రేమ చూచి భయపడుతున్నావా? రంభ నా నుంచి దూరంగా పారిపోతోందా? లేక నువ్వే రంభను నా నుంచి దూరం చేస్తున్నావా? నేను అధైర్య పడతాననుకోకు. నేను కేశవ్‌ని. ఒకప్పుడు సంగీత సిద్ధి కావాలనుకున్నాను. వీణను తప్ప

మరొకదానివైపు కన్నెత్తి చూడలేదు. ఏ స్త్రీని కూడా ప్రేమించి ఎరుగను. ఇప్పుడు రంభ ప్రేమ కావాలనుకుంటుంటే కాలం నాతో చెలగాటమాడుతోంది. నువ్వు ఆడిస్తున్నట్టున్నావు. చూస్తాను- అంతిమ క్షణం వరకు ప్రేమకోసం పోరాడతాను' ఆవేశంగా అనుకున్నాడు కేశవ్.

అదేరోజు బయలుదేరి పహల్‌గావ్‌ం వెళ్ళాడు.

* * *

లిద్దర్ నదీ తీరాన వెలసివున్న అతి సుందర ప్రదేశం పహల్‌గావ్‌. చుట్టూ రకరకాల మోడల్స్‌లో కట్టివున్న అధునాతనమైన రెస్ట్‌హౌస్‌లతో నిండిపోయి వుంటుంది. కానీ కేశవ్ ఆ ప్రదేశపు అందాన్ని గమనించే స్థితిలో లేడు. అతడి ఆలోచనలు, ఆశలు, ఆశయాలు సమస్తం ఒకే బిందువు దగ్గర కేంద్రీకరింపబడి వున్నాయి. అతడి కళ్లు యుగాలుగా దాహంతో పరితపిస్తున్నాయి. ఆ కళ్ళకు రంభ కనిపించాలి. రంభకావాలి. కేశవ్ వారం రోజులపాటు పిచ్చివాడిలా తిరుగుతూ పహల్‌గావ్‌లోని ప్రతి రెస్ట్ హౌస్ గాలించాడు. చివరికి ఎనిమిదో రోజున ఒక రెస్ట్‌హౌస్‌లో రంభ వుందని తెలిసింది.

"అవును ఇక్కడే వుంటున్నారు'' ఒక ముసలి నౌకరు అన్నాడు కేశవ్‌తో.

''నేను వారిని వెంటనే కలవాలి'' కేశవ్ అసహనంగా అడిగాడు.

''ఇప్పుడు పిలుపడదు'' ముసలినౌకరు జవాబిచ్చాడు.

''ఎందుకు పిలుపడదు? ఇప్పుడు పిలుపడకుంటే ఎప్పుడు పిలుపడుతుంది?''

"చెప్పలేను!"

"అంటే నీ ఉద్దేశం ఏమిటి?"

ముసలి నౌకరుకు కోపం వచ్చింది.

"ఆవిడ అమరనాథ్ యాత్రకోసం వెళ్ళిందయ్యా బాబు. ఆవిడ ఇష్టం వచ్చినప్పుడు వస్తుంది. ఎప్పుడు ఎక్కడా అంటే నేనెలా చెప్పగలను?" అన్నాడు చిరాగ్గా.

అది విని కేశవ్ స్తబ్దుడైపోయాడు. ఎవరో ఎత్తైన శిఖరం మీదకు తీసుకెళ్ళి అక్కడనుంచి హటాత్తుగా కిందకు పడదోసున్నారు. కేశవ్ కిందపడుతున్నాడు. కానీ ఎంత సేపటికీ అతని కాళ్ళు నేలను అనటం లేదు.

కేశవ్ విచలితుడైపోయి ఆ విషాద ఉద్వేగాన్ని మోయలేక ఒక్కసారే తల పట్టుకుని అక్కడే నేలమీద కూర్చుండిపోయాడు.

నౌకరు పరుగెత్తుకుంటూ వచ్చి "కళ్లు తిరుగుతున్నాయా?" అని అడిగాడు.

కేశవ్ సమాధానం ఇవ్వలేదు. తల పట్టుకుని చాలా సేపటివరకూ అలాగే కూర్చుండిపోయాడు. అతడిలోని సత్తువంతా ఒక్కసారిగా ఆవిరైపోయింది. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

"ఏమిటి అంత అవసరమైన పని వుందా ఆమెతో?" అడిగాడు ముసలి నౌకరు. "మంచినీళ్ళు తాగుతారా?" అన్నాడు.

"వద్దు" అనేసి కేశవ్ లేచి నిలబడ్డాడు. పదిరూపాయిల నోటు తీసి అతడిచేతిలో వుంచుతూ ''రంభ వచ్చిన మరుక్షణమే నాకు తెలియజెయ్యి చాలు" అన్నాడు.

"మీరెక్కడ వుంటారు?" నౌకరు అడిగాడు.

కేశవ్ తను వుంటున్న రెస్ట్ హౌస్ పేరు చెప్పాడు. కాని అంతలోనే షుక్కి






అన్నాడు "ఈ రోజునే నేను ఆ రెస్ట్ హౌస్‌నుంచి ఈ రెస్ట్‌హౌస్‌కు వచ్చేస్తాను. అదిగో ఆ చివరి అంతస్తులో దేవదారు వృక్షం కింద కనుపిస్తున్న గదిలో దిగుతాను. సరేనా?" అన్నాడు.

కేశవ్ అదే రోజు ఆ రెస్ట్ హౌస్ చివరి అంతస్తు గదిలో దిగాడు. ప్రతిక్షణం రంభ రాక కోసం ఎదురుచూస్తున్నాడు. ఒక్కో రోజున భోజనం కూడా చేయటంలేదు. అప్పుడప్పుడు పక్కనే అడవిలోకెళ్ళి పిచ్చివాడిలా తిరిగి వస్తున్నాడు. ఇప్పుడు రాత్రింబవళ్ళు అతడి చూపు ఒక రోడ్డుకు అతుక్కుపోయింది. ఆ రోడ్డు అమర్‌నాథ్ పోతుంది.

ఒక సంవత్సరం ముగియటానికి ఇంకా ఐదు రోజులు మాత్రమే మిగిలివున్నాయి. ఒక రోజు గడిచిపోయింది. ఇంకా నాలుగు. మరో రోజు. ఇంకా మూడు. మరో రోజు గడిచిపోయింది. ఇంక రెండు. ఇంకో రోజు కూడా గడిచిపోయింది. సరిగ్గా ఒక్క రోజు మాత్రమే మిగిలి వుంది.

ఒకే ఒక్క రోజు...

* * *

రేపే అమావాస్య రాబోతోంది. కేశవ్ ఆ రోజు రాత్రి శివుడి సమక్షంలో హాజరవుతానని మాటిచ్చాడు. ఇంతవరకు కనీసం రంభ ముఖమైనా కనిపించలేదు.

కానీ మాట తప్పకూడదుకదా! అయితే అదే రోజు ముసలి నౌకరు కేశవ్ దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు.

"అమర్‌నాథ్ యాత్రకు పోయిన వారంతా రేపు తిరిగి వస్తున్నారట. ఇప్పుడే వార్త అందింది" అని ఉత్సాహంగా చెప్పాడు నౌకరు.

ఆ వార్త విని కేశవ్ ఏ మాత్రం ఆసక్తి కనబరచకుండా అలాగే మౌనంగా కూర్చుండిపోవటం చూచి ఆశ్చర్యపోయాడు నౌకరు.

రెండో రోజు ఉదయాన్నే యాత్రికులు గుంపులు గుంపులుగా వచ్చి పహల్‌గావ్‌కు చేరుకున్నారు. కానీ కేశవ్ రంభ వచ్చిందేమో చూద్దామనైనా కదలలేదు. అలాగే కూర్చుండిపోయాడు. మధ్యాహ్నానికి నౌకరు మళ్ళీ వచ్చాడు.

"ఆవిడ వచ్చారు. ఇప్పుడే భోంచేసి పడుకున్నారు. సాయంత్రం నిద్రలేవగానే మీరు వచ్చి కలవచ్చు" అని చెప్పాడు. ఈసారి కూడా కేశవ్ మౌనంగానే వుండిపోయాడు. ఎలాంటి ఆసక్తి కనబరచలేదు. నౌకరు మరింత ఆశ్చర్యపోయాడు. విచిత్రమైన మనిషిలా వున్నాడే. ఆవిడ రాకపూర్వం వరకు అంతటి అసహనాన్ని కనబరచినవాడు తీరా ఆవిడ వచ్చాక కలవటానికి కూడా సిద్ధంగా లేడు. కేశవ్ హృదయం అతడికి దుర్భేద్యమైన రహస్యంలా కనిపించింది. కాసేపు అక్కడే నిలబడి వెనుతిరిగి వెళ్ళిపోయాడు నౌకరు.

మధ్యాహ్నం సాయంత్రంలో లీనమైంది. సాయంత్రం రాత్రిలోకి పరివర్తన చెందింది. కేశవ్ ఒంటికి సుగంధాన్ని పట్టించుకున్నాడు. ధోవతి సర్దుకుని చక్కగా అలంకరించుకున్నాడు. మెడలో అడవి పూలమాల ధరించాడు. వీణ పట్టుకుని లిద్దర్ నదీ తీరానికి బయలుదేరాడు.

వెళ్తూ వెళ్తూ రంభ వున్న రెస్ట్‌హౌస్ మీదుగా నడిచి లిద్దర్ నదీ తీరానికి చేరుకున్నాడు. తీరం వెంబడి రాళ్ళలోంచి శివలింగాకారంలో వున్న ఒక రాయి వెతికి తెచ్చాడు. రాతిని శుభ్రంగా కడిగాడు. నది ఒడ్డునే అలలు మెల్లగా తాకుతున్న ఒక పెద్ద వెడల్పాటి బండరాయి మీద శివలింగాకారంలో వున్న రాతిని ప్రతిష్ఠించాడు. నదిలోకి దిగి శుభ్రంగా స్నానం చేశాడు. ఒడ్డుకు చేరుకుని శివలింగాన్ని అడవి పూల హారంతో అలంకరించాడు. శివుడ్ని ధ్యానించి సాష్టాంగ ప్రణామాలు చేశాడు. "ఇవ్వాళ అమావాస్య రాత్రి. సంవత్సరం పూర్తయిపోయింది. శంకరా నేను వచ్చేశాను" అని నిండు మనసుతో శివుడితో చెబుతున్నట్టు అన్నాడు.

అక్కడ నుండి కదలి వెళ్ళి గులకరాళ్ళతో నిండివున్న నేల మీద కూర్చుని వీణ వాయించసాగాడు. అతడి కళ్ళు శివ ధ్యానంలో నిమగ్నమై, ఏకాగ్రత నిండిన తన్మయత్వంలో మూసుకుపోయాయి. కాసేపట్లో కేశవ్ బాహ్య ప్రపంచాన్ని పూర్తిగా మర్చిపోయాడు.

హఠాత్తుగా అతడి చెవుల్లో ఎవరివో మాటలు వినిపించాయి.

"వీణ చాలా బాగా వాయిస్తున్నారే? ఎవరండీ మీరు?"

కేశవ్ నెమ్మదిగా కళ్ళు తెరచి చూచాడు. తెల్లటి చీర కట్టుకుని రంభ ఎదురుగా నిలబడి వుంది. గాలికి ముంగురులు చెంపల మీద జారి హాయలు




హొయలుగా ఎగురుతున్నాయి.

"ఎవరండీ మీరు?" రంభ మళ్ళీ అడిగింది.

"నన్ను కేశవ్ అంటారు" సాభిప్రాయంగా రంభనే చూస్తూ అన్నాడు కేశవ్. ఆ మాట రంభమీద ఎలాంటి ప్రభావమూ చూపించలేదు. నెమ్మదైన స్వరంతో రంభ మళ్ళీ అడిగింది.

''అమర్‌నాథ్ యాత్రకోసం వచ్చారా?''

"లేదు. నేను మరో యాత్రకోసం వచ్చాను" అని ఒక్క క్షణకాలం రంభ మొహంలోకి చూస్తూ ''నేను మిమ్మల్ని చూద్దామని చాలా దూరంనుంచి వచ్చాను" అనేశాడు.

"నన్ను చూద్దామనా?" రంభ ఉలికిపాటుతో వెనక్కి జరుగుతూ అంది "ఎందుకు?"

''ఎందుకంటే నేను మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను.''

"చాలా విచిత్రమైన మనిషిలా వున్నారే?''కోపంగా అంది రంభ. "మీకూ నాకూ మధ్య కనీస పరిచయమన్నా లేదు, స్నేహం లేదు, బంధుత్వం అంతకన్నా లేదు. నేను కనిపించగానే నన్ను ప్రేమించేసానంటున్నారు?''

"ఎందుకంటే నా దగ్గర ఎక్కువ సమయం లేదు.''

"సమయం లేకుంటే నేనేం చేయగలను?'' అదే కోపంతో అనేసి వెనుతిరిగి నడవసాగింది రంభ. కేశవ్ వెంబడించాడు.

"మీరు ఏదైనా చేయగలరు. తల్చుకుంటే నాకు ప్రేమను ప్రసాదించగలరు. ప్రేమను ప్రసాదించి జీవితాన్నివ్వగలరు! జీవితాన్నిచ్చి నా ఆత్మయొక్క కాంక్షను తీర్చగలరు! నిజం చెబుతున్నాను. నేను ఏ రోజున మిమ్మల్ని చూచానో ఆ రోజునే నా ఆత్మను మీకు సమర్పించుకున్నాను. ఒక సంవత్సరంనుంచి మీ కోసం వెతుక్కుంటూ తిరుగుతున్నాను.'' కేశవ్ ఒక్క గుక్కలో చెప్పేసాడు.

"మీకుమల్లె నూటొక్కమంది తిరుగుతుండవచ్చు" రంభ సౌందర్య గర్వంతో పలికింది. "దానికి నేనేం చేయగలను. నూటొక్కమందినీ ప్రేమించి పెళ్ళి ఎలా చేసుకోగలను? కుదరదు"

"వాళ్ళందరూ అబద్ధీకులు. నా ప్రేమ వాస్తవమైనది" కేశవ్ పరితపిస్తూ అన్నాడు. కేశవ్ ఆ సమయంలో తనకు తనే అత్యంత హాస్యాస్పదంగా కనిపిస్తున్నాడు. కానీ ఏం చేయగలడు. శివుడు వుండికూడా తననీ స్థితిలో వుంచుతున్నాడు. ఆలోచిస్తున్న కేశవ్‌కు తన పరిస్థితిమీదకన్నా శివుడిమీద ఆగ్రహం పెరిగిపోసాగింది.

"ప్రేమిస్తున్నాననుకునే ప్రతి ఒక్కడూ తను మాత్రమే నిజం, మిగతా వాళ్ళంతా అబద్ధం అనుకుంటాడు'' తీవ్రమైన వ్యంగ్యం నిండిన స్వరంతో అంది రంభ.

"మీరు నన్ను విశ్వశించక తప్పదు! నా దగ్గర ఎక్కువ సమయం లేదు. నా ప్రేమను స్వీకరించక తప్పదు. నన్ను పెళ్ళిచేసుకోక తప్పదు!'' కేశవ్ రంభకు చేరువగా నడుస్తూ అన్నాడు.

"దగ్గరకు వచ్చారంటే మర్యాద వుండదు జాగ్రత్త" రంభ కోపంతో అరిచింది. కిందికి వంగి ఒక రాయి అందుకుంది.

''నన్ను నమ్మండి. నన్ను సాంతంగా వినండి'' కేశవ్ ముందుకువస్తూ బాలనగా

అంటున్నాడు. ఇంతలో రంభ చేతిలో వున్న రాయినే బలంకొద్దీ కేశవ్ మీదకు విసిరింది. రాయి కేశవ్ నుదుటికి కొట్టుకొని రక్తం ధారగా ప్రవహించసాగింది.

రంభ కేశవ్ వైపు చూడకుండానే చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

కేశవ్ కోపంతో ప్రజ్వరిల్లిపోయాడు. కారుతున్న రక్తాన్ని ఆపే ప్రయత్నమైనా చేయకుండా ముందుకు నడిచాడు. కసి, కోపంతో అదుపు తప్పి వీణను ఎత్తి శివలింగం స్థాపించబడివున్న రాతికేసి బలంగా బాదాడు. వీణ రెండు ముక్కలైంది. కేశవ్ అంతటితో ఆగలేదు. ఒక పెద్ద బండరాయి మోసుకొచ్చి ముక్కలైన వీణను ఇంకా నజ్జు నజ్జు చేసేశాడు.

"నన్ను ఆఖరు రోజున పిలిచావు. ఇదీ ఒక న్యాయమేనా? నేనూ నా వీణను నీ సమక్షంలో ముక్కలు చేసేశాను. ఇంక నీ సన్నిధిలో ఎన్నటికీ పాడను. పిల్చుకో నీ దగ్గరకు. ఏ శిక్ష వేస్తావో వెయ్యి. మళ్ళీ నన్ను శిలామూర్తిని చేసెయ్. నేను సిద్ధంగా వున్నాను." అంటున్న కేశవ్ నుదుటినుంచి రక్తం ఇంకా ప్రవహిస్తూనే వుంది. కానీ అతడు అలాగే పద్మాసనం వేసుకుని శివలింగం ప్రతిష్టించబడివున్న రాతిముందుకూర్చుండిపోయాడు. కళ్ళు రెండు మూసుకుని ధ్యానంలో నిమగ్నమైపోయాడు. కానీ అల్లకల్లోలమైపోయిన అతడి హృదయం ఏకాగ్రతను చేరుకోలేకపోయింది. అర్థరాత్రి ఎప్పుడు అవుతుందా, తన శరీరం మళ్ళీ శిలగా ఎప్పుడు మారుతుందా అన్న నిరీక్షణలో కూర్చున్నాడు కేశవ్ చివరికి.

రాత్రంతా అలాగే నది పక్కన చల్లగా వీస్తున్న చలిగాలిలో అదే రాయి పక్కన కూర్చుని మృత్యువు కోసం ఎదురు చూచాడు కేశవ్.

తెల్లవారబోతోంది. అప్పుడే అటుగా వచ్చిన రంభ కేశవ్‌ను చూచింది. రాత్రి తను వదిలి వెళ్ళిన స్థానంలో అదే రాతి పక్కన శవంలా పడివున్నాడు కేశవ్. స్పృహలేదు. నుదుటి, ముఖమ్మీద రక్తం గడ్డకట్టుకు పోయి వుంది.

కంగారు పడుతూ రంభ కేశవ్ దగ్గరకు నడిచింది. నుదుట చేయి వేసి చూచింది. చల్లగా వుంది. మళ్ళీ వెంటనే చేయి పట్టుకుని నాడి పరీక్షించింది. చాలా బలహీనంగా ఎక్కడో కొట్టుకుంటోంది నాడి.

అమావాస్య రాత్రి గడిచిపోయింది. కానీ కేశవ్ ఇంకా జీవించే వున్నాడు.




తనింకా ఎలా జీవించి వున్నాడు? అయితే తనింకా జీవించే వున్నందుకు కేశవ్ బాధపడటం లేదు. పైగా సంతోషిస్తున్నాడు. కానీ ఇంకా జీవించి వుండటానికి కారణం ఏమిటి? అన్నదే అతడిని పీడిస్తున్న సందేహం. ఒకవేళ శివుడు తనకు జీవితాన్నిచ్చి పొరపాటున మర్చిపోలేదు కదా?

రంభ బెడ్‌రూం కిటికీ లోంచి చూస్తూ ఆలోచిస్తున్నాడు కేశవ్. కిటికీకి తెల్లటి కర్టెన్స్ కట్టి వున్నాయి. ఫ్లవర్ వాజ్‌ల

నిండా రకరకాల పూలు అలంకరించబడి వున్నాయి. చిన్న స్టూల్ మీద రంభ ఫొటో ఒకటి పెట్టబడి వుంది. పహిల్‌గామ్ ఆకాశమ్మీద సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. కేశవ్ బ్రతికే వున్నాడు.

ఎందుకని?

శివుడు మర్చిపోయి వుంటాడా? అసంభవం!

బహుశా శివుడికి నాపై దయ కల్గి వుంటుంది. సంవత్సర కాలంలో రంభను తన దగ్గరకు చేర్చలేకపోయాడు. చివరికి ఆఖరు రోజున కొద్ది గంటల ముందు రంభ కనిపించింది. ఇది న్యాయం కాదు? పైగా ఆ కొద్ది నిమిషాల కాలంలో రంభ ప్రేమను, రంభను గెల్చుకోవటానికి తనేమో భగవంతుడు కాదు?

తప్పకుండా శివుడు తనపై దయ చల్చి వుంటాడు. తన కోరికలు సఫలవంతం కమ్మనే కదా శివుడు ఒక సంవత్సరం ఆయుర్దాయాన్ని ప్రసాదించాడు. నియమానుసారంగా సంవత్సరం పూర్తి కాగానే తను ఎల్లోరాకు చేరుకోవాలి. తను చేరుకోలేదు. అయినా జీవించే వున్నాడు. ఆఖరి క్షణాల్లో మాత్రమే రంభను కలుసుకోగలిగాడు కాబట్టి శివుడు దయతల్చి-ఇంకా ప్రాణాలతో వుంచాడు!

కానీ ఈ ప్రాణం ఇంకెంత కాలం వరకు వుంటుంది. శివుడు తనకు జీవితాన్నిచ్చి మృత్యు జ్ఞానాన్ని లాగేసుకున్నాడనిపించింది. ఇంతకుముందు తన జీవితం ఎంతవరకు అనేది ఖచ్చితంగా తెలుసు. కానీ ఇప్పుడు అయోమయం, అనిశ్చితం. ఏ నిమిషాన అయినా మరణించవచ్చు. తను అటు అమరత్వాన్ని, ఇటు సామాన్య మానవుల్లో వుండే విశ్వాసాన్ని రెంటినీ పోగొట్టుకున్నాడని అనుకున్నాడు కేశవ్.

అంతలో మరో విచిత్రమైన, భయంకరమైన ఆలోచన వచ్చింది. అసలు తనింత కాలం కలకనలేదు కదా? ఒకవేళ తను ఏడాది క్రితం ఏదో విఘాతానికి గురై స్మృతి కోల్పోయి వుండొచ్చు. తను ఎవరు? ఎక్కడ నుంచి వచ్చాడు అన్నవిషయాన్ని మర్చిపోయి వుండొచ్చు. తన తల్లి దండ్రులు, తోబుట్టువులు ఎక్కడన్నా వుండి వుంటారేమో? తను పిచ్చితనంలో ఇంట్లోంచి పారిపోయి వచ్చాడేమో? ఇప్పటి వరకు తనకు గుర్తున్నదంతా ఆ పిచ్చితనం తాలూకు ఒక కలేనేమో? ఎల్లోరాలో శిలాకృతిలో వుండటం...శివుడు ప్రత్యక్షమై జీవితాన్ని ప్రసాదించటం... తను మళ్ళీ జీవించటం... అంతా ఒక కల.

ఇదే చాలా వాస్తవంగా వున్నట్టు అన్పిస్తోంది.

* * *

కానీ కాదు. ఆనాటి సంఘటన బాగా గుర్తు వుంది. ఆ రోజు యువతులందరూ ఎల్లోరాకు రావటం....రంభ మాటలు...వెంటాడి...వేటాడి గాయపర్చగల రంభ చూపులు...అంతా చాలా గుర్తుంది. కేశవ్ ఆలోచనలు సగంలోనే వుండిపోయాయి. అంతలో రంభ గదిలోకొచ్చింది.

కేశవ్ తన ఆలోచనలను తొక్కిపెట్టి పాలు, ఫలహారం పట్టుకొస్తున్న రంభ వైపు నవ్వుతూ చూచాడు.

"కేవలం ఒక్క గాయానికే ఇంత ప్రేమను పొందగలిగితే నేను నా మొత్తం శరీరాన్ని రాళ్ళతో గాయపర్చుకోవటానికి

సిద్ధంగా వున్నాను" అన్నాడు కేశవ్ అదే చిరునవ్వుతో.

"పరాచకాలు కట్టిపెట్టి ముందు ఫలహారం తినండి" అని రంభ కేశవ్ పక్కనే కూర్చొని స్పూన్‌తో టిఫెన్ తినిపించ సాగింది.

"మీ వేళ్ళు చాలా అందంగావున్నాయి. నా వీణ తంత్రుల్లా చాలా నాజూగ్గా వున్నాయి" అన్నాడు కేశవ్ టిఫెన్ తినిపిస్తున్న రంభ వేళ్ళ వైపు చూస్తూ.

రంభ తన చేతిని చటుక్కున వెనక్కు లాగేసుకుంది.

"మాట్లాడకుండా తినండి. లేకపోతే నా చేతుల్తో మీకు తినిపించను" అంది విసుగ్గా!

"ఆడవాళ్ల ముఖమ్మీద కృత్రిమ కోపం ఎంతందంగా వుంటుందీ...?" కేశవ్ ఇంకా ఏదో అనబోయి అంతటితో ఆగిపోయాడు.

"ఎంత తియ్యగా...పరిమళ భరితంగా వుంటుంది" అన్నాడు కేశవ్ మళ్ళీ.

"ఏమిటీ ఫలహారమా?"

"కాదు...ముద్దు... మీరివ్వగలిగితే"

రంభ టిఫెను ప్లేటును ధఢాలున కేశవ్ ముందుపడేసి లేచి నిల్చుంది.

"మీరీ అల్లరి చిల్లరి మాటలు కట్టిపెట్టకపోతే నేనీ నిమిషంలోనే ఇక్కడి నుంచి వెళ్ళిపోతాను. ఏదో పొరపాటున కొట్టాను కదా అని మిమ్మల్నిక్కడకు తెచ్చాను. ఏడు రోజులుగా సేవలు చేస్తున్నాను. కోలుకొనే ప్రయత్నం ఏదీ మీరు చేస్తున్నట్టు లేదు. మిస్టర్ కేశవ్! స్త్రీ హృదయ కోమలత్వాన్ని చూచి ప్రేమని భ్రమించకండి. ప్రేమ కూ, జాలికీ మధ్య వుండే వ్యత్యాసం మీకు తెలిసినట్టు లేదు?" చూపుడు వేలు కేశవ్ వైపు గురిపెట్టి కోపంగా అంది రంభ.

"అది ఫలహారానికి,ముద్దుకు మధ్యవుండే వ్యత్యాసంలాంటి వ్యత్యాసం. మిస్ రంభా! నాకు బాగా తెలుసు. నేనింక ఫలహారం తినను" కేశవ్ కోపంగా ముఖాన్ని మరో వైపుకు తిప్పుకున్నాడు.

"ఏడు జన్మలనుంచీ మీకోసమే వున్న నౌకరులా భావిస్తున్నట్టున్నారు నన్ను" రంభ తీక్షణంగా అడిగింది.

"మీరు నాకు ఏడు జన్మల నౌకరు కాదు. నేను రెండు వేల సంవత్సరాల నాటి మీ ప్రేమికుడ్ని అన్నది నిజం" కేశవ్ వెంటనే జవాబిచ్చాడు.

"మీ ప్రేమ సంగతి అటుంచి మీ ఆలోచనా ధోరణీ, మీ ప్రవర్తనా పరమ మూర్ఖంగా వున్నాయన్న విషయాన్ని ముందు గమనించండి" రంభ నిర్ణయాత్మకంగా అంది. "మీరు ఏ ఆటవిక దంపతుల సంతానమై వుంటారో అర్థం కావటం లేదు. ఈ టిఫిన్ తినండి. లేకపోతే పీక పిసికేయగలను"

కేశవ్ అన్నాడు "గుండెల్లోకి పెద్ద బల్లెం దిగేసూ అప్పే చిన్న ముల్లు అంటారు మీరు"

"నేనట్లాగే చేస్తాను. నచ్చితే వుండొచ్చు. లేకపోతే వెళ్ళొచ్చు" రంభ విసురుగా అంది.

కేశవ్ కోపం చల్లబడిపోయింది. స్పూన్ టక టక లాడించుకుంటూ గబగబా టిఫిన్ తినేసి, పక్కనే పెట్టివున్న గ్లాసెడు పాలు గట గట తాగేశాడు.

"రెండు వేల సంవత్సరాలకు పూర్వం కూడా మనుషులు ఇలాగే ఆబగా, కొంపలు మునిగిపోతున్నట్టు తినేవాళ్ళా?" వ్యంగ్యంగా అడిగింది రంభ.

"ఆకలి వేస్తుంటే ఎప్పుడైనా ఎవ





రైనా ఇలాగే తింటారు. అయినా రెండు వేల సంవత్సరాలకు పూర్వం ఇవాళ వున్నంత ఆకలి లేదు మనుషుల్లో". అన్నాడు కేశవ్.

"రెండు వేల సంవత్సరాలకు పూర్వం ఇంతమంది మనుషులు కూడా లేరు దేశంలో. ఔరంగజేబు కాలంలో ఈ దేశ జనాభా పదకొండుకోట్లు. ఇప్పుడు యాభై కోట్లు. ఔరంగజేబు మరణించి ఇంకారెండు శతాబ్దాలు కూడా నిండలేదు. అప్పుడు అంత తక్కువ జనాభా వుండబట్టే ఆహార ధాన్యాలు ఎక్కువగా మిగిలిపోయేవి. కాబట్టి ఇంత ఆకలి వుండేదికాదు. కానీ దాంతోపాటు బుద్ధి, జ్ఞానం కూడా వుండేవి కావు" అంది రంభ అదే వ్యంగ్య ధోరణిలో.

"ఇంక నేనీ విషయాన్ని మీతో చర్చించదలుచుకోలేదు. వెళ్ళండి" కేశవ్‌కు మళ్ళీ కోపం వచ్చింది.

"వెళ్ళకుండా మీతో వాదించటానికి రాలేదు నేను" రంభ టిఫిను ప్లేటును పక్కనున్న స్టూల్ మీద గిరవాటు వేసి చర చరా బయటకు వెళ్ళిపోయింది.

అర్థగంట గడిచాక రంభ మళ్ళీ గదిలోకొచ్చింది. ఆవిడ వెనకే మరి కొందరు లోనికొచ్చారు. వాళ్ళల్లో ఇద్దరిని వెంటనే గుర్తించాడు కేశవ్. ఆ ఇద్దరు యువకులతోనే రంభ ఆ రోజు హారూ సరస్సు పక్కన పిక్నిక్‌లో కనిపించింది. సన్నగా పొడుగ్గా వుండి కళ్ళజోడు పెట్టుకున్న యువకుడ్ని పరిచయం చేస్తూ అంది రంభ—

"వీరు మదన్...బొంబాయిలోని ఒక కాలేజీలో హిస్టరీ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు......వీరు భగీరథ్" బలిష్టంగా వుండి చామనఛాయలో వున్న యువకుడ్ని పరిచయం చేస్తూ అంది. "వీరి నాన్నగారికి బొంబాయిలో ఒక ప్లాస్టిక్ మిల్లుంది. అది ఏసియాలోకెల్లా పెద్ద మిల్లు. వీరిద్దరూ నా ఫ్రెండ్స్ ఖుదిస్రియా, ఆయిరిని."

కేశవ్ వాళ్ళిద్దర్నీ కూడా వెంటనే గుర్తించాడు. వారిలో అందరికన్నా ఎత్తుగా ఉండి ఖరీదైన దుస్తులు ధరించిన ఓ నడి వయసు మనిషి నిలబడి వున్నాడు. అతను అందరికన్నా ప్రత్యేకంగా కన్పిస్తున్నాడు.

"వీరు మా డాడీ - పేరు జౌహరీ" రంభ గర్వంగా పరిచయం చేసింది.

"వీరు కేశవ్" కేశవ్‌ను అందరికీ ఒకే సారి పరిచయం చేసింది రంభ. మళ్ళీ నవ్వుతూ "నేను వీరిని 'ఆదిమవాసి కేశవ్' అంటాను" అంది.

"పహల్‌గావ్ అడవిలో వున్నారనా?" మదన్ కాస్త వ్యంగ్యాన్ని రంభ నవ్వుకు జోడిస్తూ అన్నాడు.

"కానీ అడవిలో ఉండేది ఎలుగ్గొడ్డు కదా" భగీరథ్ నవ్వాడు.

అది విని మగవాళ్ళంతా పకపక నవ్వేశారు.

"అవును. ఎలుగ్గొడ్లే వుంటాయి. కానీ వాటితో పాటు తేనెతుట్టెలు కూడా వుంటాయి. అవంటే ఎలుగ్గొడ్లకు అమితమైన ఇష్టం" కేశవ్ మరింత స్పష్టంగా వెంటనే అన్నాడు.

ఈసారి ఆడవాళ్ళంతా పడి పడి నవ్వారు.

మరి కాసేపట్లో "రండి. వారిని రెస్ట్ తీసుకోనివ్వండి" అంటూ రంభ అందరినీ బయటకు తీసుకెళ్ళిపోయింది.

బయట కొచ్చాక "ఆ రోజు క్రైరీ

ఇంట్లో పార్టీలో వీణ వాయించింది ఈయనే కదూ?" ఆయిరీని ఖుద్సియా చెవుల దగ్గర మెల్లగా గొణిగింది.

"అవును అతనే" ఖుద్సియా వెంటనే అంది.

"మరిక్కడేం చేస్తున్నట్టు?" అయిరీని ఆసక్తిగా అడిగింది.

"కైరీ ఇంట్లో ఏం చేసేవాడో అదే చేస్తుంటాడు" ఖుద్సియా ఈర్ష్యతో అంది "అయినా నాకెలా తెలుసుంది?"

"ఏదన్నా చెప్పు కానీ రంభ అభిరుచిని మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. విపరీతమైన అందగాడు. ఎలా వల పన్నిందో?" అంది ఆయిరీని.

"వలలు, ఉచ్చులూ పన్నవలసిన అవసరం రంభకేమొచ్చింది" ఖుద్సియా మాటల్లో ఒకవైపు ఈర్ష్య, మరో వైపు ప్రశంస కనిపించాయి.

"మగవాళ్ళు వాళ్ళంతట వాళ్ళే వచ్చి చిక్కుకు పోతారు. రంభ దీపం అయితే వాళ్ళు శలభాలు" అంది.

వీళ్ళంతా ముందుకు నడిచి వరండా లోకి చేరుకున్నారు. మదన్, భగీరథ్ మంచి నీళ్ళు తాగివస్తామని వాళ్ళను దాటు కుంటూ రెండో వైపుకు నడిచారు.

భగీరథ్ మదన్ పక్కనే నడుస్తూ అతడి డొక్కలో మోచేత్తో ఒక్క పోటు పొడిచాడు. ఆ పోటు ఎంత బలంగా వుందంటే మదన్ తూలి పక్కకు పడ బోయి నిలదొక్కుకుని నిలబడి ఏమిటీ మొరటు చేష్ట అన్నట్టు భగీరథ్ వైపు చూశాడు.

భగీరథ్ అదేమీ గమనించకుండానే మళ్ళీ చిన్నగా మోచేత్తో పొడుస్తూ—

"ఎవరీ కొత్త పక్షి?" అడిగాడు.

"ప్రియుడు నంబర్ నూటపదకొండు" మదన్ భగీరథ్‌ను ఉడికిస్తూ అన్నాడు.

భగీరథ్ ఇబ్బంది పడిపోతున్నట్టు రెండు చేతులూ విసురుగా ఊపాడు. ఛాతీ వెనక్కు విరుచుకున్నాడు. ఖుజా లెగరేస్తూ అసహనంగా ఊపిరి పీల్చు కున్నాడు. చాలాసేపటి వరకు ఏం జవాబు చెప్పాలో తోచలేదు అతడికి. చివరికి అన్నాడు—

"తుపాకీపెట్టి ఎవరినైనా కాల్చి పారే యాలనిపిస్తోంది నాకు."

"ప్రస్తుతానికి ఇదిగో నేను సిద్ధంగా వున్నాను" అన్నాడు మదన్ భగీరథ్‌ను మరికాస్త ఎక్కువేస్తూ.

"అవును..." అంటూ భగీరథ్ అల్ల కల్లోలంగా నవ్వుతూ మదన్ డొక్కలో మళ్ళీ ఒక పోటు బలంగా పొడిచాడు. ఈసారి మదన్ మూడడుగుల దూరం విసిరివేయబడ్డాడు. కింద పడిపోయేవాడే కానీ అంతలో జౌహరీ వచ్చి పట్టు కున్నాడు.

భగీరథ్ చిన్ని చిన్ని కళ్ళలో కన్నీళ్ళు ఉబికి వచ్చాయి.

"మదన్ యూ ఆర్ దిలిమిట్... కాస్త లిమిట్‌లో వుండు" అన్నాడు భగీరథ్ నవ్వే ప్రయత్నం చేస్తూ.

ఈ అసభ్యకరమైన, అనవసరమైన చేష్టలు మరొకరు చేసే ఎవరూ సహిం చరు. కానీ భగీరథ్ చేస్తే ఎందుకు సహి స్తారంటే అతడి తండ్రి ఆసియాలోకెల్లా పెద్దదైన ప్లాస్టిక్ ఫ్యాక్టరీకి యజమాని. అందుకని మిత్రులందరూ అతడేమిచేసినా సహించి ఊరుకుంటారు. ఎవరైనాసహించ లేదంటే వాడు ఆసియాలోకెల్లా పెద్ద మూర్ఖుడిగా జమకట్టబడతాడు.

అందరూ కాఫీ తాగిన తరువాత భగీ





రథ్, జౌహరీ కలసి అడవిలోకి బయలు దేరారు. బయలుదేరేటప్పుడే జౌహరీ ఇంట్లోంచి రైఫిల్ అడిగి తీసుకున్నాడు భగీరథ్. వెళ్తూ రంభతో అన్నాడు–

"దారిలో పిట్టలు దొరికితే కొట్టుకు వస్తాను."

అడవిలో చాలా దూరం వచ్చేశారు. ఇద్దరూ మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. పక్కనున్న చెట్టుమీద పావురాల గుంపొకటి కనిపించింది. భగీరథ్ రైఫిల్ పేల్చాడు. ఒక పావురం రెక్కలు టపటప కొట్టుకుంటూ నేలమీద పడింది. దాన్ని తీసి బ్యాగ్‌లో పడేశాడు భగీరథ్.

"మనమే విషయం మాట్లాడుకుంటున్నాం?" అడిగాడు భగీరథ్.

"నువ్వు రంభను గురించి ఏదో చెబుతున్నావు."

"అవును. అన్నట్టు మీరు రంభను నాకిచ్చి పెళ్ళిజరిపిస్తానని మాటిచ్చి రెండేళ్ళు గడిచిపోయాయి. ఆ రోజునుంచి నేను ఎదురుచూస్తున్నాను. కానీ పరిస్థితి అలాగే వుంది" అంతవరకు తీక్షణంగా జౌహరి ముఖంలోకి చూస్తూ ఆ మాటలన్నాడు భగీరథ్. మళ్ళీ వెంటనే తన దృష్టిని చెట్ల కొమ్మలవైపుకు మరల్చి పిట్టలకోసం వెదుకుతున్నాడు.

జౌహరీ అన్నాడు "కానీ నువ్వు ఒక విషయం మర్చిపోకూడదు. అదేమిటంటే రంభ ఒక మోడ్రన్ అమ్మాయి. నేనామెకు మోడ్రన్‌తండ్రిని. ఇదే ఓ యాభై ఏళ్ళ క్రితంఅయితే రంభ అభిప్రాయంతో నిమిత్తం లేకుండా నీకిచ్చి పెళ్ళి జరిపించేసి వుండేవాణ్ణి. కానీ ఇప్పుడు ఆ రోజులు లేవు. మారిన రోజులు మారిన బంధాలను కోరుకుంటాయి."

"నేను రెండేళ్ళు నిరీక్షించాను" భగీరథ్ కోపంగా మొహం మాడ్చుకుంటూ అన్నాడు– "ఈ రెండేళ్ళలోనూ రంభ ప్రియుల సంఖ్య పెరిగిందే కానీ తరగలేదు. దమ్మిడీకి కొరగాని వెధవ లందరితోనూ నేను మాట్లాడవలసి వస్తోంది. కనీసం ఒక ఖరీదైన షర్టు కూడా లేని వాళ్లు రంభకు ప్రియులు. చాలా అసహ్యంగా వుంది. రంభ నొచ్చుకుంటుందేమోనని నేను వాళ్ళ పాత దుస్తులే బ్రహ్మాండంగా వున్నాయనీ, కుట్టు చాలా గొప్పగా వుందనీ పొగడవలసి వస్తోంది. నేనూ వాళ్ళతోపాటు క్యూలో నిలబడ్డం చూచి, అందరూ నన్ను మూర్ఖుడిగా భావించి నవ్వుకుంటున్నారు" అతడి మాటల వెనుక అతడికున్న రూపాయి చప్పుళ్ళు గలగలా వినిపించాయి.

"నువ్వు రంభకు ఆలోచించుకునే టైం ఇవ్వటం మంచిది. అదీకాక రంభ ఒకజౌహరీకూతురు. జౌహరీఅంటేతెలుసు కదా! వజ్రాలు, వైఢూర్యాల వెల నిర్ణయించే వాడు. రంభ కూడా నాలాగే విలువ నిర్ణయించి మేలైన వజ్రాన్ని ఎన్నుకుంటుంది" అన్నాడు జౌహరి.

"రెండేళ్ళు అంటే తక్కువ కాలమా మీ దృష్టిలో?"

"మరికొంత కాలం ఓపిక పట్టక తప్పదు"

"ఇంకా ఓపికా? ఈలోగా నేను ఇంకా పెద్ద మూర్ఖుడిగా భావింపబడటానికేనా? కనీసం నాతో మాట్లాడటానికి టైం దొరకదు ఆమెకు. నాతో కలసిమెలసి తిరగదు. ఎప్పుడు చూచినా ప్రియులను, స్నేహితురాండ్రను వెంటేసుకుని తిరుగుతుంటుంది. ఒకళ్ళు ఇద్దరూ సరిపోరు ఆవిడకు. ఆమె మనసు రంజింపజేయటానికి డజన్ల కొద్దీ ప్రియులు ఎప్పుడూ

వెంట వుండాలి" అన్నాడు భగీరథ్ కాస్త ఏహ్యాభావంతో.

జౌహరి మళ్ళీ అన్నాడు "నువ్వు ఇంకో విషయాన్ని కూడా గుర్తు పెట్టుకోవాలి. రంభ చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకుంది. అప్పట్నించీ తల్లినీ, తండ్రినీ నేనే అయి అతి గారాబంగా పెంచాను. కోరినదల్లా ఇచ్చాను. నేనూ రంభ పెళ్ళి గురించే ఆలోచిస్తూనే వున్నాను. అయినా రంభ ఒక జౌహరి కూతురు. అన్నిటి కన్నా అమూల్యమైన వజ్రాన్ని ఎప్పుడు ఎక్కడ ఎన్నుకుని తన జీవిత భాగస్వామిగా చేసుకోవాలో రంభకు బాగా తెలుసు. ఒక విలువైన వజ్రాన్ని ఎన్నుకోవటానికి కాస్త టైం పడుతుంది. కాస్త కఠినంగా తెలివిగా వ్యవహరించవలసి వస్తుంది. ప్రతి మెరిసే పదార్థాన్నీ వజ్రం అనుకుని భ్రమించటానికి రంభ సాధారణమైన అమ్మాయి కాదు!"

"ప్రతి తండ్రీ తన కూతురి మేలునే కోరుకుంటాడు. ప్రేమ వ్యాపారం చేయించాలని చూడడు" కింద వున్న రాయిని బూటుకాలితో బలంగా తంతూ అన్నాడు భగీరథ్. "సరే వడ్డీకి తీసుకున్న ఆమూడు లక్షల మాటేమిటి? పెట్టిన గడువు దాటిపోయింది. ఇంకా గడువు పెంచుతారా? చెల్లు వేస్తారా?" అడిగాడు భగీరథ్.

"గడువు పెంచు" చాలా నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు జౌహరి. అతడి స్వరంలో నిర్లక్ష్యాన్ని భగీరథ్‌కూడా గమనించాడు.

"నాకు మరో యాభై వేలు కావాలి?" జౌహరి అదే నిర్లక్ష్య ధోరణిలో అడిగాడు.

"వీటి కోసమేనా నన్ను పహల్‌గావ్‌ పిలిపించారు?" అడిగాడు భగీరథ్.

"అవును" అదే ధోరణిలో ఏ మాత్రం తగ్గకుండా అన్నాడు జౌహరి. భగీరథ్ జేబులోంచి చెక్‌బుక్ తీసాడు. పక్కనే వున్న బండమీద కూర్చుని చెక్ రాసి జౌహరీ కందించాడు. జౌహరి చెక్ వైపు చూడకుండానే పాంటు జేబులోకి తోసేసాడు.

"ఇక వెళ్దామా?" భగీరథ్ లేచి నిల్చున్నాడు.

ఇద్దరూ నడుస్తున్నారు. జౌహరి ఏదో మాట్లాడటానికన్నట్లు "ఈమధ్య ఖుర్షీదా, ఆయిరీనిలతో నీకు స్నేహం ఎక్కువైపోయిందట? ఏమిటి సంగతి? ఎందాక వచ్చింది?" అడిగాడు.

"ఒట్టి నిరాధారమైన అపవాదు. రంభతో కంపెనీ దొరకనప్పుడు విసుగు పుట్టి వాళ్ళతో కాలక్షేపం చేస్తుంటాను. అది సరే మీ మోనా సంగతి ఏమైంది? బావుందా?"

మోనా విషయాన్ని సూటిగా గురి పెట్టి రైఫిల్లా పేల్చాడు భగీరథ్. అది విని జౌహరి తృళ్ళిపడ్డాడు. అతడ్ని నిజంగానే రైఫిల్ పెట్టి కాల్చినట్టనిపించింది. అయినా మోనా విషయం భగీరథ్‌కు ఎలా తెలిసింది? జౌహరి ఆలోచిస్తున్నాడు.

మోనా జౌహరీ ఉంపుడు కత్తె. ఈ విషయాన్ని జౌహరీ అతి రహస్యంగా దాచి వుంచాడు. ఇద్దరు ముగ్గురు సన్నిహిత మిత్రులకు తప్ప ఎవరికీ తెలియదు. ఆ వ్యక్తులు భగీరథ్ ఈడువాళ్ళు కాదు. తనలాగే నడివయసు వాళ్ళు. మరీ విషయం భగీరథ్ వరకు ఎలా వచ్చింది? రెండు మూడు నిమిషాలు తేరుకోలేక పోయాడు జౌహరి. తనలో చెలరేగిన కలవర పాటును ఏమాత్రం బయటకు కనిపించనీయకుండా—




"అ...అ...బా గా నే వుంది...కాక పోతే అప్పుడప్పుడు ఇబ్బంది పెడుతుం టుంది" అన్నాడు అతి సాదాతనాన్ని నటిస్తూ.

'ఎలాంటి ఇబ్బంది కలుగజేస్తుంది?' అని అడుగుదామనుకున్నాడు భగీరథ్ వెంటనే. కానీ వ్యాపార శైలి నిండిన అతడి బుర్ర ఆ ఆలోచనను అంతకు మించి పెంచటం మంచిదికాదనిపించింది. అప్పటికే దెబ్బ తిన్నాడు ముసలి పక్షి. మళ్ళీ వెంటనే మరో దెబ్బపడితే వ్యవహారం బెడిసికొడుతుందనిపించింది. ఈ ముసలివాడికిఆపాటి దెబ్బ చాలనిపిం చింది. అయినా తనకో ప్రేయసి వుందని ఒప్పుకున్నట్టే కదా? తన రహస్యం బయటపడినట్టూ తెలిసింది. లేకుంటే ఖుర్సియా, అయిరీలను అడ్డం పెట్టి త న మీ ద అయుధంలా ప్రయోగిం చాలని చూశాడు. తను తక్కువ తిన్నా దేమిటి? అంతకు మించిన దెబ్బ వెంటనే కొట్టాడు. చాలు కాస్త అదుపులో వుంటాడు ముసలాడు.

ఇలా ఆలోచించి ఆనందపడిపోయాడు భగీరథ్. జౌహరి మరేం మాట్లాడలేదు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

కానీ ముసలి జౌహరి గుండె ఇంకా భయంతో నిరాశతో కొట్టుకుంటూనే వుంది. భగీరథ్‌కు మోనా గురించి ఎలా తెలిసింది ?

జౌహరి మొదటి భార్య మరణించగానే రెండో పెళ్ళి చేసుకుందామనుకున్నాడు. కానీ అందంగా కుందనపు బొమ్మలా వున్న రంభను చూస్తుంటే అతడి మనస్సు ఒప్పుకోలేదు. ఈ బంగారు బొమ్మకు సవతితల్లి పోరు మంచిది కాదనిపించింది. ఆ ఆలోచనను మానుకున్నాడు. తనే తల్లి తండ్రి అయి రంభను అతిగారాబంగా పెంచాడు. రంభకు పదహారుసంవత్సరాలు నిండాయి. అప్పుడే యవ్వన ప్రాంగణం లోనికి అడుగు పెట్టిన రంభ అద్వితీయ సౌందర్యంతో వెలిగిపోతోంది. కానీ అప్పటి వరకు తండ్రి ఒడిలో ఆడుకున్న రంభ, తండ్రిని విడిచి ఒక్క నిమిషమైన ఉండ జాలని రంభ నెమ్మదిగా తండ్రికి దూరం కాసాగింది. తండ్రి సాంగత్యాన్ని వదిలి స్నేహితులను వెతుక్కోసాగింది.

అప్పటివరకు జౌహరి రంభలోనే తన భార్యను చూసుకుని పదహారేళ్ళు గడిపే శాడు. భార్య మరణించిన దుఃఖాన్ని మరచిపోయాడు. కానీ కూతురు రోజు రోజుకూ దూరమై పోసాగగానే అంత వరకు అణిగిమణిగి పడివున్న ఒంటరి తనం హఠాత్తుగా విజృంభించింది. ఒక వైపు భార్యలేని దుఃఖం, మరోవైపు కూతురు దూరమైందన్న చింత జౌహరీని కాల్చివేయ సాగాయి.

అలాంటి సంఘర్షణా సమయంలో మోనా జౌహరి జీవితంలోకి ప్రవేశించింది. మోనా తల్లి వేశ్య కాదు. కానీ అంతకు మించిన గుణాలున్న మనిషి. సమయానుకూలంగా మోనాను జౌహరీ మీదకు ప్రయోగిస్తూ వచ్చింది. మోనాకు రంభ వయసు వుంటుంది. చాలా అందంగా వుంటుంది. కూతురు దూరమైందన్న చింతనలో కూతురు వయసున్న మోనాతో ప్రణయ సంబంధాలు పెంపొందించుకున్నాడు జౌహరి. కాని అతడికి మోనా దగ్గర పోయిన భార్య కాని, దూరమైన కూతురు కాని లభించలేదు. అదొక నిషామయమైన ప్రపంచం. అబద్ధపు లోకం. కానీ బావుంది. జౌహరి ఆ వలయంలో చిక్కుకు పోయాడు. మోనా కోరినంత ధనం వెద

 చతుర ... లేలే



జల్లాడు. వేలకు వేలు ఖర్చు అయి పోయాయి. వ్యాపారం పడిపోయింది. చివరికి అప్పులు కూడా చేస్తున్నాడు.

ముసలి జౌహరి గుండె ఇంకా భయంతో కంపిస్తూనే వుంది. భగీరధ్‌కు మోనా గురించి తెలిసిందంటే తన పతనాన్ని గురించి కూడా తెలిసే వుంటుంది. అదీకాక భగీరధ్ దగ్గర కూడా మూడు లక్షలుఅప్పు చేశాడు తను. అయితే ఇలా ఎప్పటి వరకు ?

* * *

లిద్దర్ నదీ తీరాన నిలబడి వున్నాడు మదన్. ఇంతలో రంభ, కేశవ్ గుఱ్ఱమ్మీద కూర్చుని అటుగా వస్తూ కనిపించారు. కానీ అతడి మనసులో ఒక్క క్షణం కూడా ఈర్ష్యాద్వేషాలు తొంగి చూడలేదు. కేశవ్ జోధ్‌పూర్ తయారీ బంగారు రంగు లాల్చీ వేసుకుని వున్నాడు. గుఱ్ఱమ్మీద ఠీవిగా కూర్చుని వున్న అతణ్ని చూడగానే

అభిమానధనుడు అనిపిస్తున్నాడు. వాళ్ళిద్దరూ మదన్‌ను దాటిపోతూ "హలో" అని విష్‌చేసి వెళ్ళారు. అయినా మదన్ హృదయంలో కేశవ్ పట్ల ఎటువంటి

ఈర్ష్యా, పగ ఏర్పడలేదు. నాలుగు సంవత్సరాల నుంచి మదన్ రంభను ప్రేమిస్తున్నాడు. ఆ విషయం రంభకు కూడా తెలుసు. కానీ వాళ్ళిద్దరి మధ్యా చర్చల్లో ఆ ప్రస్తావన ఏనాడూ రాలేదు. అలా వుండిపోవటమే మంచిదనిపించింది. సముద్రం తన బడబాగ్నిని అతి నిగూఢంగా దాచుకున్నట్టు మదన్ తన ప్రేమను తనలోనే దాచుకున్నాడు. ఎప్పుడైనా సందర్భవశాత్తూ ఆ ప్రస్తావన వచ్చినా దాన్ని తేలికగా తీసివేస్తూ నవ్వేసేవాడు. లేదా చరిత్ర, వేదాంత చర్చల్లోకి దృష్టిని మరల్చి విషయాన్ని మరో వైపుకు తిప్పేవాడు.

చరిత్రను, ఫిలాసఫీని ఎంతటి ఏకాగ్రతతో అధ్యయనం చేశాడో అంతకు మించిన దీక్షతో రంభ మస్తిష్కపు లోతుల్ని అధ్యయనం చేశాడు మదన్. రంభ పట్ల అతడి అవగాహన నిజమైనా, అబద్ధమైనా అది అతడికి శాంతినే ఇచ్చింది రంభ చర్యల వల్ల, ఆలోచనా విధానం వల్ల, చెడు పరిణామాలు కలిగినా సరే మదన్ రంభను ప్రేమించటానికి సిద్ధంగా వున్నాడు.

మదన్ హృదయంలో రంభకు సౌందర్యాధి దేవతకున్న గొప్ప స్థానం వుంది. ఒకవైపు సాగర మధనంలోంచి పుట్టుకొచ్చిన హాలాహలభాండంలా విషగ్రస్తంగా చంచలంగా కనిపిస్తూనే, మరోవైపు స్వచ్ఛంగా, స్వతస్సిద్ధంగా పుట్టుకొచ్చిన సీతాసాధ్విలా కనిపించేది రంభ. ఈ వైరుధ్యం ఆమెలో నిండివున్నా, ఏ నాడూ తన పవిత్రతను కోల్పోలేదు రంభ. ఒకసారి సముద్రంలా అల్లకల్లోలంగా, మరోసారి భూమిలా స్థిరంగా ఉండే రంభను చూడటంలో కూడా ఏదో ఆనందం లభించేది. ఇవన్నీ పరిశీలిస్తూ తను రంభకు చాలా సమీపంలో వున్నట్టు భావించేవాడు మదన్. తనకూ, రంభకూ మధ్య మరే ఇద్దరిలోనూ ఉండజాలనంతటి ప్రగాఢమైన పరిచయం వున్నట్టు అనిపించేది. పువ్వులో పరిమళం దాగివున్నట్లు మదన్ హృదయంలో స్వాభావికమైన ప్రేమ పొంగి పొర్లుతుండేది.

అందుచేతనే రంభ కేశవ్ తన ఎదురుగానే గుర్రమ్మీద స్వారీచేస్తున్నా అతడిలో ఏ సంచలనమూ కలగలేదు. భయకంపితుడు కాలేదు. పైగా తనను విష్‌చేసి వెళ్తున్న వారిద్దరినీ మరింత బిగ్గరగా చేతులు ఊపుతూ ప్రతిగా విష్ చేశాడు.

సౌందర్యం కనిపించగానే రంభ ఒక్కోసారి అదుపుతప్పి తీవ్రమైన భావుకతతో బలహీన పడిపోతుందని మదన్ విశ్వాసం. ఆ ప్రకారం చూస్తే కేశవ్ దేవతలను తలదన్నే అందగాడు. ఒక్క పహల్‌గావ్‌లోనేగాదు. ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో వున్న అందమైన వాళ్ళందరికన్నా అందమైనవాడు. ఠీవి, దర్పం ఉన్నవాడు. కాబట్టి కేశవ్ మీది మోజు రంభ ఒంటికి జ్వరంలా పట్టిసుంది. కేశవ్ అందానికి అంతటి సమ్మోహన శక్తి వున్న మాట నిజం.

అయితే మదన్‌కు మరో విషయం కూడా తెలుసు. రంభ ఒక జౌహరి కూతురు. మెడలో ముత్యాలహారం ధరించి వుంది. ఈ రోజు కేశవ్ ఒంటి మీదున్న ఖరీదైన దుస్తులు రంభ కొన్నవే. అలాంటి స్థితిలో వున్న మనిషి వల్ల పెద్ద ప్రమాదమేమీ జరుగదు. కొద్ది రోజుల్లోనే రంభను ఆవహించిన కేశవ్ మోహ జ్వరం కాస్తా

దిగిపోతుంది. ఇంతకు మించిన మహమ్మారి లాంటి జ్వరాలను ఎన్నింటినో చూచి వున్నాడు మదన్. అవి తుఫానుల్లా వచ్చి పిల్ల వాయువుల్లా మారి అదృశ్యమై పోతాయి.

మదన్ ఆలోచించుకుంటూ లిడ్డర్ నదీ తీరానికి పిక్నిక్ కోసం వచ్చిన భగీరథ్, ఖుద్సియా, అయిరీనిలను వెదుక్కుంటూ బయలుదేరాడు. కేశవ్, రంభ తనను ఒక్కడ్నే విడిచిపెట్టి వెళ్ళి పోయారు. తను ఒక్కడే వెళ్తే పిక్నిక్‌లో ఆట పట్టిస్తారని తెలుసు. అయినా వాళ్ళ మాటలను ఎదుర్కోవటం పెద్ద లెక్కలో పనికాదు మదన్‌కు.

రోడ్డు మీద నుంచి దిగి తమ వైపుకు వస్తున్న మదన్‌ను చూడగానే ఖుద్సియా, అయిరీని, భగీరథ్ ముగ్గురూ ఏక కంఠంతో అరిచారు.

"నిన్ను వెంట తీసుకెళ్ళలేదా వాళ్ళు? నిన్ను వదిలేసి రంభ, కేశవ్ వెళ్ళి పోయారా ?"

"పాపం డీనుడు మదన్" అయిరీని అంది. "ఇలా వచ్చి నా పక్కన కూర్చొ నీ కన్నీళ్ళు తుడుస్తాను."

"ఇదిగో ఈ గులాబ్‌జాం తిను. నోటి చేదు విరిగిపోతుంది" అంది ఖుద్సియా.

"పార్టనర్ మళ్ళీ మోసం చేసి వెళ్ళి పోయింది కదా?" భగీరథ్ అన్నాడు.

"నన్నా-నిన్నా?" మదన్ అడిగాడు.

"నాకెందుకాచింత? వేలికొకరు, కాలి కొకరు నా కోసం సిద్ధంగా వుంటేనూ?" అని భగీరథ్ ఖుద్సియా,అయిరీనిల వైపు చూచి పెద్ద నవ్వొకటి నవ్వాడు. యువతు లిద్దరూ ఓ క్షణం అసహ్యం నిండిన చూపులతో భగీరథ్ వైపు చూచారు.

మళ్ళీ అంతలోనే వాళ్ళూ నవ్వేశారు.

ప్రతి ఒక్కరూ భగీరథ్‌ను ఎందుకు ఇష్టపడతారంటే అతడు పచ్చనోట్లను చిత్తు కాగితాల్లా విరజిమ్ముతాడు. అంతటి శ్రీమంతుడు ఏ మాటన్నా సమాజంలో ఇట్టే చెల్లుబడి అయిపోతుంది. అతడు ఎన్ని తప్పులు చేసినా అందరూ ఊరికే క్షమించేస్తారు. పైగా భగీరథ్ అవివా హితుడు. యువకుడు. ఏ నిమిషంలో ఎవర్ని పెళ్ళి చేసుకుంటానని ముందుకు వస్తాడో తెలియదు. అందుకే ఆడపిల్ల లందరూ అవయవాలన్నీ రిక్కించి భగీరథ్ లాంటి వాళ్ళను ఆకట్టుకోవాలని చూస్తారు.

ప్రస్తుతం ఆ సొసైటీకి భగీరథ్‌లాంటి వాళ్ళ అవసరం చాలా వుంది. వాళ్ళు ప్రతి నిమిషం డబ్బుతో కొనుక్కున్న కృత్రిమ ఆనందంలో ఓలలాడుతుంటారు. ఆ ఆనందం లేకుండా వాళ్ళు బతకలేరు. అలాంటి ఆనందం భగీరథ్ ఎంతైనా కొని అందరి ముందు గుట్టలు గుట్టలుగా పడవేయగలడు. విచిత్రమేమిటంటే భగీరథ్‌కూ, భగీరథ్ లాంటి వాళ్ళకూ తాము ఎందుకు ఉపయోగించుకో బడు తున్నారో, తమకంతటి గౌరవం ఎలా లభిస్తోందో తెలుసు. అదొక ఆట. ఆధు నిక సమాజపు సర్కస్.

కానీ మదన్‌కు ఇవేమీ నచ్చవు. అలా అని ఎవరినీ ఏ విధంగానూ విమ ర్శించడు. తన మానాన తను చూస్తుండి పోతాడు. మదన్‌కున్న ఈ అలవాటు కూడా వాళ్ళకు చాలా నచ్చేది. అయితే ఒక్కోసారి మదన్‌లో వున్న ఈ నిజాయి తీని చూచి వాళ్ళలో ఈర్ష్య జనించేది. తాము కృత్రిమ విలువలను గౌరవిస్తున్నా మన్న భావన వాళ్ళను పరివర్తన వైపుకు కాక, అహంకారం వైపుకు నడిపేది. దాంతో వాళ్ళు మదన్‌ను ఒక విదూష





కుడిగా జమకట్టి తమ మానసిక బలహీనతను కప్పిపుచ్చుకునేవాళ్లు. వాళ్ళ నిషాలు తెలిసినవాడు కాబట్టి మదన్ నవ్వి ఊరుకునేవాడు. మదన్‌లోని నిజాయితీ విమూషకత్వంలా కనిపిస్తే దానికి అతడేం చేయగలడు.

"అసలీ కేశవ్ ఎవడు?"

గులాబ్‌జాం తింటున్న పింగాణీ ప్లేటును బండమీదకు విసిరికొడుతూ హటాత్తుగా అడిగాడు భగీరథ్.




"అసలు నువ్వెవరివి?"

వాళ్ళకు కొన్ని మైళ్ళ అవతల అదే లిద్దర్‌నదీ తీరాన కేశవ్‌ని అడిగింది రంభ. వాళ్ళిద్దరూ గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టేసి నీలం రంగు గులక రాళ్ళతో నిండివున్న నేలమీద ఒకరి పక్కన ఒకరు అతి దగ్గరగా కూర్చుని వున్నారు.

"నీ ప్రేమికుడ్ని - నిన్ను కోరుకుంటున్నవాడ్ని" కేశవ్ అన్నాడు.

* * *

"రంభ ప్రేమికుడు - రంభను కోరుకుంటున్నవాడు" ఖుద్సియా భగీరథ్‌ను ఏడిపించటానికి అంది "పింగాణీ ప్లేటులా అందమైన వాడు. కానీ పింగాణీ ప్లేటులా బలహీనమైనవాడు కాదు. నువ్వు బండకేసి కొట్టగానే ముక్కలైపోడు. ఏదో గంధర్వలోకం నుంచి వచ్చిన గంధర్వుల నాయకుడిలా వున్నాడు"

* * *

"గంధర్వుడివా?" అతి నెమ్మదిగా అడిగి అశాంతి నిండిన కళ్ళతో కేశవ్ అందాన్ని చూస్తోంది రంభ. సిల్కు లాల్చీ కాలరు చివర్లు రెండూ గాలికి నెమ్మదిగా ఎగురుతున్నాయి. కాలర్ లోపలనుంచి పరిపూర్ణ పురుషత్వంతో పృథంగా కనిపిస్తున్న కేశవ్ మెడ, పైన అతి సుందరమైన ముఖం, గులాబీ రంగు చెక్కిళ్ళు, చెక్కిళ్ళకు పైన పెద్ద పెద్ద నీలి కళ్ళు, నుదటి మీదకు జారివున్న పంకిల జుత్తు, ఎర్రటి పల్చటి పెదాలు, పెదాలకు అవతల తెల్లగా మెరుస్తున్న పలువరుస.

కేశవ్ హటాత్తుగా రంభవైపు చూచి నవ్వాడు. వాతావరణంలోకి ముత్యాలు గుమ్మరిస్తున్నట్టుందా నవ్వు. కేశవ్ ఛాతీలోంచి వస్తున్న ఒక విచిత్రమైన సుగంధం రంభను మైకంలా కమ్మేయసాగింది. రంభ మత్తులో మునిగిపోతోంది. గాలి విసురుకు రంభ కేశాలు ఎగిరి కేశవ్ చెంపలకు తాకుతున్నాయి. నెమ్మదిగా వాటిని తొలగించబోయాడు. అనుకోకుండా రంభ ముఖం కేశవ్ చేతుల్లో ఇమిడిపోయింది. ఒకరి చెంపలు మరొకరి చెంపలకు తాకాయి. ఒకరి పెదవులు మరొకరి పెదవుల కోసం వెదికాయి.ఇద్దరూ ఒక గాఢ చుంబనంలో, పరిష్వంగంలో చిక్కుకుపోయారు.

కొద్ది నిమిషాలు గడిచాయి.హటాత్తుగా రంభకు తన శరీరంలో ఏదో ఒక మంచు

మెరుపు రక్తనాళాల్లోంచి ప్రవహించినట్టని పించింది. రంభ కంగారుపడుతూ తనను తాను అదుపులో పెట్టుకునే ప్రయత్నంలో కేశవ్‌నుంచి దూరంగా జరిగింది. కేశవ్ ప్రశ్నార్థకంగా రంభనే చూస్తుండి పోయాడు. రంభ శరీరం విచిత్రంగా కంపించసాగింది. స్వరం మెల్లగా ఒణుకు తోంది.

"నువ్వెవరివి?" అడిగింది రంభ మళ్ళీ.

"ఏం? ఏం జరిగింది ?" కేశవ్ ఆశ్చ ర్యంగా అడిగాడు.

"నీ శరీరం నుంచి ఏదో రాతిగంధం వాసన వస్తోంది" అదే కంపనలోంచి పలి కింది రంభ.

* * *

"ఈ రాళ్ళలోంచి రాతిగంధం వాసన వస్తోంది" చేతిలోవున్న ఆకు పచ్చటి గులకరాళ్ళను వాసనచూచి అవతలికు పారేస్తూ అన్నాడు మదన్.

"రాతిలోంచి రాతివాసన కాక పూల వాసన ఎలా వస్తుంది?" ఖుద్సియా అడి గింది.

"కాదు. కొన్ని పూలకు రాతి హృదయం వుంటుంది. అలాంటి పూలనుంచి రాతిగంధం వాసనే వస్తుంది" మదన్ జవాబిచ్చాడు.

మదన్ జవాబు వెనుక వున్న రహస్యం అందరికీ అర్థమైపోయింది వెంటనే. ఖుద్సియా అత్త కొడుకు ఒకతను ఖుద్సి యాను ప్రాణప్రదంగా ప్రేమించాడు. అతడంటే ఖుద్సియాకు కూడా ఇష్టమే. కానీ ఇద్దరికీ పెళ్ళిమాత్రం జరగలేదు. ఎందుకంటే అతడు కటిక పేదవాడు. ఖుద్సియా ధనవంతుల బిడ్డ. అతడు పెళ్ళి మాట ఎత్తేసరికి- ఖుద్సియా, ఖుద్సియా తండ్రి ఇద్దరూ నిరాకరించారు. అతడు భగ్నమనస్కుడై ఆత్మహత్య చేసుకున్నాడు. ఖుద్సియాతో పరిచయం వున్న వారందరికీ ఈ కథ తెలుసు.

* * *

"మళ్ళీ ఒక్కసారి నన్ను ముద్దు పెట్టుకో" రంభ అడిగింది.

కేశవ్ అలాగే చేశాడు.

ముద్దు ముగిసాక రంభ నాలుకతో పెదవులమీద రాసుకుంటూ "అప్పుడు ఇప్పటికీ అదే ఆస్వాదన. చాలా పాత రాతి గంధం వాసన వస్తోంది. అది నన్ను ఎక్కడికో తీసుకెళ్ళి ఏవో జ్ఞాపకాలను గుర్తుచేస్తోంది. ఎప్పుడో ఎక్కడో నీతో గొప్ప పరిచయం వున్నట్టు అన్పిస్తోంది"

కేశవ్ అన్నాడు "అనుమతి ప్రసా దిస్తే మరో ముద్దు పెట్టుకుంటాను. బహుశా ఈసారి మా నాన్న పేరు కూడా నీకు గుర్తుకు వస్తుందేమో చూద్దాం!"

రంభ విరగబడి నవ్వసాగింది.

* * *

ఆయిరీని పడి పడి నవ్వసాగింది. "మదన్ గుర్తుపెట్టుకుని మరీ నీమీద పెద్ద ఆయుధాన్ని ప్రయోగించాడు. గాయ మేమైనా అయిందా ఖుద్సియా ? ఏది చూడనీ" అంది.

"కానీ మిస్టర్ మదన్! మీరు మరో విషయాన్ని కూడా గుర్తుపెట్టుకోండి. స్త్రీలు ఎన్ని చేసినా చివరికి ప్రపంచం మగవాళ్ళదే! అది గమనించకుండా ఆదిలో ఆడది మట్టిపెడ్డలు విసురుదామని ప్రయ త్నిస్తే అంతంలో రాళ్లు మెక్కవలసిన గతి పడుతుంది... మొదటినుంచీ చివరి




వరకు ఈ ప్రపంచం మగవాళ్ళదే అవుతోంది"

* * *

"నీ గురించిన వివరాలన్నీ నాకు చెప్పవా?" రంభ కేశవ్‌ను మళ్ళీ అడిగింది.

"నేను ఎక్కడనుంచి అయితేవచ్చానో అక్కడ అబద్ధం చెప్పటం మహాపాపం. కాబట్టి అబద్ధం చెప్పటం అనేది నా వల్ల అయ్యే పనికాదు. అలా అని కొన్ని విషయాల వెనుక వున్న పూర్తి నిజాలను చెప్పటం కూడా మంచిదికాదని తెలుసుకున్నాను. అలాంటి విషయాలపట్ల మాత్రం మౌనం వహిస్తాను" అన్నాడు కేశవ్.

అంతవరకు చెప్పి కేశవ్ ఒక్కక్షణం రంభవైపు చూచాడు. రంభ ఏకాగ్రతతో కేశవ్‌నే చూస్తోంది.

"నేను ఎక్కడనుంచి అయితేవచ్చానో అక్కడ నేను అతి సామాన్యమైన జీవితాన్ని గడిపాను. నా చుట్టూ వుండే మనుషులందరూ నాలాగే సామాన్యులు. సాదా సీదాగా బ్రతుకుతున్నవాళ్లు. మాకు బస్సులు లేవు. కుర్చీలు, సోఫాలు లేవు. రైళ్ళు, విమానాలు లేవు. సబ్బులూ, కత్తులూ, ముళ్ళూ లేవు. ఒక చిన్న కుటీరం, కొన్ని పూలతీగలు, ఒక వీణ... నేను, నా వీణ కలసి పదిహేను సంవత్సరాలు మా గురువు పాదాలదగ్గర కూర్చుని సంగీత సాధన చేశాం!''

"మరే పనీ చేయలేదా?"

"లేదు. అక్కడ ఒక్కొక్కరూ ఒక్క పని మాత్రమే చేస్తారు. నిండు ఏకాగ్రతతో చేస్తారు. పొలం దున్నేవాడు పొలం దున్నుతాడు. వీణ వాయించేవాడు వీణ వాయిస్తాడు...ఏదైనా చిత్తశుద్ధితో చేస్తారు"

"మరి పెళ్లి"

"అపును పెళ్ళి జరిగింది" కేశవ్ ఎక్కడో దూరంగా చూస్తూ అన్నాడు.

రంభ తృళ్ళి పడింది.

* * *

"అసలీ రంభ పెళ్ళి మాటే ఎత్తదు ఎందుకని ?" ఖుద్సియా తన ప్రశ్నను అందరిముందుంచింది, "ప్రతి నిమిషం డజన్ల కొద్దీ మగవాళ్ళను తన చుట్టూ తిగించుకుని వుంచుతుంది. రంభ కున్న ఈ చెడు లక్షణాన్ని చూస్తే అప్పుడప్పుడూ అసహ్యం కలుగుతుంటుంది. ఆహ్వానించింది అల్పాహార విందు కోసం కాదు. అవయవాల సొంపును అందరి ముందు ప్రదర్శించుకోవటానికే అనిపిస్తుంది"

"రంభ పెళ్ళి చేసుకుంటే మిగతా ప్రియులు-అంటే ఒక్కడు తప్ప మిగతా శేష డజన్ల మగవాళ్ళు ఇతర స్త్రీల వైపు తమ ధ్యానాన్ని మరల్చుకోగలుగుతారు అనే కదా నీ ఉద్దేశం" అయిరీని ఖుద్సియాను ఉడికిస్తూ అంది.

"ఒక్కసారిగా ఒక స్పష్టమైన నిర్ణయాన్ని తీసుకోవటం ఆడదాని వల్ల అయ్యే పనికాదు. రంభ లాంటి చంచల స్వభావానికి అది అసలే సాధ్యపడదు" భగీరథ్ తన ఆలోచనల్లోంచి పదునుగా అన్నాడు-

"ఎందుకంటే ఆ నిర్ణయం జీవితాన్ని శాసించగల ఏకైక నిర్ణయం అవుతుంది. పెళ్ళి అనేది చిన్నపిల్లలాడుకునే బొమ్మలాట కాదు. ఒక్కసారే జరుగుతుంది. అదే శాశ్వతమై నిలుస్తుంది.



కాబట్టి స్త్రీ పెళ్ళి విషయంలో ఒక నిర్ణయానికి రావటానికి ఎక్కువ కాలాన్ని తీసుకుంటుంది"

"నీ అభిప్రాయం ఏమిటి మదన్?" అయిరీని మదన్‌ను ప్రశ్నిస్తూ అంది "ఆ పాత రోజులే చాలా మంచివనిపిస్తున్నాయి. తల్లిదండ్రులు చక్కటి వరుణ్ణి వెదికి పెళ్ళి జరిపించేవారు. ఇప్పుడో-నాలుగు సంవత్సరాల నుంచి నేనో మొగుడి కోసం వెదుకుతున్నాను. కానీ ఒక్కడూ సరైనవాడు దొరకలేదు.. కనిపించలేదు"

"సరైన వాడికి మీ నిర్వచనం ఏమిటి మిస్?" భగీరథ్ వ్యంగ్యంగా అడిగాడు.

"అతడు భగీరథ్ లా శ్రీమంతుడై వుండాలి. కానీ హిందువై వుండకూడదు" అయిర్గిని వరుడి లక్షణ సారాన్ని గుణించ సాగింది.

"నువ్వు పోయావు మిస్టర్ భగీరథ్" మదన్ నవ్వాడు.

అయిర్గిని మళ్ళీ చెప్పసాగింది "అతగాడు మదన్‌లా నిజాయితీపరుడూ, సద్గుణ సంపన్నుడూ అయివుండాలి. కానీ మదన్‌లా ప్రొఫెసర్ మాత్రం అయివుండకూడదు"

"ఏం ప్రొఫెసర్‌లో చెడేముంది?" మదన్ అడిగాడు.

"వాళ్ళతో ఒకటో నెంబరు దరిద్రంలో జీవితాన్ని వెళ్ళమార్చవలసి వుంటుంది" అంది అయిరీని.

"నువ్వూ కొట్టుకుపోయావు వెల్లువలో పూచికపుల్లలా" భగీరథ్ బిగ్గరగా నవ్వాడు.

"నేను కాథలిక్‌ను కాబట్టి నా భర్త కూడా కాథలిక్కే అయివుండాలి" అయిరీని పచార్లు చేస్తూ చెబుతోంది "నాకు ఇంటి వంట అంటే చాలా ఇష్టం. కాబట్టి నా భర్తకో అందమైన పెద్ద బంగళా వుండాలి... ఒక చిన్న కారుండాలి-కారు పెద్దదయినా పర్వాలేదు సర్దుకుంటాను. నాకు పిల్లలు కనటమన్నా, పెంచటమన్నా మహా చిరాకు. అసలు పిల్లలంటేనే పడదు. ఏదో పేరు కోసం ఒకడుంటే చాలు. నా భర్త ఎవరిదగ్గరా ఉద్యోగి అయి వుండకూడదు. ఆయనకు స్వంత వ్యాపారం వుండాలి''

"అయితే నువ్వు కోరుకుంటున్నది మొగుణ్ణి కాదు. నీకు మొగుడి అవసరమూ లేదు. నీకు శాశ్వత జీవిత భీమా వుంటే చాలు'' మదన్ వెంటనే అన్నాడు.

"ప్రతీ స్త్రీ అదే కోరుకుంటుంది!'' ఖుర్షియా ఒక్క నిట్టూర్పు విడుస్తూ అంది. "మధ్యలో అందరూ పాపం పవిత్రమైన ప్రేమను భ్రష్టు పట్టించేస్తున్నారు. నిజానికి ప్రేమ అవసరం ఎవరికీ లేదు. మగవాడు ప్రేమ పేరుతో దుస్తుల వెనుక దాగివుండే స్త్రీ అవయవాలను వెదుకుతాడు. స్త్రీ ప్రేమ పేరుతో మగవాడి నుంచి గ్యారంటీగా వుండే శాశ్వత జీవిత భీమా కోసం చూస్తుంది. ఈ మోడ్రన్ సమాజంలో ప్రేమ అంటే నోట్ల దాగుడు మూతలాట!''

భగీరథ్ అన్నాడు "నేను మరో విషయాన్ని ప్రస్తావించబోతున్నాను. ఆ రోజుల్లో రాజులకు ఎందరో స్త్రీలను ఉంపుడు గత్తెలుగా వుంచుకునే అనుమతి వుండేది. అలాగే ఈ రోజుల్లో కూడా పెద్ద పెద్ద వ్యాపారస్తులకు, సేట్లకు కోరినంత మందిని స్త్రీలను వుంచుకునే అనుమతి వుండాలి. ఎందుకంటే దాంతో నేటి




మోడ్రన్ యువతీమణుల వివాహ సమస్య తీరిపోతుంది. మోజులూ, వ్యామోహాలు కూడా తీరిపోతాయి. అంతేనా ?" భగీరథ్ ఆయిరీని, ఖుద్సియా లిద్దరికీ కన్ను గీటుతూ అన్నాడు.

* * *

"కానీ నా పెళ్ళి నా వీణతో జరిగింది" కేశవ్ వివరిస్తున్నట్టు రంభతో అన్నాడు '''నీకు సంగీత సిద్ధి కావాలనుకుంటే మిగతా బాహ్య ప్రపంచ విషయాలను త్యాగం చేయవలసి వుంటుంది. డబ్బు, దర్జా, హోదా, స్త్రీ, ప్రపంచపు ప్రతి అందమైన వ్యామోహాల నుంచి నీ దృష్టిని మరల్చుకోవలసి వుంటుంది. నీ వీణలో నీ హృదయాన్ని ప్రతిష్టించ వలసి వుంటుంది' అని మొదటిరోజే మా గురువు ఉపదేశించాడు. నేను ఆచరించాను. ఆ కారణంగా నాకు పాతికేళ్ళు నిండేసరికి మా గురువు నియమానుసారంగా నా పెళ్ళి నా వీ ణ తో జరిపించేశాడు. పెళ్ళి శాస్త్రోక్తంగా, చాలా ఘనంగా అగ్ని సాక్షిగా జరిగింది. అప్పటినుంచీ వీణ నా ధర్మపత్ని అయింది. రాత్రి పడుకునేటప్పుడు కూడా నాచెయ్యి ఒకటి వీణ మీదే వుండేది. నేను చెబుతున్నది నీకు అర్థమవుతోందా ?" మాటలు మధ్యలో ఆపి అడిగాడు కేశవ్.

"అవునుఅర్థమవుతూనేవుంది. ఆశయ ప్రాప్తికోసం అలాగే చేయవలసి వుంటుందేమో ?... అయితే నీ కళ నీకు పూర్తి సంతృప్తినిచ్చిందా ?" రంభ అడిగింది.

"నిజం చెప్పాలంటే నాకు తృప్తి లభించలేదు. పరిశ్రమ, సాధన చేస్తూ వచ్చాను. రోజల్లా వీణా ధ్యానంలోనే మునిగి వుండేవాడిని. కానీ నా కళలో ఒక వస్తువు లోపించిందనే విషయాన్ని నేనప్పుడు గమనించలేదు. ప్రజలు నా సంగీతాన్ని వింటూ ఊగిపోయేవారు. రాజులు ముత్యాల, రత్నాల హారాలతో నన్ను సత్కరించేవారు. కానీ అంతరాంతరాల్లో ఏదో వెలితి. - ఆ సప్తస్వరాల నిశ్వాసంలోంచి ఒక విషయం పాము పడగలా పైకి లేచి బుసలు కొట్టేది. ఇది కళ కాదు. ఇది వాస్తవమైన పూర్తి కళ కాదు అనిపించేది. తరువాత ఒకరోజు నేను నిన్ను చూచాను" బరువుగా నిట్టూర్చాడు కేశవ్.

"ఎక్కడ చూచావు" రంభ ఆత్రుతగా అడిగింది.

"అది మాత్రం చెప్పలేను. నన్ను అడగవద్దు" అని కేశవ్ నిర్దిష్టంగా అనటంతో రంభ మరి మాట్లాడలేదు.

"కానీ ఆ నాడు నిన్ను చూచినప్పుడు తెలిసింది. నా కళలో ఏ వస్తువు లోపించిందో అర్థమైంది."

"ఆ వస్తువు ఒక స్త్రీయే కదూ ?" రంభ వ్యంగ్యంగా అడిగింది.

"కాదు అది ఒక బాధ... అంతరాంతరాల్లోకి సూటిగా దూసుకెళ్ళి ఆత్మ తంత్రులను మీటగల, స్వయంగా తనలోంచి తానుగా ఉద్భవించి ఎదుటి వారికి అర్పితం కాగల ఒక బాధ. అప్పటి వరకు సంగీతానికి ఏడు స్వరాలు మాత్రమే వుంటాయనుకునేవాణ్ణి. కానీ నిన్ను చూడగానే ప్రతి సంగీతానికీ ఏడు స్వరాలతో పాటు ఒక ఎనిమిదో స్వరం అవసరం అవుతుంది. ఆ అష్టమ స్వరమే లేకుంటే అది ఎన్నటికీ సంపూర్తి కాదు అని నిశ్చయంగా తెలిసింది..." అన్నాడు కేశవ్.

"అరెరె చాలా టైం గడిచిపోయింది.



గమనించావా ?" రంభ వాచీవైపు చూసు కుంటూ అంది.

కేశవ్ అన్నాడు "నేను ఎక్కడ్నించి అయితే వచ్చానో అక్కడ ఎవరూ గడియారాలు పెట్టుకోరు. కాలం దానంతట అదే గంగా ప్రవాహంలా నడిచిపోతుంది. మేము కాలాన్ని సూది మొనంతటి భాగాలు, ఖండఖండాలుగా విభజించి నిమిషాల్లో, గంటల్లో ఖైదు చేయం"

"నువ్వు ఎలాంటి దిక్కుమాలిన ప్రాంతంనుంచి వచ్చావో మరి ఆ భగవంతుడికే తెలియాలి" రంభ లేచి చీర సర్దుకుంటూ అంది.

"అయితే నాకెలాంటి ఆశ్చర్యమూ కలగటం లేదు. ఎందుకంటే ఇరవయ్యో శతాబ్దంలో మనం వుంటున్న ఈ భారత దేశంలో ఇరవయ్యో శతాబ్దపు భారత దేశమూ వుంది. రెండు వేల ఏళ్ళ నాటి భారత దేశమూ వుంది. ఐదు వేల ఏళ్ళ నాటి భారతదేశమూ వుంది. ఏడు వేల ఏళ్ళనాటి భారతదేశమూ వుంది. ఇక్కడ కాడిలాక్‌లో ప్రయాణించే మనిషి ఓ వైపునుంటే మరో వైపున కనీసం రైలు ముఖమైన చూచి ఎరుగని మనిషివున్నాడు. విల్లు నంబులతో తప్ప మరే ఆధునిక ఆయుధంతోనూ వేటాడి ఎరుగని మనుషులు, చెట్ల బెరళ్ళు తప్ప మంచి దుస్తులు ధరించి ఎరుగని మనుషులు, ఆకుల్లో తప్ప ప్లేట్లల్లో భోంచేసి ఎరుగని మనుషులు, మట్టితో



చేతులు కడుక్కునే మనుషులు, జడ ప్రాయమైన వీణల్ని పెళ్ళి చేసుకునే మనుషులూ వున్నారు'' అంది రంభ.

రంభ మాటల్లోని తీవ్రమైన వ్యంగ్య ధోరణిని చూచి కేశవ్ ముఖం కోపంతో, రోషంతో ఎర్రగా కందిపోయింది.

"నాకు ఆనాటి భారతదేశం అంటేనే ఇష్టం'' కేశవ్ చెప్పసాగాడు.

"నిజమే! మా దగ్గర కాడిలాక్‌లు లేవు. అయితే ఏమైంది? దూరాన్ని వేగంగా చేరుకోలేకపోయాం అంతేకదా? కానీ మా గమ్యస్థానానికి కాస్త ఆలస్యంగానైనా సురక్షితంగా చేరుకునేవాళ్ళం. దారిలో యాక్సిడెంట్లకు గురై చావవలసిన ఖర్మ మాకు పట్టేదికాదు. ఇవ్వాళ ఎన్ని కార్లు న్నాయో అన్ని ప్రాణాలు రోడ్లమీద నిలువునా బలైపోతున్నాయి. మాకు రథా దార్లు వుండేవి. అవి అందరూ సుఖంగా, సురక్షితంగా, సజీవంగా నడవటానికి పనికి వచ్చేవి. నిజమే! మేము చెట్ల బెరళ్ళు మొలకు చుట్టుకునేవాళ్ళం. కానీ మీకు మల్లే నిరుపేదల చర్మాలు వలిచి ఏనాడూ చుట్టుకోలేదు. మేము మా సమాజంలో ఎవ్వరూఆకలిచావులు చావలేదు. ఎవ్వరూ నగ్నంగా తిరగలేదు. మీ ఇళ్ళల్లో ఒక ఇంట్లో సర్వభోగాలు తులతూగుతుంటే పక్కనే మరో ఇంట్లో పసులతో చస్తుం టారు. అలా వుండలేదు మేము. విల్లు అంబులతో తప్ప మరే ఆయుధాలతోనూ వేటాడి ఎరుగం. అదీ నిజమే! మా దగ్గర రైఫిళ్ళు, బాంబులూ లేవు. ఒకే బాణం–ఒక్కటే శికారు. కానీ ఒక్క బాంబుతో లక్షలమంది భస్మీపటలం అయిపోతారు. నిజమే! మేము ఆకుల్లోనే తినేవాళ్ళం. మీ లాగ ప్లేట్లల్లో మేం తినం. ప్రతిసారీ దాన్నే ఎంగిలి చేసారు. దాన్నే తోము కుంటారు. ఒక్కోసారి తోమనుకూడా తోమరు. కాసిన్ని నీళ్ళు చిలకరించి, అటూ ఇటూ తుడిచి మళ్ళీ దాంట్లో భోజనం పెట్టుకుంటారు. ఛీఛీ...... మోడ్రన్ మనిషి ఎంతగా కుళ్ళిపోయాడు. ఎంతటి అసహ్యంలో జీవిస్తున్నాడు. చేతులు మాత్రం సబ్బుతో కడుక్కుం టారు. మనసుచుట్టూ దుర్గంధం పులుము కుంటారు.''

''ఓహ్హో... ఎంత బోర్ కొట్టిస్తు న్నావు మిస్టర్ అడవిమనిషీ!'' రంభ ఆపు లిస్తూ అంది.

కేశవ్ నవ్వుతూ అన్నాడు "ముద్దు పెట్టుకోనివ్వకపోతే మరేంచేయను. ఏదో ఒకటి చెయ్యాలికదా !"

"పద ఇంక వెళ్దాం" రంభ చెట్టుకు కట్టివున్న గుర్రాన్ని విప్పుతూ అంది.

* * *

''అరె కైరీలా వుందే?'' అంది ఆయిరీని–దూరంగా రోడ్డుమీద ఆగిన కారును చూస్తూ.

మెరకమీది రోడ్డుమీద ఆగిన కారు లోంచి ఒక అమ్మాయి దిగి కారు వెనుక చక్రాన్ని పరీక్షిస్తూంది.

''అవును కైరీనే'' ఖుద్సియా కైరీని గుర్తించి "కైరీ" అని బిగ్గరగా కేకేసింది.

ఆ కేక కైరీ వరకు పోలేదు. కైరీ అలాగే వెనుక చక్రాన్ని చూట్టంలో నిమగ్నమై వుంది.

''ఈ కైరీ ఎవరు?" మదన్, భగీరథ్ ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"నా అమెరికన్ స్వీట్ హార్ట్. మిన్నాగులాంటి పదునైన అందం... సంపెంగ లాంటి పసందైన సౌందర్యం... బ్యూటీ కైరీ'' అని మళ్ళీ బిగ్గరగా కేకే

సింది.

ఆయిరీని అంది. "కైరీ జమ్ము వెళ్ళిందే! ఇక్కడికెలా వచ్చింది?"

"నువ్వు ఎలా వచ్చావో అలాగే" అంది ఖుద్సియా.

ఖుద్సియా ఈసారి చప్పట్లు కొడుతూ కైరీని ఇంకా బిగ్గరగా కేకేసింది. ఈసారి పిలుపు కైరీకి వినిపించింది. చక్రాన్ని పరీక్షిస్తున్నదల్లా నిటారుగా నిలబడి ఇటుకేసి చూచింది. ఆయిరీనిని, ఖుద్సియాను గుర్తించి చేయి బలంగా ఊపింది. వీళ్ళిదరూ మదన్‌ని, భగీరథ్‌ని అక్కడే వదిలేసి, రొప్పుకుంటూ, అల్లరి చిల్లరిగా కేకలు వేసుకుంటూ మెరక ఎక్కి రోడ్డుమీదకు చేరుకున్నారు. కైరీని వంతులువారీగా కౌగలించుకున్నారు.

"ఈ పిల్ల ప్రళయాంతకురాల్లా వుంది?" భగీరథ్ మదన్ చేతిని నొక్కుతూ అన్నాడు.

మదన్ కూడా కైరీనే చూస్తున్నాడు. అస్తమిస్తున్న సూర్యుడి ఎర్రటి కాంతి కైరీ ముఖాన్ని చుంబిస్తోంది. ఆమె ముఖం పువ్వులా ఎర్రగా వుంది. జ్వాలలా ప్రకాశిస్తోంది. ఆమె శరీరపు ప్రతి అవయవం సంధ్యా కాంతిలో ధగధగ మెరసిపోతోంది.

* * *

పొద్దు గ్రుంకింది. రాత్రికి భగీరథ్ రెస్ట్‌హౌస్‌లో పార్టీ ఏర్పాటైంది. నవ యువకులు, నవ యువతులు ఖరీదైన దుస్తులు ధరించి హాజరై వున్నారు. ఒక వైపున ప్లాస్టిక్ బక్కెట్ నిండా ఐస్, మరో వైపున బ్రాందీ, విస్కీ, రం వగైరా బాటిల్స్ వరుసగా పడి వున్నాయి. బొంబాయి నుంచి స్పెషల్ ఫ్లైట్‌లో ఆర్కెస్ట్రాను పిలిపించాడు భగీరథ్. అతడికి రవిశంకర్ తెలియదు. బీథూవెన్ తెలియదు. వీణ అంటే అసలే పడదు. డ్రమ్ముల భారీ మోత, కర్ణ కఠోరమైన బాకాల శబ్దం, వెకిలి పాటలు, పాశ్చాత్య ధోరణిలో వెర్రికేకలు అంటే మాత్రం ఇష్టం, ప్రాణం.

యువతులందరూ ఒకవైపుచేరి పాటలు పాడుతున్నారు, గెంతుతున్నారు. రకరకాల కృత్రిమ వేషధారణలో అరాచకత్వంతో నిండి ఊగిపోతున్నారు.

మరోవైపు మగవాళ్ళందరూ చేరి తాగుతున్నారు. చప్పట్లుకొడుతూ పాటలు పాడుతున్నారు. వెర్రి కేకలు వేస్తున్నారు. చిందులు తొక్కుతున్నారు. మళ్ళీ తాగుతున్నారు. మరి కాసేపట్లో అందరూ ఏకమైనారు. చెవులు చిల్లులు పడేటట్లు ఆర్కెస్ట్రా మోగుతోంది. బాండ్ శబ్దం తీవ్రమైన కొద్దీ కేకలు అరుపులు మరికాస్త తీవ్రస్థాయికి చేరుకున్నాయి.

బ్యాండ్ మోగి మోగి ఆఖరుసారిగా పెద్ద శబ్దం చేస్తూ ఆగిపోయింది. గొడవ కాస్త సద్దుమణిగింది. పురుషులు పెగ్గుల కోసం గాలిస్తున్నారు. స్త్రీలు చెదిరిన దుస్తులు, మేకప్ సరిచేసుకుంటున్నారు. అప్పుడే ఏర్పడిన నిశ్శబ్దంలో ఎవరిదో కేక బిగ్గరగా వినిపించింది.

"వదలండి ... వీరిని వదలండి... ఈయన నా బాయ్ ఫ్రెండ్"

అది కైరీ గొంతుక. కైరీ కోపంతో పిడుగులా గర్జిస్తూ అంది. రంభ, కేశవ్ చేతులు పట్టుకుని నిలబడి వున్నారు. కైరీ వాళ్ళిద్దరి ముందు ఆగ్రహంతో ఊగిపోతూ నిలబడి వుంది. కేశవ్ చేతిని రంభ చేతిలోంచి విసురుగా విడదీసి తను పట్టుకుంది గట్టిగా.




"ఇతడు నాకేమీ అవడు" రంభ అహంకరించింది.

"నీ బాయ్ ఫ్రెండ్ అయితే పట్టుకెళ్ళు. నీ వెంట వస్తానంటే తీసుకెళ్ళు" రంభ మళ్ళీ అంది.

"పదండి" కేశవ్ చేయి పట్టుకు లాగుతూ...రంభవైపు చూస్తూ అంది– "నీచురాలా! నేను లేని సమయం చూచి నా బాయ్ ఫ్రెండ్‌ని అపహరించాలని చూచావు...దొంగ...నువ్వు నా బాయ్ ఫ్రెండ్‌ని ఏమీ చేయలేవు...నువ్వేకాదు ఏ స్త్రీ కూడా క్రైరీ బాయ్ ఫ్రెండ్‌ని అపహరించజాలదు. ఎన్నిగుండెలు నీకు...యు...బద్మాష్...నీకు బుద్ధి చెప్పటానికే వచ్చాను. ఇంతమంది ముందు చెబుతున్నాను విను—ఎవరైనా సరే నా బాయ్ ఫ్రెండ్ వైపు చెడిపోయిన కళ్ళతో చూస్తే వాళ్ళ కళ్ళు పీకేయగలను...జాగ్రత్త...దిస్ ఈజ్ ఎ వార్నింగ్.."

"అచ్చా... ఇంక పట్టుకెళ్ళు నీ పియుణ్ణి... ఊరేగు... ఆపుచేయి...నీ ప్రతాపం... వెళ్ళు..." అంది రంభ కోపంగా.

"పదండి"... బయటకు వెళ్ళటానికి కేశవ్ చేయి పట్టుకుని బలంగా లాగుతూ అంది క్రైరీ. "మనమింక ఇక్కడ ఒక్క నిమిషంకూడా వుండొద్దు... ఊఁ... పదండి."

కేశవ్ తను నిల్చున్న స్థానంలోంచి కదల్లేదు.

"పదండి" క్రైరీ తొందరపెట్టింది.

కేశవ్ అలాగే వున్నాడు.

"ఏమైంది?" క్రైరీ అడిగింది ఆశ్చర్యంగా.

కానీ కేశవ్ ఏ సమాధానమూ ఇవ్వకుండా అలాగే నిలబడి వున్నాడు ప్రతిమలా.

"ఏమిటి మీ ఉద్దేశం? మీరు నా వెంట రారా?" క్రైరీ కోపంగా అరిచింది. క్రైరీ అవమానంతో వణికిపోసాగింది. ఆమె స్వరంలో పెద్ద ఆశ్చర్యం, ఆవేదన నిండిపోయింది. ఆమె కళ్ళలోంచి కన్నీళ్ళు ఉబికి వస్తున్నాయి.

"నో... నో... మీరింతటి కఠినులు కాలేరు. కాకూడదు. మీకు తెలుసుకదా? నేను మిమ్మల్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నాను. ఈ రోజునుంచి కాదు. ఆ రోజు హార్వర్డ్‌లో నా కలలో కనిపించినప్పటి నుంచి ప్రేమిస్తున్నాను....మనసారా ఆరాధిస్తున్నాను... కేశవ్... రండి నా వెంట."

క్రైరీ గొంతులో అభ్యర్థన, ప్రార్థన నిండిపోయింది. క్రైరీ విలపిస్తూ నిలబడి వుంది. చుట్టూ నిశ్శబ్దం అలుముకుంది. అందరూ మౌనంగా కేశవ్‌నే గమనిస్తున్నారు. కేశవ్ తన స్థానంలోంచి ఒక్క అంగుళమైనా కదల్లేదు. తల వంచుకుని అలాగే రాతివిగ్రహంలా నిలబడివున్నాడు అతడి నోటివెంట ఒక్క మాటకూడా రావటంలేదు.

క్రైరీ చాలాసేపు కేశవ్ కోసం నిరీక్షించింది. చుట్టూ మౌనంగా నిలబడివున్న అందరివైపు చూచింది. ఆమె కళ్ళు ఎర్రగా జ్వాలల్లా ప్రకాశిస్తున్నాయి. మళ్ళీ కేశవ్ వైపు ఓసారి చూచింది. తరువాత పక్కనే స్టూల్‌మీద బ్రాందీతో నింపివున్న గ్లాసు చేతిలోకి తీసుకుంది. బ్రాందీ గటగటా తాగేసింది. తాగి గ్లాసును విసురుగా గోడకేసి బాదింది. ఏడ్చుకుంటూ తడబడుతున్న అడుగులతో బయటకు నడిచింది.

క్రైరీ ఏడ్చుకుంటూ వెళ్ళిపోతోంది.



కన్నీళ్ళు తుడుచుకునే ప్రయత్నం కూడా చేయటంలేదు! వేదునిండిన వెచ్చటి కన్నీళ్లు ఆమె బుగ్గలమీదనుంచి ప్రవహిస్తున్నాయి. కన్నీటి వర్షంలో తడిచిపోతూ నడుస్తోంది క్రైరీ.

ఇంతలో ఎవరో ఆమె చేతిని బలంగా పట్టుకున్నారు.

"వదలండి ... నా చేయి వదలండి" క్రైరీ కోపంతో వణికిపోతూ అరిచింది.

"ఎక్కడ వరకు వెళ్ళాలి మీరు?" చేయి పట్టుకున్న ఒక మగ గొంతుక లాలనగా అడిగింది.

"నరకానికి" క్రైరీ జవాబిచ్చింది క్రోధంతో.

"నేను మిమ్మల్ని అక్కడికే చేరుస్తాను. రండి ముందు కారులో కూర్చోండి" మగ గొంతుక ధైర్యంగా పలికింది.

"నేను మీ కారులో ఎందుకు కూర్చోవాలి? నాకు నా కారుంది. నా కారులో నేను కూర్చోగలను" క్రైరీ నిలువెల్లా కంపిస్తూ కోపంగా అంది.

"ఈ కారు మీదే" అతడు చాలా శాంతంగా అన్నాడు. "ఈ సమయంలో మిమ్మల్ని సురక్షితంగా మీ యింటికి చేరుద్దామని నేను మీ కారులో కూర్చుని వున్నాను. రండి.... కూర్చోండి... ఎక్కడివరకెళ్ళాలి మీరు?"

"శ్రీనగర్" క్రైరీ అతడి పక్కనే అతడ్ని ఆనుకుని కూర్చుంటూ అంది.

స్టీరింగ్ దగ్గర కూర్చునివున్న అతగాడు ముందు తృళ్ళిపడ్డాడు. కానీ అంతలోనే సర్దుకుని కారు స్టార్ట్ చేశాడు.

"మీ వ్యక్తిత్వపు తీవ్రత నాకు చాలా నచ్చింది" అతడు కారు నడుపుతూ అన్నాడు. "ఇదిగో నా కర్చీఫ్ తీసుకోండి. మీ కళ్ళు దీంతో తుడుచుకోండి."

"నాకూ మీ దుస్సాహసం..." క్రైరీ అతడిచ్చిన కర్చీఫ్ అందుకుని కన్నీళ్ళ మధ్యనుంచి నవ్వింది.

"నన్ను మదన్ అంటారు" అతడు పహల్‌గావ్ నుంచి శ్రీనగర్ వెళ్ళే రోడ్డు మీదకు కారును తిప్పుతూ అన్నాడు.



అప్పుడే తెల్లవారింది.

నక్షత్రాలు పోసి కడిగినట్టు తెల్లగా సౌమ్యంగా వుందా ఉదయం. శేషు రంభను తీసుకొని లిడ్దర్ నదీతీరాన బండ మీద స్థాపించి వచ్చిన శివలింగం దగ్గరకు బయలుదేరాడు. అతడు ప్రతిరోజూ ఉదయాన్నే పూజ కోసం అక్కడకు చేరుకుంటాడు. ఈవేళ రంభతో జంటగా శివలింగం దగ్గరకు చేరుకున్నాడు. రంభ తెల్లటి చీర కట్టుకుని మెడలో అడవిపూల మాల వేసుకొని అప్పుడే నక్షత్ర లోకం నుంచి దిగివచ్చిన అందమైన తారలా వుంది. తూర్పు క్షితిజ రేఖల మీద తెల్లటి మబ్బులు గుమిగూడి వున్నాయి. రంభ ముఖమ్మీద ఎవరికీ అంతుపట్టనాలని నిగూఢతత్వం ఒకటి తొంగిచూస్తోంది. హాయలు హాయలుగా కదులుతున్నాయి లిడ్దర్ నదీ కెరటాలు.

పహల్‌గావ్‌లో ఉదయం అంత అందంగా వుంటుందని రంభకు తెలియదు. ఆ రోజే మొదటిసారిగా ఉదయ సౌంద





ర్యాన్ని చూచి ఆశ్చర్యపోయింది. కేశవ్ పూజ ముగించుకుని రంభతో అన్నాడు.

"నన్ను నువ్వు ప్రేమిస్తున్నానని శివుడి ముందు ప్రమాణం చెయ్యి"

రంభ అంది "నీ తోనే ఒప్పుకున్న తరువాత శివుడు ముందు ఒప్పుకోవటానికి అభ్యంతరం ఏముంటుంది"

"నిజమైన ప్రేమా ?"

"హృదయాంతరాళాల్లో సుళ్లు తిరిగిన ప్రేమ" రంభ ఉల్లాసంగా అంది.

"నన్ను పెళ్ళి చేసుకుంటావు కదూ?"

"అప్పుడు చేసుకుంటాను"

"శంకరా...వింటున్నావా?" కేశవ్ శివుడితో అన్నాడు. "తరువాత నేను ఎక్కడికి రమ్మంటే అక్కడకు వెంట వస్తావా?" కేశవ్ స్పష్టంగా అడిగాడు.

"ప్రపంచపు ఆఖరి సరిహద్దు వరకూ, నరకపు చివరి ద్వారం వరకూ నువ్వు ఎక్కడికి తీసుకెళ్తే అక్కడకు వస్తాను" రంభ నవ్వుతూ అంది.

"ఇప్పుడు కళ్ళు మూసుకుని శివలింగానికి దణ్ణం పెట్టు"

రంభ అలాగే చేసింది.

కేశవ్ కూడా కళ్ళు మూసుకుని శివుడ్ని ధ్యానిస్తూ అన్నాడు. "నువ్వు కోరిన విధంగా నేను చేసుకువచ్చాను. రంభ ప్రేమను నేను సంపాదించాను. ఇప్పుడు నాకు జీవితాన్ని ప్రసాదించు. మిగిలిన తొంభై తొమ్మిది సంవత్సరాల ఆయుర్దాయాన్నివ్వు. నేను రంభతో కలిసి జీవిస్తాను. నీ వాగ్దానం పూర్తి చెయ్యి. వింటున్నావా? మహేశ్వరా...కైలాసవాసా...నువ్వు వింటున్నట్లయితే ఒక పని చెయ్యి. ఈ పూల హారం శివలింగానికి ఎడమ వైపున వుంది. దీన్ని కుడి వైపుకు మారేటట్టు చెయ్యి. అప్పుడు నువ్వు నీ వాగ్దానం పూర్తి చేశావని నేను నమ్ముతాను" అన్నాడు.

అంతవరకు చెప్పి కళ్ళు మూసుకుని కేశవ్ శివుడ్ని ధ్యానించసాగాడు. కొద్ది క్షణాల అనంతరం కళ్ళు తెరచిచూచాడు. పూలహారం శివలింగానికి ఎడమవైపున అలాగే వుంది. రాతిబండ మీద నుంచి మెల్లగా కిందకు జారుతూ అలల విసురుకు నీళ్ళ మీద ఊగుతోంది.

కేశవ్ మళ్ళీ కళ్ళుమూసుకుని శివుడ్ని ఏకాగ్రతతో ధ్యానిస్తూ అన్నాడు "పార్వతీ నాథా...వింటున్నావా కోరిక?"

ఇంతలో బండ మీద నుంచి జారి నీళ్ళలో కొట్టుకుపోతున్న హారాన్ని చూచింది రంభ. వెంటనే దాన్నందుకుని అనాలోచితంగా శివలింగానికి కుడివైపున పెట్టేసింది. అనుకోకుండా నిశ్శబ్దంగా జరిగిపోయిందా పని.

మరుక్షణంలో కేశవ్ కళ్ళు తెరచి చూచాడు. పూలహారం ఎడమ నుంచి కుడికి మారివుంది. అది చూడగానే కేశవ్ ముఖం ప్రసన్నతతో నిండిపోయింది. కేశవ్ రెండు చేతులూ పైకెత్తి మొక్కాడు "హే పసుపతినాధా! నన్ను ధన్యుణ్ణి చేశావు" అని సాష్టాంగ ప్రణామాలు చేశాడు.

"శివుడ్ని పసపతి నాధుడు (పసువుల దేవుడు) ఎందుకంటారో ఇప్పుడు నీ చేష్టలు చూచాక అర్థమైంది నాకు" రంభ కేశవ్ వైపు చూచి వ్యంగ్యంగా నవ్వుతూ అంది. "దీనికోసమేనా నన్ను వచ్చి నిద్ర లోంచి బలవంతంగా లేపుకుని వచ్చావు?"

"ఇప్పుడు వెళ్ళి నీ గదిలో నిద్రపో" అన్నాడు కేశవ్.

"మరి నువ్వో?"

"నేను ఇంకో రెండు గంటలు శివుడ్ని





ధ్యానించుకుని వస్తాను." "హు"...రంభ నిటారుగా నిలబడుతూ అంది "ఒకవేళ నువ్వు ఏదైనా ఉద్యోగానికి వెళ్ళవలసి వచ్చినప్పుడు నీకు రోజూ రెండు గంటల సేపు దేవుడ్ని పూజించే టైం ఎక్కడ దొరుకుతుందో నేనూ చూస్తాను?"

కేశవ్ అన్నాడు "నేను ఎక్కడ నుంచి అయితే వచ్చానో అక్కడ పూజ ఒక పని కాదు. ఈ పనికి ఎవ్వరూ ప్రతి ఫలాన్నాశించరు. అందుకే మేము ఒక ధోవతి కట్టుకుని, ఒక చిన్న కుటీరంలో ఉంటూ ఒక్కపూటే తిని కూడా ఆనందంగా జీవించేవాళ్ళం"

"అది అజ్ఞానంలోంచి, మూర్ఖత్వం లోంచి పుట్టుకొచ్చిన ఆనందం...మనిషికి తనగురించి తనకు తెలియనప్పుడు, తన కాళ్ళు చేతులు తన స్వాధీనంలో లేనప్పుడు కలిగే ఆనందం కూడా ఒక ఆనందమేనా? అలా అయితే మనుషులకన్నా కోతులకే ఎక్కువ ఆనందం లభిస్తుంది. కోతులకన్నా ఒక





పురుగు అది చెట్టు మొదలును తవ్వి తవ్వి తన ఆహారాన్ని సంపాదించుకుని ఆనందంగా వుంటుంది. దానికన్నా ఏక కణ జీవి అమీబా ఎప్పుడూ అలల మీద తేలుతూ సయ్యాటలాడుకుంటూ ఇంకా ఆనందంలో జీవిస్తుంది. ఆ ఆనందానికి, మనిషి ఆనందానికి తేడా వుంది. మనిషి ఎన్నో దురదృష్టకరమైన అనుభవాల్లోంచి నడుస్తాడు. తన చుట్టూవున్న దుఃఖాన్ని గ్రహిస్తాడు. ఆనందం ఎక్కడుందో వెతుక్కుంటూ పోయి–ప్రకృతి గుండెలను చీల్చి మరీ ఆనందాన్ని పిండుకుంటాడు. మొదటి నుంచి మనిషి తన రక్తాన్ని వరదలా ప్రవహింపజేస్తేగాని ఒక్క ఆనందపు అగ్నికణం లభించిందికాదు. ఈ విషయాలు నీకెలా తెలుస్తాయి. రెండు వేల సంవత్సరాలనాటి అడవి మనిషివి. జీవితాంతం ఒక బిందువులో కుంచించుకుపోయి బ్రతికి ఇదే ఆనందపు ఆఖరి సరిహద్దు అనుకుంటే మూర్ఖత్వం అవుతుంది" తీవ్రంగా అంది రంభ.



"ఇంతకీ ఇప్పుడు నీక్కావలసిందే మిటి?" కేశవ్ వివాదం నుంచి తనను రక్షించుకో జూస్తూ అన్నాడు.

"నన్ను కాస్త రెస్ట్‌హౌస్ వరకు దిగ బెట్టిరమ్మని కోరుకుంటున్నాను" అంది రంభ.

"ఆ మాట ముందే చెబితే సరి పోతుందిగా" కేశవ్ పూజలోంచి లేస్తూ అన్నాడు "ఎక్కడనుంచి అయితే నేను వచ్చానో అక్కడ స్త్రీలకు మిడి మిడి చదువులు చెప్పించి నెత్తిమీదకు ఎవ్వరూ ఎక్కించుకోరు"

"అది నాకు తెలుసు. బరువులు మోస్తూ బానిస బ్రతుకు బ్రతకటమే అప్పటి స్త్రీ పని" రంభ క్రోధంగా అంది. "కానీ మిస్టర్! ఈనాటి భారత వనిత రాతియుగం నాటి ఆటవిక స్త్రీ కాదు. జాగ్రత్తగా గుర్తుపెట్టుకో"

"కానీ వాచాలత్వం మాత్రం అప్పటికీ ఇప్పటికీ అలాగే వుంది" అన్నాడు కేశవ్.

"ఒకరి చేయి ఆడితే మరొకరికి నాలుక ఆడుతుంది" రంభ అంది.

"ఒక్కొక్కరికి చేయీ ఆడదు. నాలుకా ఆడదు. కేవలం గుండె మాత్రమే ఆడుతుంది. అలాంటి దీనుడి గతేమవ్వాలి" కేశవ్ రంభ వేపు అతి ప్రేమగా చూస్తూ మురిపెంగా అన్నాడు.

రంభ పకపకా నవ్వేసింది. ఆమె కోప మంతా ఒక్కసారిగా మటుమాయమైంది. వేళ్ళను నాట్యం చేయిస్తూ అంది-

"పద...పద...ఇంక చర్చలు వద్దు. నన్ను రెస్ట్ హౌస్ వరకు దిగబెట్టి వచ్చి తరువాత నీ పూజలు చేస్తూ వుండు"

* * *

ఎన్నో ఉదయాలు, ఎన్నో సాయం త్రాలు పువ్వుల్లా వికసించి వాడిపోయి రాలిపోయాయి. కేశవ్ కిప్పుడు ఒక్క విషయం మాత్రమే గుర్తుంది. తను రంభ నుంచి వేరుచేయబడ్డాడు. సంతోషాలూ, ఆనందాలూ అన్నీ కలసికట్టుగా దూర తీరాలకు తరలిపోయాయి, అదృశ్యమై పోయాయి.

అందరూ కాశ్మీర్‌నుంచి బొంబాయిచేరు కున్నారు. తరువాత రంభ షిపార్ట్ కాలేజీలో హిస్టరీ లెక్చరర్‌గా వెళ్ళిపోయింది డబ్బు కోసం కాదు. టైంపాస్ చేయటం కోసం. మదన్ కూడా అదే కాలేజీలో ప్రొఫె సర్‌గా పని చేస్తున్నాడు.

ఇప్పుడు కేశవ్ ఒంటిమీది జ్వరం కాస్తా దిగిపోయింది. ఇప్పుడు రంభ కూడా మునుపటి రంభ కాదు. ఆమెకు కేశవ్ మీదున్న వ్యామోహం, ఆసక్తి ఇప్పుడు లేవు. అంతకు మునుపు రంభ కేశవ్ త్రవ్వకాల్లోంచి బయటపడిన ఒక అద్భుత అపూర్వ శిల్పంగా భావించేది. ఆ మూర్తిని తన డ్రాయింగ్‌రూంలో ప్రతి ష్ఠించి అందరినీ ఆహ్వానించి 'చూడండి! నా స్వాధీనంలో ఎంతటి అందమైన కళా ఖండం వుందో' అని చూపించి గర్వ పడేది. ప్రతిరోజూ శ్రద్ధగా ఆ మూర్తిని పరిశుభ్రపరచి అందరి దృష్టి ఆ మూర్తి మీదకు ప్రసరించే ప్రత్యేక స్థానంలో వుంచేది. అప్పుడు కేశవ్ రంభకు ఒక స్టేటస్ సింబల్.

కానీ కాశ్మీర్ నుంచి వచ్చాక ఆ ఆసక్తి, అభిరుచి నెమ్మదిగా క్షీణించి పోయింది. కేశవ్ మీదున్న మోజు తీరి పోయింది. కొద్ది నెలల తర్వాత కేశవ్ మీద దుమ్ము, ధూళి పేరుకుపోసాగాయి. ఇప్పుడూ డ్రాయింగ్ రూంలోనే వుంటాడు. కానీ ప్రత్యేకమైన స్థానంలో కాదు — పాత సామానులా మాత్రమే,




నంగు వెలిసిపోయి, విరిగిపోయిన ఒక ఆటబొమ్మలా మాత్రమే.

అయితే కేశవ్ ఈ మార్పును గమనించలేకపోయాడు. అంత తొందరగా మన స్త్రీల ముఖాలు మారిపో తాయన్న విషయమే పూర్తిగా అతడికి తెలియదు. సహజమైన సహజత్వం, ప్రేమ పట్ల ఆశ్చర్యం, ఏకాగ్రత నిండిన సాదాసీదాతనం అతడి వ్యక్తిత్వంలో పుష్కలంగా వున్నాయి. ఆధునిక సమాజపు ఆకర్షణలూ, మోజులూ అతడికి తెలియవు. దాంతో రంభ ప్రవర్తనలోని భయంకరమైన మార్పు గమనించలేక పోయాడు. రంభ ఎన్నోసార్లు కించ పర్చినా కేశవ్ ఏమీ అనుకునే వాడుకాడు. అది ఆమె అలవాటు అనుకునేవాడు. పైగా స్వేచ్ఛగా, అతి చనువుగా మాట్లాడుతుందని భావించేవాడు. రంభను విపరీతంగా ప్రేమించేవాడు. ఉన్నట్టుండి ఒక రోజు రంభ అడిగింది "ఏదైనా పని చేద్దామన్న ఉద్దేశమేదైనా వుందా నీకు?"

కేశవ్ అర్థం కాక చూస్తూ ఉండి పోయాడు.

రంభ మళ్ళీ అడిగింది "నువ్వు రోజల్లా ఆ వీణను అంటి పెట్టుకుని వుండి పోతావు. అలా వుంటే గడిచి పోతుందనా నీ ఉద్దేశం ?"

రంభ చాలా చోట్ల వెదకి చివరికి గ్వాలియర్ నుంచో వీణను తెప్పించి పెట్టింది. సాధనకు ఆ వీణ సరిపోలేదు. కాని కేశవ్ చాలా కష్టపడి ఆ వీణను తనకనుగుణంగామల్చుకున్నాడు. సంగీత సాధనలో మునిగిపోయాడు. వీణతో ప్రేమ, రంభతో ప్రేమ — ఇంకేంకావాలి జీవితానికి అని అనుకుంటూపోయాడు.

అందుకని రంభ ప్రశ్నకు చాలా ఆశ్చర్య పోయాడు. చివరికి—

"నాకు తెలుస్తూనే వుంది" జవాబుగా అన్నాడు కేశవ్.

"నన్ను పెళ్ళి చేసుకుందామను కుంటున్నావా లేదా ?"

"అనుకుంటున్నాను. చేసుకుందామని నిశ్చయంగా"

"అయితే నువ్వు ఎక్కడ్నించి అయితే వచ్చావో అక్కడ స్త్రీలు సంపాదించి పురుషులకు పెడతారా ? లేక పురుషులు సంపాదించి స్త్రీలను పోషిస్తారా?" అడిగింది రంభ.

"పురుషులు సంపాదిస్తారు"

"మరి నువ్వు పురుషుడివా? స్త్రీవా ??"

అది విని చాలా సేపటివరకు మౌనంగా వుండిపోయాడు కేశవ్.

రంభ మళ్ళీ అంది "ఈ విషయం నిర్ణయమైపోతే తరువాత నేను మన పెళ్ళి గురించి ఆలోచిస్తాను. ఖచ్చితమైన విషయమేమిటంటే— నేను ఒక స్త్రీని అయివుండి మరో స్త్రీని వివాహం చేసుకోలేను కదా?"

హటాత్తుగా కేశవ్ ముఖం రోషంతో ఎర్రబడింది. ఒక్కసారిగా లేచినిలబడి వీణను చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు కేశవ్ "అవును. నువ్వు నిజమే చెబుతున్నావు. ఏదన్నా పని వెదుక్కున్న తరువాతే నీకు కనిపిస్తాను" అన్నాడు.

"కానీ వెళ్ళే ముందు ఒక్క ముఖ్య విషయం కూడా విని వెళ్ళు. పనంటే నా ఉద్దేశంలో ఓ నలుగురికి వీణ నేర్పించి ఏభయ్యో, వందో సంపాదించే చిన్నా చితక ఉద్యోగం కాదు. నెలకు కనీసం రెండొందలు నా మేకప్‌కే అవుతాయి. రాజస్థీ పనంటూ ఏదైనా సంపాదిస్తే రాస్తు వాటు, వప్పు, దర్పం,

హోదా వచ్చే పని సంపాదించు. దాంతో సమాజంలో నా ప్రతిష్ట,హోదా పెరగాలి. అదీ ప్రేమంటే! అర్థమైందా?" రంభ వివరించింది.

"అర్థమైంది. నువ్వు కోరుకుంటున్న విధంగానే చేసుకు వసాను. అలాంటి పని సంపాదించిన తరువాత మాత్రమే నా ముఖాన్ని నీకు చూపిస్తాను'' అన్నాడు కేశవ్.

"మరీ అంత ముఖం చాటేసుకో వాల్సిన అవసరం లేదులే" రంభ నవ్వుతూ అంది "అప్పుడప్పుడు వచ్చి కనిపిస్తూ వుండు బావుంటుంది."

* * *

ఆ రాత్రి పార్టీలో డాన్సు చేస్తున్నప్పుడు అడిగాడు మదన్

''రంభా! కేశవ్‌ని ఏం చేశావు?"

రంభ మదన్‌కౌగిలిలోపలికి జరుగుతూ అంది ''అతడ్ని సింద్‌బాద్ సప్తమ సాహస యాత్రకు పంపాను''

''మంచి పని చేశావు. చాలా బోర్ కొట్టించేశాడు కదూ" మదన్ అడుగులు వేస్తూ వేస్తూ రంభను మరింత దగ్గరగా జరుపుకొని గుండెలకేసి హత్తుకున్నాడు. చాలా సహజమైన, సునాయాసమైన చర్య అది. అలాగే వుండి ఒక మెత్తటి నిట్టూర్పు విడుస్తూ అంది ''కానీ మదన్! అతడి నిష్క్రమణవల్ల నాకు బాధే కల్గింది. అమాయకత్వం, పసితనం నిండిన అతడి ముఖం, నిజాయితీ నిండిన అతడి వ్యక్తిత్వం, అతడీ ప్రపంచానికే చెందినవాడు కాదనిపిస్తోంది.''

మదన్ తక్షణమే రంభను తన గుండెల నుంచి దూరంగా జరిపాడు. ఇప్పుడు వాళ్ళిద్దరి మధ్య సహజంగా వుండవలసినంత దూరం వుంది. మదన్ అనుకున్నాడు-రంభకూ, తనకూ మధ్య వుండే ఆ దూరం చిత్రంగా ఎప్పుడూ అలాగే వుండిపోతుంది. పెరగదు, తరగదు.

* * *

భగీరథ్, జౌహరీ కలసి జౌహరీ ఇంట్లో వున్న చిన్న బార్‌లో కూర్చొని విస్కీ తాగుతున్నారు.

జౌహరీ కన్నుగీటుతూ అన్నాడు "కేశవ్ పోయాడు"

"కానీ మదన్ వున్నాడు" అన్నాడు భగీరథ్. అతడి మాటల్లో విషపూరిత మైన ఈర్ష్య ధ్వనించింది. భగీరథ్ అప్పటివరకు పార్టీలో డాన్స్ చేసి వచ్చాడు. కానీ రంభ తననుంచి విడిపోయి మదన్‌తో డాన్స్ చేయటం, తను పట్టుకున్న భుజాలను మదన్‌కు అర్పించటం చూస్తే బాధ వేసింది. కష్ట మనిపించింది. అందుకే పార్టీలోంచి వచ్చేసి బార్‌లోకి దూరాడు.

"ఒక రోజు మదన్ కూడా వెళ్ళి పోతాడు" జౌహరీ భగీరథ్‌ను శాంత పరుస్తూ ప్రేమగా అన్నాడు "కమాన్ విస్కీ తాగు."

జౌహరీ స్వరంలో అప్పుడు నిండి వున్న కోమలత్వానికి కారణమేమిటో భగీరథ్ ఇట్టే పసికట్టాడు. ఒక్క క్షణమైనా ఆలస్యం జరగలేదు. అయినా భగీరథ్ చాలా కాలం క్రితమే అంచనా వేసుకుని వుంచుకున్నాడు. జౌహరీకు పదిహేను లక్షల వరకు అప్పుపెట్ట వచ్చు. పర్వాలేదు. కథ అడ్డం తిరిగితే జౌహరీ దుకాణం, ఇల్లు వేలం వేయిస్తే తేలిగ్గా పదిహేను లక్షలకు పైగానే




వస్తాయి. ఇవన్నీ ముందుగా తెలుసుకునే సిద్ధపడి వున్నాడు భగీరథ్. కాబట్టి జౌహరీని ఇంకా ఇబ్బంది పెట్టటం ఎందుకని "ఎంతకు కావాలి చెక్కు?" అడిగాడు.

జౌహరీ చిరునవ్వు నవ్వుతూ రెండు పెద్ద గుటకలు మింగాడు. భగీరథ్‌ను కళ్ళతోనే అభినందించాడు. గ్లాసును టేబిల్ మీదుంచుతూ "అరవై వేలకు ఒక చిన్న చెక్కు ఇస్తేచాలు. ప్యారిస్ నుంచి కొత్త సరుకు వచ్చింది. విడిపించాలి" అన్నాడు.

భగీరథ్ మౌనంగా చెక్కు రాస్తూ తలవంచుకుని అడిగాడు. "మోనా విషయం ఏమైంది? పారిపోయిందా?"

జౌహరీ తలలో పెద్ద పేలుడు సంభవించినట్లైంది. చాలా పక్షులు ఒక్కసారిగా అరుచుకుంటూ లేచిపోయినట్లైంది. చాలా సేపటివరకు అతడి అస్తిత్వం అచేతనమై పోయింది. అతడి మౌనం చూస్తే తన ప్రశ్న జౌహరీ విన్నట్టు లేదు అనుకున్నాడు భగీరథ్.

మోనాను కాశ్మీర్ పంపించి వుంటే జౌహరీ రహస్యం ఇలా బట్టబయలు అయివుండేది కాదు. ఆ మధ్య మోనా కాశ్మీర్‌లో వుంటానని గగ్గోలు పెట్టినా జౌహరీ అంగీకరించలేదు. బొంబాయి ఒక మహా నగరం. ఇక్కడుంటే తన విషయం ఎవరికీ తెలిసే అవకాశం వుండదు. కానీ కాశ్మీర్‌లో వుంటే ఇట్టే బయట పడిపోతుంది. అదీకాక రంభకు తెలిస్తే అసలే బావుండదు అని భయపడ్డాడు. అప్పుడు జౌహరీ మోనాని రానీఖేత్‌లో వుంచాడు. ఆ మధ్య జౌహరీ మిత్రుడు మగన్ సేట్ ఉంపుడు కత్తె జమునాబాయి మరణించింది. జౌహరీ అప్పుడు బొంబాయిలో లేడు.

జమునాబాయి మరణంతో మగన్ సేట్ ఉదాసీనంగా తయారయ్యాడు. సరిగ్గా నెల రోజుల పాటు నలుగురు మనుషుల్ని పెట్టి మంచి అమ్మాయి కోసం వెదికించాడు. కానీ మగన్ సేట్ మనసుకు నచ్చిన అమ్మాయి దొరకలేదు. చివరికి ఒక రోజు మగన్ విసిగిపోయి రానీఖేత్ వెళ్ళాడు. తాత్కాలికంగా మోనాతో గడిపాడు. అదేమంత మంచి విషయం కాదని మగన్ సేట్‌కు తెలుసు. అందుకనే జౌహరీని పిలిపించి మరీ విషయం చెప్పాడు.

అప్పుడు జౌహరీ మాత్రం ఏం చేయగలడు. పళ్ళు నూరుకుని వుండిపోయాడు. మగన్ సేట్ జౌహరీకన్నా పెద్ద సేటు. అతడికి రెండు పెద్ద పెద్ద బట్ట మిల్లులున్నాయి. ఎవడి దగ్గర ఎక్కువ డబ్బుంటే వాడే అన్నివిధాల అధికుడన్నది స్పష్టమైన విషయం. కాబట్టి జౌహరీ మదన్ సేట్‌ని ఏమీ అనలేకపోయాడు. ఈలోగా మోనా యవ్వనం అంత్య దశలో వుందని మోనా తల్లి గమనించింది. వయసు వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనుకుంది. దాంతో, మోనా జౌహరీకు కాకుండా పోయింది. మదన్ సేటుకు అర్పితమై పోయింది.

జౌహరీ శ్రీనగర్ నుంచి వచ్చి చాలా కాలం తెగిన గాలిపటంలా తిరిగాడు. బొంబాయిలోని హై సొసైటీలన్నీ గాలించాడు. అతడికి నచ్చిన అమ్మాయి దొరకలేదు. ఎంత కాలం తన రాత్రులను అలావృధాగా గడపగలడు అతడు మాత్రం. జౌహరీ తన ప్రయత్నాన్ని ఇంకా తీవ్రం చేశాడు.

చివరికి ఒకరోజు అతడి మనసుకు

తిరుగుతుంటారు-కానీ రాంతివారీ అలాంటి వాడు కాడే. పైగా అతడి కమీషన్ మూడు వేలు అప్పుడే తీసుకున్నాడు. విషయం ఎవరితోనూ చెప్పనని మాటిచ్చి వెళ్ళాడు. అయినా బయటకు వచ్చేసింది.

జౌహరీ అనుకున్నాడు. వెంటనే ఆ ఫ్లాట్ మార్చి మరో కొత్త ఫ్లాట్ కొనవలసి వుంటుంది. ఎవ్వరికీ ఆ ఫ్లాట్ అడ్రసు తెలియనివ్వకూడదు. మునుపటి ఆపదలు మళ్ళీ కొనితెచ్చుకోకూడదు. అలా నిర్ణయించుకుని ఒక పెద్ద పెగ్గు గటగటా తాగేశాడు.




కేశవ్ ఆ రాత్రి జోగేశ్వరీ స్టేషన్ (బొంబాయిలోని ఒక లోకల్ స్టేషన్)లో గడిపాడు. సరిగ్గా అదే రాత్రి చాలా మంది సాధువులు అదే స్టేషన్‌లో ఆగి వున్నారు. వాళ్ళంతా బోరీవిలీ వరకు నడిచి వెళ్తూ ఆ రాత్రికి అక్కడ ఆగారు. బోరీవిలీలో ఒక పాత శివాలయం బయటపడిందట. ఆ మందిరాన్ని పునః ప్రారంభించటానికి ఈ సాధువుల గుంపు బోరీవిలీకి బయలుదేరింది.

కేశవ్ వీణ వాయించుకుంటూ, భజన గీతాలు పాడుకుంటూ వుండటం వాళ్ళు గమనించారు. మధురమైన అతడి గానం, అద్భుత వీణా నాదం చూచి ఆశ్చర్యపోయి సాధువులందరూ కేశవ్‌ని తమతో పాటు బోరీవిలీకు రమ్మని ఆహ్వానించారు. అది శివాలయ వ్యవహారం కాబట్టి కేశవ్ వెంటనే ఒప్పుకున్నాడు. ఒకటి రెండు రోజుల మాటే కదా, మూడో రోజున మళ్ళీ తిరిగి రావచ్చు అనుకుని వాళ్ళతో బయలుదేరాడు.

కేశవ్ వెళ్తున్న సాధువుల గుంపులో ఇద్దరు సాధువులు ప్రత్యేక లక్షణాలున్నవారు వున్నారు. ఒకడు పూజా ప్రణామాలు చేసేటప్పుడు పది నిమిషాల పాటు శ్వాస బిగించివేస్తాడు. మరొకడు శీర్షాసనం వేసి, శ్వాస పైకి ఎగబీల్చుకుని అర్ధగంటసేపు వుంటాడు. ఈ అర్ధ గంటసేపు అతడి శ్వాస కాని, నాడికాని ఆడదు.

కానీ ఆలయానికి చేరుకున్న తరువాత కేశవ్ మూడు గంటల సేపు శ్వాసను బిగించి సమాధిలో కూర్చుని చూపించేసరికి ఇద్దరు సాధువుల కళ్ళు బైర్లు కమ్మాయి. ఇద్దరూ వెంటనే కేశవ్ కాళ్ళ మీద పడ్డారు.

వాళ్ళలోనే మరో బెంగాల్ సాధువు స్వామీ భోలానాథ్ ఒకడు. అతడు చక్కటి సంస్కృతంలో మాట్లాడతాడు. కేశవ్ అతడితో సంస్కృతంలోనే చర్చకు దిగాడు. కేశవ్ నోటి వెంట ఉరకలెత్తుతున్న సంస్కృత భాషా ప్రవాహానికి తట్టుకోలేక స్వామీ భోలానాథ్ కూడా కేశవ్ కాళ్ళ మీద పడిపోయాడు. అంతటి సంస్కృతం అతడి జీవితంలోనే ఎక్కడా వినివుండడు. దానికి కారణం సంస్కృతం కేశవ్ మాతృభాష. అతడి ముందు ఈ సాధువులేం నిలుస్తారు.

తరువాత శ్వాస బిగించే ఆ ఇద్దరు సాధువులు, స్వామీ భోలానాథ్‌తో పాటు

మరికొందరు వివేకవంతులైన సాధువు లందరూ కలసి వెంటనే ఓ సమావేశం ఏర్పాటు చేసుకున్నారు. వాళ్ళు ఏం మాట్లాడుకున్నారో ఎవరికీ తెలియనివ్వ లేదు. కాసేపటికి వాళ్ళు ముగ్గురూ కేశవ్ దగ్గరకొచ్చి-

"మీరు ఈ మందిరానికి ప్రధాన ఉపాసకులుగా వుండాలని మా అందరికోరిక. దయచేసి అంగీకరించండి" అన్నారు.

కేశవ్ అన్నాడు "కానీ నేను ఆ భోలానాధుడికి తుచ్ఛమైన పూజారిని మాత్రమే!"

"కాదు మీరు గొప్పవారు. మీలాంటి వారే మాకు కావాలి" స్వామీ భోలానాథ్ అన్నాడు "మొదట వీళ్ళందరూ నన్ను ప్రధానోపాసకుడిగా చేద్దామనుకున్నారు. కానీ మీకున్న యోగ్యతలు చూచాక నేనే వెనుకంజ వేస్తున్నాను" అని సంస్కృతంలో చెప్పాడు.

"అయినా సరే నేనీ ఆలయానికి ప్రధానోపాసకుడ్ని కాలేను" కేశవ్ నిశ్చయంగా చెప్పాడు.

తరువాత సాధువులెన్ని విధాలుగా చెప్పి చూచినా కేశవ్ అంగీకరించలేదు. సాధువులు మళ్ళీ ఒక సమావేశం ఏర్పాటు చేసుకుని మళ్ళీ కేశవ్ దగ్గరకు వచ్చారు.

"ఇది ఏడెనిమిది వేల ఏళ్ళనాటి పాత శివాలయం. ఇంకా తవ్వకం కూడా పూర్తి కాలేదు. కానీ రేపటి నుంచి మహా దేవుడి స్తుతి భజన కార్యక్రమాలు మొదలవుతాయి. ఎందరో భక్తులు వస్తారు. కాబట్టి మీరు ప్రధానోపాసకులుగా వుంటానికి ఇష్టపడకపోయినా కనీసం మాతో సహకరించండి" అని ప్రాధేయ పూర్వకంగా అడిగారు.

"ఎటువంటి సహకారాన్ని ఆశిస్తున్నారు మీరు?" కేశవ్ అడిగాడు.

"ఏమీ లేదు. ప్రాతఃకాలాన మీరు మేము చూపించిన చోట సమాధిలో కూర్చోవాలి. సమాధిలోంచి బయట కొచ్చాక సంస్కృతంలో తప్ప మరో భాషలో మాట్లాడకూడదు. తరువాత మందిర ప్రారంభోత్సవసమయంలో మేము మీ ముందుకొచ్చి ఒక ఉపన్యాసం చెప్పమని ప్రార్థిస్తాము. అప్పుడు మీరు మా ప్రార్థనను స్వీకరించి సంస్కృతంలో ఒక పెద్ద ఉపన్యాసం ఇవ్వండి చాలు" అన్నారు.

కొద్దిసేపు ఆలోచించి కేశవ్ అన్నాడు. "ఇందులో ఎలాంటి తప్పు ఉన్నట్టు నాకు కనిపించటం లేదు. మీరు చెప్పిందంతా చేస్తాను. కానీ రేపు నా పని అవగానే నాకు శెలవు ఇప్పించాలి" అన్నాడు

"అలాగే" స్వామీ భోలానాథ్ ఆనందంగా అన్నాడు.

* * *

రెండో రోజు ఉదయాన్నే సాధువులు కేశవ్‌ను ఆలయం లోపలికి తీసుకెళ్ళారు. అక్కడ కొన్ని తవ్వకం పూర్తికాని పాత సమాధులున్నాయి. అక్కడే శిథిలమైపోయి వున్న రెండు సమాధుల మధ్య కేశవ్‌ని సమాధిలో కూర్చోమని చెప్పారు. కేశవ్ వాళ్ళ కోరిక ప్రకారమే శ్వాస బిగపట్టుకుని రెండు సమాధుల మధ్య కూర్చుండిపోయాడు. అటు వెంటనే సాధువులు పెద్ద పెద్ద రాళ్ళు మోసుకొచ్చి రెండు సమాధుల మధ్య ఖాళీ భాగాన్ని మూసివేశారు. పైన సిమెంటు పూతవేసి కేశవ్‌ని అందులో ఖైదు చేశారు.

తరువాత ఆ సాధువుల గుంపు బిగ్గరగా భజన చేయనారంభించింది.





ఆలయం బయట శంఖానాదాలు మొదల య్యాయి. ప్రజలు పూజా సామగ్గ్రి పట్టుకుని తండోప తండాలుగా వచ్చి పడుతున్నారు. జనం బాగా గుమిగూడిన తరువాత స్వామి భోలానాథ్ ఒంటిమీద దేవుడు ఆవహించాడు. అతడు శివతాండవం చేసుకుంటూ మందిరాంతర్భాగాన వున్న పాత సమాధుల వైపు వెళ్ళ సాగాడు. అతడి వెనకే సాధువులు, భక్త జనులు వెన్నంటి నడుస్తున్నారు.

అందరూ సమాధుల దగ్గరకు నడిచారు. స్వామి భోలానాథ్ చేతిలో త్రిశూలం విసురుగా ఆడిస్తూ శివతాండవం చేస్తున్నాడు. అతడి నోటివెంట నురగలు వస్తున్నాయి. కళ్ళు పోను పోను ఎర్ర బారుతున్నాయి. అప్పుడు స్వామీ భోలానాథ్ పెద్ద గొంతుకతో అరుస్తూ అన్నాడు "ఈ సమాధిని పగులగొట్టండి.. ఈ సమాధిని పగులగొట్టండి...దర్శన సమయం ఆసన్నమైంది. విరిచేయండీ సమాధిని...గురు దర్శనం చేసుకోండి... గురు దర్శనం..."

కానీ అప్పటివరకు అక్కడి తవ్వకాలు ప్రభుత్వ పురాతత్త్వ శాఖ వారి ఆధ్వ ర్యంలో జరుగుతున్నాయి. మరి ప్రజలు సమాధి తామే ఎలా పగలగొట్టగలరు? కాబట్టి చాలామంది అలాగే చూస్తూ మిన్నకుండిపోయారు. కానీ అంతలోనే స్వామీ భోలానాథ్ పూనకం ఇంకా పెరిగింది. ఇంకా గట్టిగా కేకలు వేస్తూ చెప్పాడు "పగలగొట్టండి ..పగలగొట్టండి ఈ సమాధిలో ఎనిమిది వేల ఏళ్ళ క్రితం మా గురువు సమాధిలో కూర్చున్నారు. ఆయన ఈ సమాధిలోనే వున్నారు. ఈరోజు దర్శనం ఇస్తామని చెప్పారు.... పగలగొట్టండి సమాధిని...గురుదేవులు, మహాభక్తులు జయ శంకరనాధుల - దర్శనం చేసుకోండి."

"ఈ సాధువుకు మతి భ్రమించి నట్లుంది" ప్రజల్లోంచి ఒకడు అరిచాడు "ఇప్పుడు ఈ సమాధిలో ఎనిమిది వేల ఏళ్ళనాటి బొమికలు మాత్రమే దొరుకుతాయి."

"పగలగొట్టండి ... పగలగొట్టండి" స్వామీ భోలానాధ్ పూనకం ఇంకా తారస్థాయికి చేరుకుంది "గురుదేవులు జయశంకరనాధుల దర్శనం చేసుకోండి.. ఆయన ఎనిమిది వేల ఏళ్ళ నుంచి ఈ సమాధిలో తపస్సు చేసుకుంటున్నారు.."

"ఎవ్వరూ ఆ సమాధుల్ని తాకకండి" ఇద్దరు ముగ్గురు పిరికివాళ్ళు అరిచారు భయంగా.

"పగలగొట్టండి... పగలగొట్టండి... దర్శన సమయం ఆసన్నమైంది....జయ్ భోలానాధ్‌కీ...గురు దర్శనం చేసు కోండి"

జనంలో కలకలం చెలరేగింది. అందరూ ఇంకా దగ్గరగా వరుసు కుంటున్నారు, పడదోసుకుంటున్నారు. సాధువులు చిందులు వేస్తూ భజనలు చేస్తున్నారు. శంఖాలు నినదిస్తున్నాయి. ఢమురుకాలు మోగుతున్నాయి. త్రిశూలాల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి.

ఇంతలో ఎవరో సమాధి మీద గడ్డ పారతో ఒక్క పోటు పొడిచారు. మరొకడు రాళ్ళు ఎత్తటానికి బొచ్చె పట్టుకొచ్చాడు. నెమ్మది నెమ్మదిగా సమాధి త్రవ్వేస్తున్నారు, నెమ్మది నెమ్మదిగా సమాధి నుంచి కేశవ్ శరీరం బయట పడింది. కేశవ్ పద్మాసనం వేసుకుని, శ్వాస పైకి ఎగబీల్చుకుని కూర్చుని వున్నాడు. సజీవంగా - ఎంతో

సుందరంగా వెలుగు విరజిమ్ముతున్న శరీరంతో కూర్చుని వున్నాడు.

"జై శంకరా!...జై భోలానాధా!... జై మహాదేవా!"

"జై...జయశంకర గురుదేవులకీ"

ఎనిమిది వేల ఏళ్ళనాటి పాత సమాధి లోంచి ఒక సాధువు సజీవంగా బయట పడటం చూచి జనం ఆశ్చర్యంతో కళ్ళు చింపుకుని చూస్తూండిపోయారు. అనాయాసంగా అందరి నోటివెంట సంభ్రమాశ్చర్యాల కేకలు వెలువడ్డాయి. సాధువులు ఇంకా జోరుగా భజనలు చేస్తున్నారు. స్వామీ భోలానాధ్, మిగతా సాధువులంతా కేశవ్ ముందు సాష్టాంగ పడిపోయారు.

ఈ వార్త మొత్తం బోరీవిలీలో— బోరీవిలీనుంచి మొత్తం బొంబాయిలో కమ్ముకు పోయింది. ఇరవయ్యో శతాబ్దపు మానవ మస్తిష్కానికి ఇంతకంటే పెద్ద విచిత్రం ఇంకెక్కడ దొరుకుతుంది. వేలమంది జనం ఆలయాన్ని చుట్టుముట్టారు. ఇంకా ఇంకా వచ్చి పడుతున్నారు.

అందరూ కేశవ్‌ను పైకెత్తుకుని ఆలయం బయటకు తీసుకొచ్చారు. కేశవ్ ఇంకా శ్వాస ఎగబీల్చుకుని ధ్యానంలోనే నిమగ్నమై వున్నాడు. కానీ అతడి ముఖం కూడా కన్పించకుండా పూలహారాలతో కప్పివేశారు. ఈనాటి సమాధిలో కేశవ్ మూడు గంటలకు బదులు నాలుగు గంట లున్నాడు. ఐదో గంట మొదలైంది. కేశవ్ సమాధి చాలించి స్పృహలో కొచ్చాడు.

కేశవ్ కళ్ళు తెరుచుకున్న మరుక్షణమే జయజయ ధ్వానాలు మిన్నుముట్టాయి.

వేల సంఖ్యలో జనం ఆలయం ముందు సాష్టాంగపడిపోయారు. ఆలయం బయట జనం విసుగు విరామం లేకుండా వచ్చి చేరుతూనే వున్నారు. ఆలయం మెట్లమీద స్వీకర్లు అమర్చారు. స్వామీ భోలానాథ్ చేతులు జోడించుకుని కేశవ్ ముందు నిల బడి వున్నాడు.

"గురుదర్శనం అభిలషిస్తూ వచ్చిన భక్తులకు జ్ఞానమార్గాన్ని బోధించండి... భక్తులను తృప్తిపరచి మోక్షమార్గాన్ని ప్రసాదించండి" అని ప్రార్థిస్తూ కేశవ్ ముందు సాష్టాంగ పడిపోయాడు స్వామీ భోలానాథ్.

ముందుగా కేశవ్ మధుర స్వరంతో శివుడ్ని స్తుతించాడు. ఆ తరువాత ఉపన్యాసం మొదలైంది. మూడు గంటల పాటు స్వచ్ఛమైన సంస్కృతంలో ప్రవాహ వేగంతో ఉపన్యాసం నడిచింది. తియ్యటి శబ్దాల సముద్రం ఒక్కసారే ఉప్పొంగి ఉప్పెనలా జనులందరినీ చుట్టుముట్టింది. తుఫానులా, జ్వాలలా అందరూ చూస్తుండగా ఉపన్యాసం విశ్వరూపం ధరించింది. అక్కడి జనంతోపాటున్న మహా మహా సంస్కృత పండితులు, విద్వాంసులు, భాషా శాస్త్రజ్ఞులు ఆశ్చర్య చకితులై కూర్చుండి పోయారు.

ఉపన్యాసం ముగిసిన మరుక్షణమే ఒక మార్వాడీ సేఠ్ ఆలయ మరమ్మత్తు కోసం రెండు లక్షలు సమర్పించు కున్నాడు. స్వామీ భోలానాథ్ దగ్గర అప్పటికే యాభై అరవై వేల వరకు రొక్కం కానుకల రూపంలో పోగుపడి వుంది. మరో లక్ష రూపాయిల వాగ్దానాలు న్నాయి. అవేకాక కానుకలు, బహుమానాలు ఇంకా వస్తూనేవున్నాయి. ఇంకా వస్తాయి. క్షణాలమీద ఆలయం మహా




ప్యృతంగా తయారై పోతుంది- కేశవ్ ఇక ముందుకూడా వాళ్ళతో సహకరిస్తే!

* * *

రాత్రికి స్వామి భోలానాధ్ కేశవ్‌ని ఆలయం లోపలికి తీసుకెళ్ళి వివరించి చెప్పాడు "చూడండి! మీరు భవిష్యత్ జీవితంలో కోరుకుంటున్నవన్నీ భగవంతుడి దయవల్ల ఈ క్షణంలోనే మీ కాళ్ళ దగ్గరకు వస్తాయి. లక్షలకొద్దీ ధనం, పరువు, ప్రతిష్ట, హోదా, గౌరవం మరెవరికీ లభించజాలనివన్నీ ఏక కాలంలో మీకు లభిస్తాయి. జీవితాంతం సుఖంగా, శాంతిగా మీరిక్కడే విశ్రాంతి తీసుకోవచ్చు. ఆలయపు అధికారాలన్నీ మీ చేతుల్లో పెట్టుకోవచ్చు. ఒకవేళ మీకు ఇవన్నీ అవసరం లేకపోతే-కేవలం ప్రజల మేలు, భగవంతుడి మేలు చాలనుకుంటే దానికి మార్గాలున్నాయి. మీ కోసం సంస్కృత పాఠశాల కాదు కాలేజీ తెరపబడుతుంది.నిజం చెప్పాలంటే ప్రస్తుతందేశంలో మీ అంత సంస్కృత భాషా పాండిత్యం వున్నవాళ్ళు అసలు లేరు. నేనీ దేశాన్ని చుట్టి వచ్చినవాణ్ని. నిజం చెబుతున్నాను. మీకున్న ఈ జ్ఞానాన్ని ధర్మకార్యంగా భావించి బ్రాహ్మణులకు, ప్రజలకు పంచ వలసి వుంటుంది. అది మీ బాధ్యత. నేను రేపే మీ తరపున సంస్కృత కళాశాల తెరిపించమని కోరతాను. మీరు చూస్తూండగానే లక్షల రూపాయలు మీ కాళ్ళ దగ్గర రాసులుగా పడతాయి" అన్నాడు.

"కానీ ఇది మోసం... దగా" కేశవ్ అన్నాడు "నేను ఎనిమిది వేల ఏళ్ళ నాటి పాత యోగిని కాదు. అన్ని రోజులుగా తపస్సమాధిలో కూర్చునీ లేను. కాబట్టి ఇది అబద్ధం, పాపం అమాయక ప్రజలను ఆ విధమైన మూఢ నమ్మకాలకు గురి చేయటం నేరం అవుతుంది. ఈ సంగతి మీకూ తెలుసు నాకూ తెలుసు."

స్వామీ భోలానాధ్ అన్నాడు-"నిజమే ఒప్పుకుంటున్నాను. కానీ చూడండి. ఈ చిన్న తప్పును కప్పి వుచ్చటం వల్ల ఏమిటి జరిగింది? ఈ ఆలయం బాగుపడింది. ఇంకా బాగుపడుతుంది. ఇక్కడ ఒక సంస్కృత కళాశాల తెరపబడుతుంది. ప్రాచీన సంస్కృతి, సంస్కృత భాష మళ్ళీ ఒక వెలుగు వెలిగే అవకాశం ఏర్పడుతుంది. వేలమంది సాధువులను, భక్తులను పోషించే ఒక పెద్ద ధర్మశాల నిర్మింపబడుతుంది."

"కానీ వీటన్నిటి పునాది ఒకఅసత్యం మీద వున్నది" కేశవ్ అన్నాడు.

"ఆ అసత్యం ఒక పుణ్యకార్యాన్ని ముందుకు నడపగలిగినప్పుడు అది అసత్యం అవదు"

"నేను దీన్నిఒప్పుకోవటానికి సిద్ధంగా లేను"

"మీరు ఒప్పుకోవాల్సి వస్తుంది" స్వామీ భోలానాధ్ నిర్ణయాత్మకంగా అన్నాడు. "ఒకరోజులోనే మాఆట ఇంత ముందుకు పోగలిగింది కాబట్టి మీ మూర్ఖత్వ కారణాన మేము వెనుకంజ వేయటం అనేది జరగదు. మీరు ఈ ఆలయానికి ప్రధాన పూజారికాక తప్పదు"

"నేను ఎన్నటికీ పూజారిని అవను... కాలేను"

"మీరు అవక తప్పదు" స్వామీ భోలానాధ్ కర్కశంగా అన్నాడు.

"నేను ఈ క్షణమే ఇక్కడనుంచి వెళ్ళిపోతాను" కేశవ్ క్రోధంతో అరిచాడు.

స్వామీ భోలానాథ్ మాట్లాడలేదు. కేశవ్ మండిపడుతూ అక్కడ నుంచి లేచి బయటికెళ్ళామని పదడుగులు వేసి ఆగిపోయాడు. దారికడ్డంగా ఇద్దరు సాధువులు నిలబడి వున్నారు. కేశవ్ వాళ్ళి ద్దర్నీ కొట్టి పక్కకు పడదోసి ముందుకు నడిచాడు. కానీ ఈసారి పదిమంది సాధు వులు అతణ్ని చుట్టుముట్టారు. వాళ్ళం ద రి చేతుల్లో లావాటి కర్రలున్నాయి.

కేశవ్ వెను తిరిగి స్వామీ భోలా నాథ్ దగ్గరకు చేరుకున్నాడు. కోపంతో వివశుడైపోయి తలొంచుకు నిలబడి పోయాడు.

స్వామీభోలానాథ్ శాంతంగా అన్నాడు "రేపే మీరు ఆలయానికి ప్రధాన పూజారి కాబోతున్నారు"

కేశవ్ మాట్లాడలేదు. అతడి కళ్ళ ల్లోంచి కన్నీళ్ళు టపటప జారి పడు తున్నాయి. ఏడ్చుకుంటూ వెళ్ళి ఆలయ ద్వారం దగ్గర పడిపోయాడు. జీర బోయిన స్వరంలో "శివా... నువ్వు అన్నీ చూస్తూనే వున్నావు. అన్నీ నీకు తెలుసు. మరీ ఘోరం ఏమిటి? ఈ మోసాన్ని చూస్తూ మౌనంగా వుండి పోతున్నావా? అంతా నీ పేరు మీద జరిగి పోతుంటే కళ్ళు మూసుకుని కూర్చుండి పోయావా?" కేశవ్ విలపిస్తున్నాడు.

హటాత్తుగా ఆలయం గంటలు బిగ్గ రగా మ్రోగసాగాయి. సాధువులు గొంతెత్తి భజనగీతాలను ఆలపిస్తున్నారు. కేశవ్ విలాపం ఆ శబ్దంలో మునిగి పోయింది.

ఆ రాత్రి రెండు మూడుసార్లు కేశవ్ పారిపొయ్యే ప్రయత్నం చేశాడు. కానీ లాభం లేకుండా పోయింది. అతడి చుట్టూ సాధువులు దడి కట్టినట్టు నిలబడి కాపలా కాస్తున్నారు. వాళ్ళు అక్కడ వుండగా పారిపోవటం అసంభవం. చివరికి విసిగి వేసారి అలసిపోయి ఆలయ ద్వారం దగ్గర నేలమీద పడి కేశవ్ నిద్రపోయాడు.

ఇరవై అయిదు రోజులు గడిచి పోయాయి. కేశవ్ ఈలోగా చాలాసార్లు పారిపోదామనే ప్రయత్నించేడు. కానీ వీలుపడలేదు. సాధువులిప్పుడు అతణ్ని మందిరం దాటి బయటకు రానివ్వటం లేదు. అటు ఇద్దరు, ఇటు ఇద్దరు సాధువులు ఎప్పుడూ అతడికి రెండు వైపులా నిలబడి కాపలా కాస్తున్నారు. కేశవ్ దర్శనార్థం వచ్చిన జనానికి అతణ్ని దూరం నుంచే చూపించి పంపించేస్తున్నారు.

స్వామీ భోలానాథ్ కేశవ్‌కు ఒక గట్టి వార్నింగ్ కూడా ఇచ్చాడు. ఏరోజు నైనా వాళ్ళ రహస్యాన్ని జనం ముందు బయటపెట్టే ప్రయత్నం లాంటిది చేస్తే- ఆరాత్రే సాధువులందరూ కలిసి అతణ్ని సమాధిలో పాతేసి "గురుదేవులు జయ శంకరనాథులు తపస్సు చేసుకోవటానికి కైలాస పర్వతానికి పోయారు" అని చెప్పటానికి సిద్ధంగా వున్నారని చెప్పాడు దాంతో కేశవ్ చేసేదేమీ లేక మౌనంగా వుండిపోయాడు. అదీకాక స్వామీ భోలానాథ్ అన్నంతపని జరిపించే రకం. కేశవ్ అప్పటికి మౌనం వహించినా అంతరాంతరాల్లో పారిపోవటానికి పథకాలు ఆలోచిస్తూనే వున్నాడు.

చివరికి ఒక రోజు ఆలయం బయట మెట్లవరకు ఎలాగో తప్పించుకు రాగలి గాడు. కానీ అంతలో సాధువుల్లో కల కలం చెలరేగింది. అప్పుడే తెల్లార బోతోంది. అప్పటివరకు కేశవ్ చుట్టూ పహరా ఇచ్చిన సాధువులు అలసి సొలసి నిద్రలోకి జారుకున్నారు.. కానీ




ఐదుగురు మాత్రం మిగిలిని వుంటూన కేశవ్ దొరికిపోయాడు. ఐదుగురు సాధువులు అతణ్ని చుట్టు ముట్టారు. అందరి మధ్య నిలబడి కేశవ్ ఒంటరిగా పోరాడుతున్నాడు. ఎలా అయినా కేశవ్‌ను ఎత్తుకుని ఆలయం లోపలికి తీసుకెళ్ళాలని వాళ్ళు చూస్తున్నారు. ఎలా అయినా సరే తప్పించుకుపోదామని కేశవ్ తెగించి పోరాడుతున్నాడు. కేశవ్ వాళ్ళందరి కన్నా ఎత్తుగా బలిష్టంగా వున్నాడు కానీ ఒక్కడు, వాళ్ళు ఐదుగురు. కేశవ్ ఒకడి ముఖంమీద బలంగా ఒక్కదెబ్బ వేశాడు. మరొకడి పొట్టలో ఒక్కతాపు తన్నాడు. వాళ్ళిద్దరూ ఆ దెబ్బలధాటికి తట్టుకోలేక మెట్లమీద దొర్లుకుంటూ పోతున్నారు.

"శభాష్ వీరుడా?" మందిరం మెట్లకు చివరన వున్న రోడ్డుమీద నుంచి ఎవరిదో గొంతు వినిపించింది. పహిల్వానుల్లా వున్న ఇద్దరు వ్యక్తులు, లంగోటాలు చుట్టుకుని, బనీన్లు వేసుకుని నిలబడి చూస్తున్నారు. కేశవ్ వీరత్వం వాళ్ళకు చాలా నచ్చింది.

ఇంతలో ఆలయం లోపలి నుంచి మరి కొందరు సాధువులు పరుగెత్తుకు వస్తూ కనిపించారు. కేశవ్ అప్పటికే నలుగుర్ని చితకబాది కింద పడేశాడు. అప్పటికే దాదాపు అలసిపోయాడు. తన వయిపు వస్తున్న సాధువుల గుంపును చూచి కేశవ్ కేకలు వేశాడు-

"రక్షించండి...నన్ను రక్షించండి"

కేశవ్ కేకలు విని అప్పటివరకు కింద నిలబడి చూస్తున్న పహిల్వాను లాంటి వ్యక్తులు పరుగెత్తుకు వచ్చారు. వాళ్ళు అక్కడకు చేరిన రెండు నిమిషాల్లో పదిమంది సాధువుల్ని పట్టి కరిపించేశారు. మరు నిమిషంలో కేశవ్‌ని తీసుకుని మెట్లు దిగుతున్నారు. అంతలో కేశవ్ మళ్ళీ అరిచాడు-

"పారిపోదాం పదండి ... త్వరగా త్వరగా ... ఆలయంలోంచి సాధువులొస్తున్నారు. పట్టుకుంటారు. పదండి"

"మరేం పర్వాలేదు. నెమ్మదిగా నడు వీరుడా! యాభై అరవై మందికి మేమిద్దరం అన్నదమ్ములం సరిపోతాం ... భయపడకు" అన్నారు వాళ్ళిద్దరు. "మీరెవరు?" సమయానికి వచ్చి తనను కాపాడినవారిద్దరి వైపు కృతజ్ఞతగా చూస్తూ అడిగాడు కేశవ్.

"మేమిద్దరం పహిల్వానులం. ఈయన నా అన్న మార్ఘూ, నేను ఆయన తమ్ముణ్ని. నా పేరు గామా. మేమిద్దరం అటు పటేల్ స్టేడియంలో ఫ్రీస్టయిల్ కుస్తీ ప్రదర్శనలు ఇస్తుంటాం"

"ఫ్రీస్టయిల్ కుస్తీ అంటే ఏమిటి?" కేశవ్ అడిగాడు.

"నీకు చూపిస్తాం" మార్ఘూ ప్రసన్నంగా అన్నాడు "నేను మొదట నిన్ను చూడగానే నా పహిల్వాను తమ్ముడివనిపించావు. ఎక్కడ సంపాదించావో గానీ నీ శరీరం చాలా అద్భుతంగా వుంది. కాళ్ళూ, చేతులు చాలా పుష్టిగా, పటిష్టంగా వున్నాయి. ఛాతీ చాలా విశాలంగా బలంగా కనిపిస్తోంది. నువ్వు పస్తాదువు కావాల్సిన వాడివి. అవ్వాలి మరి..."

అంతవరకు చెప్పి మార్ఘు కేశవ్ ఛాతీ మీద బలంగా ఒక్క దెబ్బ వేశాడు. ఆ ముష్టిఘాతానికి కేశవ్ లుంగలు చుట్టుకుని కింద పడిపోయాడు. అతణ్ని చూచి అన్నదమ్ములిద్దరూ చప్పట్లు కొడుతూ నవ్వుతున్నారు.

"వీడొట్టి విగ్రహం పుష్టిగాడిలా వున్నాడు" అన్నాడు గామా.



"నీ ఒళ్ళు పైకి టమాటా పండులా ఎర్రగా పుచ్చి వుంది. లోపలంతా గుల్ల. విగ్రహం పుష్టి నైవేద్యం నష్టి అన్నారు పెద్దలు... లే...పరుగెత్తు" అన్నాడు మారుతూ.

కేశవ్ లేచి పరుగెత్తుతున్నాడు. ఇద్దరు అన్నదమ్ములూ వెనకనుంచి కేకేస్తున్నారు "ఒరేయ్ నీ తంబురా కూడా పట్టుకెళ్ళు.. దేవుళ్ళ భజన చేసుకో"

కేశవ్ భయపడుతూ, భయపడుతూనే వాళ్ళ దగ్గరకు వచ్చి వీణను అందుకుని పరుగులంకించుకున్నాడు. ఒకటే పరుగు. మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు.



## 9

ఆ రోజు ఎనిమిదివేల ఏళ్ళనాటి యోగి ఫోటో దినపత్రికలో అచ్చయింది. రంభ వెంటనే గుర్తు పట్టేసింది. ఆ సాయంత్రం మదన్ ఆ విషయం ప్రస్తావించినప్పుడు అంది-

"అవును నేనూ చూశాను పొద్దుటి దినపత్రికలో"

"కానీ అతడి ముఖం చూస్తే మోసగాడిలా కన్పించడు" మదన్ అన్నాడు.

"ఎప్పుడూ ఈ మొహాల్ని చూసే మోసపోతుంటారు అందరూ. అలా అనుకుంటే నీ మొహం చూస్తే పెద్ద ఫ్రాడ్ మనిషిలా కన్పిస్తావు. కానీ నిజానికి కావు" రంభ నవ్వుతూ అంది.

"థాంక్యూ"

"అవసరం అన్నీ చేయిస్తుంది. పాపం పూర్ ఫెలో. నన్ను పెళ్ళి చేసుకోవాలనే వ్యామోహంతో డబ్బు సంపాదించటానికి వెళ్ళాడు" అంది రంభ.

మదన్ తలపంకిస్తూ అన్నాడు- "అయితే ఇకనేం మంచి సులువైన మార్గాన్నే ఎన్నుకున్నాడు. ఆలయ వ్యాపారం బాగానే సాగుతుంది. సరిగ్గా సాగింపంటే ఏనాటికో ఫ్యాక్టరీ కట్టుకోవచ్చు. మరో మంచి విషయం ఏమిటంటే ఈ ఆదాయానికి ఇన్‌కం టాక్స్ పడదు"

"చూడబోతే నువ్వూ ఓ ఆలయం తెరిచేట్టున్నావ్" రంభ అడిగింది.

"ఈ ప్రొఫెసర్ ఉద్యోగం కన్నా ఆ పూజారి ఉద్యోగమే చాలా మంచిది. పుణ్యం,పురుషార్థం రెండూ కలిసొస్తాయి" మదన్ నవ్వి అన్నాడు-

"అయితే నేను ఆలయమే గనుక తెరిస్తే దేవుణ్ణి కాదు. ఒక దేవిని పూజిస్తాను"

"అలాగా! నీ కొత్త ప్రేయసి శైలి సంగతేమైంది" రంభ స్వరంలో కాస్త కోపం తొంగి చూసింది.

"ఖుద్నియా అన్న కరీం ఇక్కడకు వచ్చి వున్నాడన్న నాకు మొన్న మధ్యాహ్నం తెలిసింది. ఎలా వున్నాడు?" మదన్ జవాబుగా అడిగాడు.

రంభ ప్రస్తుతం కరీంతో ప్రేమ కలాపాలు సాగిస్తోందని మదన్‌కు తెలుసు. కరీం ఆక్స్‌ఫర్డ్‌లో క్రికెట్ కెప్టెన్. యువకుడు. అందగాడు. అతడి మోహ జ్వరం ప్రస్తుతం రంభను గట్టిగా పట్టుకుని వుంది. కొన్ని రోజులుగా క్లబ్బుల్లో, స్విమ్మింగ్ పూల్ దగ్గరా, పార్కుల్లో, సినిమా హాళ్ళ దగ్గర,

ఎక్కడ చూసినా రంభ కరీం పక్కనే కనిపిస్తోంది. కరీం చుట్టూ తిరుగుతోంది. మదన్ ప్రశ్న విని రంభ మౌనంగా కూర్చుండిపోయింది.

"నువ్వు కరీంని పెళ్ళి చేసుకోబోతున్నావని, ఆ మధ్య ఖుద్సియా తన ఫ్రెండ్స్‌తో చెబుతుంటగా విన్నాను నేను" రంభ మౌనాన్ని చూసి, మదన్ మళ్ళీ అడిగాడు.

రంభ ఒక్కసారిగా మండిపడింది. "నేను పెళ్ళి ఎప్పుడు ఎవర్ని చేసుకుంటానన్నది నా ఇష్టమ్మీద ఆధారపడి వుంటుంది. అది నా స్వంత వ్యవహారం. అందులో జోక్యం చేసుకునే అధికారం ఎవరికీ లేదు. కానీ మిస్టర్ మదన్! నీకో విషయాన్ని చెప్పదలుచుకున్నాను—నేను కరీంని ఎన్నటికీ పెళ్ళి చేసుకోను, చేసుకోలేను'' రంభ తీవ్రంగా అంది.

"ఎందుకని? కరీంలో లోపమేముంది?" మదన్ అన్నాడు— "కుర్రవాడు, యవ్వనవంతుడు, శ్రీమంతుడు, అందగాడు. నీకు కులాల పట్టింపు ఎట్లాగూ లేదు. మరింక అభ్యంతరం దేనికి?"

"ఇది అక్బరు కాలమైతే నేను కరీంను తప్పకుండా పెళ్ళి చేసుకునే వుండేదాన్ని. అక్బర్ నుంచి ఔరంగజేబు వరకున్న కాలమైనా నాకు అభ్యంతరం వుండదు. పెళ్ళి చేసుకుని తీరేదాన్ని. కానీ ఔరంగజేబు తరువాత ఇండియాలో కుదరదు. ఇరాక్ అయితే చేసుకుంటాను. మరే అరబ్ కంట్రీ అయినా పర్వాలేదు. కానీ ఇక్కడ కరీంను పెళ్ళి చేసుకుని ఈ దేశంలో సెకండ్‌క్లాస్ పౌరురాల్నిగా నేను ఎన్నటికీ వుండను. డామినేషన్ లేని బతుకు బతకను."

"సెకెండ్ క్లాస్ పౌరులు అంటే నీ నిర్వచనం?"

"అల్పసంఖ్యాకులు మిస్టర్ మదన్! అల్పసంఖ్యాకులు! నువ్వెప్పుడూ అల్ప సంఖ్యాకుల మధ్య జీవించి వుండవు. లేకుంటే ఆ భయంకర ఏకాకితనం నీ అనుభవానికొచ్చి వుండేది. అందుకని అల్పసంఖ్యాకుల్లో వాళ్ళనీ, బలహీన వర్గాల్లో వాళ్ళనీ భర్తలుగా ఎన్నటికీ ఎన్నుకోకూడదు"

"ఈ మూర్ఖ నగరంలో నన్ను నేను అల్పసంఖ్యాకుల వర్గానికి చెందిన వాడిగానే భావించుకుంటున్నాను" మదన్ నవ్వి అన్నాడు.

"సమస్యను దాటి మళ్ళించే ప్రయత్నం చేయకుండా కాస్త సీరియస్‌గా ఆలోచించు. జనం ముందు అనేకానేక సమస్యలుండే చోట అధిక సంఖ్యాకులు ఎన్నటికీ అల్ప సంఖ్యాకులకు న్యాయం జరుగనివ్వరు. హిందువులు ముస్లింలకు, ముస్లింలు యూదులకు, యూదులు క్రిష్టియన్లకు, క్రిష్టియన్లు హబ్సీలకు ఎన్నడూ న్యాయం చేకూర్చలేదు. చేకూర్చనివ్వరు. అవకాశాలు వాళ్ళవరకు పోనివ్వరు. ఇప్పటికీ మనిషి తన అధిక సంఖ్యాక బలాన్ని ఆధారం చేసుకుని, అల్ప సంఖ్యాకులను ఇంకా ఇంకా అణగదొక్కాలనే చూస్తున్నాడు" అంది రంభ.

"అయిందా నీ తప్పుడు ప్రతిపాదన" మదన్ అన్నాడు-

"నువ్వెప్పుడూ ఫ్రాయిడ్‌నీ, చరిత్రనే కాదు, మిగతా సమస్త విషయాలనూ కలగాపులగం చేసేసి భ్రష్టుపట్టించేసావు. అవగాహనా లోపంవల్ల నీ ఆలోచనలన్నింటినీ నీ ఇష్టం వచ్చినట్లు ఆపాదించేసావు?"

"ఇందులో తప్పుడు అవగాహన



ఏముంది?" రంభ ఉలికిపాటుతో అడిగింది.

"అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకులకు న్యాయం చేకూర్చటం లేదన్నది కాదు అసలు సమస్య" మదన్ అన్నాడు-

"అసలు సమస్య ఏమిటంటే అల్ప సంఖ్యాకులే ఎప్పుడూ అధిక సంఖ్యాకులకు న్యాయం చేకూర్చలేదు- అదీ నిజమైన సమస్య."

"నువ్వు అంతా తలకిందులు చేసి మాట్లాడుతున్నావు" రంభ ఆశ్చర్యంగా అంది.

"నేనేమీ తలకిందులుగా మాట్లాడటం లేదు. తిన్నగానే మాట్లాడుతున్నాను. తిన్న



నైన విషయం ఏమిటో చెబుతాను విను" మదన్ చెప్పసాగాడు-

"సంఘ పరంపర ఎప్పుడు విచ్ఛేదమై పోయిందో అప్పటినుంచే అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకులను శాసిస్తూ వచ్చారు. ఒకప్పుడు మనుషులు చిన్న చిన్న సముదాయాలుగా కలసి కట్టుగా వుండేవారు. ఆ యుగంలో మాత్రమే నిజమైన ప్రజాస్వామ్యం, నిజమైన అధికారాలు, మానవత్వం, పరిపూర్ణంగా నిండిన విలువలు వుండేవి. బాధ్యతలు వుండేవి. అప్పుడు సముదాయంలోని ప్రతి ఒక్కరికీ సమానమైన జీవనావకాశాలు, న్యాయం లభించేది. ఆనాడు అధిక సంఖ్యాకుల చేతుల్లో అధికారాలున్నాయి. కానీ ఈ చిన్ని చిన్ని ప్రపంచాలన్నీ ఒక పెద్ద ప్రపంచాన్ని నిర్మించటానికి ముందుకు రావటంతో-ఆ చిన్ని చిన్ని ప్రపంచాలన్నీ విచ్ఛేదమైపోయాయి. వాటితోపాటే వాటితాలూకు అందమైన, నిజమైన విలువలు నాశనం అయిపోయాయి. సామంతరాజుల యుగంనుంచీ నేటివరకు జరిగింది ఇదే. ఆనాటి సామంతులు మొదలుకొని నేటి పెట్టుబడిదారీ సమాజం వరకు చూస్తే జీవన విలువలన్నీ తారుమారు అయి

పోయాయి. జీవితం చాలా సంక్లిష్టంగా తయారైంది. సమస్యలు అధికమై పోయాయి. అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకులమీద అధికారం చెలాయిస్తున్నారు. ఆనాడు అధిక సంఖ్యాకులు పోగొట్టుకున్న అధికారాన్ని ఈనాటివరకు పొందలేకపోయారు."

"నువ్వు ఆర్థికపరంగా, నేను ధార్మిక పరంగా మాట్లాడినట్టున్నాం"రంభ అంది.

"మళ్ళీ అసలు విషయాన్ని మర్చిపోతున్నావు. ఏ పరంగా మాట్లాడినా అందరినీ పీడించేది ఆర్థిక సమస్యే. అది తీరితే అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులంటూ రెండు వర్గాలుండవు. అంతా ఒకటే! నీ పాత ఆలోచనా ధోరణిని విడిచి పెడితే నేను చెప్పింది నీకు అర్థమవుతుంది" అన్నాడు మదన్.

"ఒహ్హో బోర్ కొట్టించేస్తున్నావు కదా! ఎంతటి శుష్కవాదాన్ని లేవదీశావు?" అంది రంభ విసుక్కుంటూ.

"వివాదం లేవదీసింది నువ్వు."

"కానీ నేనేదో కరీంమీద జాలి చూపిద్దామని ఏదో మాట్లాడాను. నువ్వు దాన్ని వేదాంత స్థాయికి తీసుకెళ్ళావు. అసలు విషయం ఏమిటంటే కరీం అంటే నాకు మోజుంది. ఇష్టముంది. అయితే అతని శరీరం ఒక నవయువకుడిదే కానీ, అతడి మస్తిష్కం ఒక చిన్న పిల్లాడిది. నేను చిన్నపిల్లాడిని ఎలా పెళ్లి చేసుకోగలను. ఏదో వినోదానికి సర్దాగా నాలుగురోజులు అతడితో కలసి తిరిగితే ఏమవుతుంది? తప్పేముంది?" అంది రంభ తన ధోరణిలో.

"నేను చట్టబద్ధంగా,సామాజికపరంగా, న్యాయ సమ్మతంగా మాట్లాడుతున్నాను. ఆ ప్రకారం నువ్వు చేస్తున్నది తప్పు" మదన్ అన్నాడు "ఒక కన్యకు సామాజిక పరంగా ఎందరితో తిరిగే అనుమతి వుంది? ఒక్కడితో. కానీ నీ లెక్కన పదులు, పాతికలు, వందలు, వేల మందితో ఒక నిర్ధారణలేకుండా తిరగనిస్తే బావుంటుంది అన్నట్టుంది"

"అయితే నువ్వు నన్ను అప్రతిష్ట పాలు చేయాలని చూస్తున్నావన్నమాట?" రుద్ధమైన స్వరంతో అంది రంభ.

"అదెలా?" మదన్ విస్మయంగా అడిగాడు.

"నేను కన్యను కాదు" అని రంభ బిగరగా నవ్వసాగింది. మదన్ ఖంగు తినేశాడు. కానీ అది పరిహాసానికి అని వుంటుందని తనూ నవ్వేశాడు.

రంభ నవ్వినవ్వి ఒక్కసారిగా ఆగిపోయి మదన్ వైపు చూస్తూ అడిగింది- "కైరీతో నీ స్నేహం ఎందాకా వెళ్ళింది?"

"విచిత్రమేమిటంటే మా స్నేహానికి ఒక మజిలీ అంటూ ఇంతవరకు దొరకలేదు. కైరీ ఏమంటుందంటే 'నేను కేశవ్‌ను మర్చిపోయేప్రయత్నంలో వుంటే, నువ్వు రంభను ఎగ్గొదోయాలని చూస్తున్నావు. మనది మిత్రత్వం కాదు శత్రుత్వం. ఇద్దరు శత్రువుల మధ్య సంధి ప్రయత్నం'" చెప్పాడు మదన్.

"తరువాత" రంభ అడిగింది.

"నాకు సంధి ప్రయత్నాలంటే గిట్టని, నేను వాటికి శత్రువునని నీకు తెలుసు కదా'' మదన్ నెమ్మదిగాచెప్పేసి రంభ కళ్ళల్లోకి చూస్తూండిపోయాడు.

ఏదో ధ్యానంలో మునిగివున్న రంభ ముఖం నెమ్మదిగా వికసించింది. స్పష్టంగా మారి ప్రసన్నత చోటుచేసుకుంది. నిశ్చింతలతో నిండిన ఒక చిరునవ్వు





పెదవుల మీద నాట్యం చేసింది.

మదన్ వివశుడై పోతూ రంభని కౌగిట్లోకి తీసుకుని అడిగాడు–

"కేశవ్ మీద ఎంత ప్రేముంది నీకు?

"చెప్పలేను. అతడి ముఖం చూస్తే దేవతలా వుంటాడు. మనసు చూస్తే పసివాడిలా వుంటాడు. చిలిపితనం, అల్లరినిండిన అతడి సొదా వ్యక్తిత్వం చాలా ఆకర్షణీయంగా వుంటుంది. అతడి ఆత్మ ఉన్నతిని చూస్తే అతడు ఈ ప్రపంచానికే చెందినవాడు కాదనిపిస్తుంది చూడు. అతడు సంపాదించుకుని వస్తానని వెళ్ళాడు కదా? ఒకవేళ సంపాదించలేకపోతే మళ్ళీ జీవితంలో తన ముఖం నాకు చూపించడు. అంతటి అభిమానవంతుడు. కానీ ఎప్పుడూ నన్ను పొందాలనే ప్రయత్నంలోనే నిమగ్నమైవుంటాడు. దేనికైనా సిద్ధపడతాడు. అలాంటి మూర్ఖత్వం కూడా ఎంత బావుంటుందీ!" అంది రంభ.

"నువ్వు ఏ దశ వరకు అతడితో గడిపావు?" మదన్ అడిగాడు.

"ఒక్కసారి నా పెదవులు అతడికందించాను" రంభ స్వప్నంలోంచి కలవరిస్తున్నట్టు అంది.

రంభ ఒక వైపు మదన్ కౌగిట్లో ఒదిగిపోయివుంది. మరో వైపున కేశవ్ గురించి ఆలోచిస్తోంది. ఇద్దరి కౌగిళ్ళలో కాక రెండు స్తంభాల మధ్య స్వతంత్రంగా నిలబడివున్నట్టనిపిస్తోంది.

"ఒక్కసారి నా పెదవులు అతడికి అందించాను. కాని మనసులో ఆ వలపు మంజీరాలు మ్రోగలేదు. ప్రతీ యువతీ ఆ మంజీరాలు మోగాలని ఆశిస్తుంది. ఆ మంజీరాలు ఇద్దరి మధ్య నిజమైన ప్రేమ వున్నప్పుడు మాత్రమే ఘలంఘలిస్తాయి ఘనంగా మ్రోగుతాయి"

"నేనూ ఆ మంజీరాలను ఒకసారి మ్రోగించి చూడనా?"

మదన్ రంభ పెదవుల మీదకు వంగుతూ అన్నాడు. కానీ చటుక్కున అతడి కౌగిట్లో నుంచి తప్పించుకుని రంభ అంది–

"కాస్త స్పృహలో వుండు. నేను పదిమందితో చెట్టాపట్టాలేసుకుని తిరుగుతాను కాని నీతో కాదు"

"ఎందుకని?" మదన్ అడిగాడు.

కానీ రంభ ఏ సమాధానం చెప్పలేదు. ఎందుకనో తెలియదు. రంభ ఏ సమాధానమూ చెప్పకపోవటమే మదన్‌కు ఆనందంగా వుందనిపించింది,




ఉదాసీనతల ఊరేగింపుల్లాంటి ఉషయాలు...ముసలి దొమికల్లా మృత్యు నిరీక్షణలో గడిపే రాత్రులు...అడుగడుక్కీ కాటేసే కర్కశనగరపు క్రూరమైన రహదార్లు. అయినా నడవవలసే వస్తోంది. ఆ నగరంలో జీవించవలసే వస్తోంది. మలుపు మలుపులో కాంక్షల ఆశల దీపాలు వెలుగుతూ కనిపించేవి, ఊరిస్తూ పిలిచేవి. అందాకపోతే అలసిన అడుగుజాడల ధ్వని విని ఆగిపోయేవి. ఆశ ఒక చంచల వేశ్య. జీవితం ఒక గుడ్డివాడి కల.

బొంబాయి నగరం కేశవ్ మీద తన

పగతీర్చుకుంది. అతడి బుగ్గలమీది బంగారు పూలను తెంచేసుకుంది. అతడ్ని అరెస్ట్ చేయించింది. అతన్ని యాచనకు దించింది అతడి ఆత్మాభిమానాన్ని అనాదరించి, అవమానపరచి ముక్కలు ముక్కలు చేసింది. కేశవ్ కష్టాల కల్లోలిత సాగరంలో కొట్టుమిట్టాడుతున్నప్పుడు తివారీ అతడ్ని ఆదరించాడు. తన గదిలో వుండమని ఆశ్రయం కల్పించాడు. తివారి కేశవ్ దగ్గర వీణ నేర్చుకునేవాడు. ప్రతిఫలంగా భోజనం, దుస్తులు ఇచ్చేవాడు. కేశవ్ అలాగే పడివుంటున్నాడు. నగరం కేశవ్‌ని తిరస్కరించి, బహిష్కరించి చెత్తకుప్ప మీదకు విసిరి వేసింది.

కాని కేశవ్ తన పట్టుదల, పట్టును సడలింపలేదు. అతడి ఆశయ తీవ్రత అణుపంతైనా క్షీణించలేదు. ఎదుస దెబ్బలు తిన్నకొద్దీ, సమస్యలకు, కష్టాలకు ఎదురీదిన కొద్దీ మరికాస్త గట్టిపడింది.

తివారీ రోజూ ఉదయాన్నే రెండు గంటలసేపు వీణ నేర్చుకునేవాడు. ఉదయం పది పదకొండింటికల్లా గదిలోంచి వెళ్ళిపోయేవాడు. మళ్ళీ రాత్రి ఏ పన్నెండింటికో తిరిగి వచ్చేవాడు. అప్పుడప్పుడు కేశవ్‌కు అనిపించేది. తివారీ వీణ నేర్చుకోవటం కోసం కాక, తనకు సహాయం చేయటం కోసం నేర్చుకుంటున్నాడు అనిపించేది. కొద్దికాలం గడిచాక హటాతుగా తివారీ రోజుకు నాలుగు గంటలసేపు వీణ నేర్చుకోసాగాడు. తరువాత రోజుకు ఎనిమిది గంటలు...తరువాత రోజల్లా వీణ దగ్గర కూర్చుని ప్రాక్టీస్ చేయసాగాడు. కేశవ్ ఆశ్చర్యపోయాడు. ఎంత నేర్చుకున్నా తివారీకు రాగాల రహస్యం బోధపడలేదు. చివరికి విసిగిపోయి తన ఓటమిని అంగీకరిస్తూ అన్నాడు– "ఒక అమ్మాయి వుంది?"

"ఊఁ" కేశవ్ అన్నాడు.

"అవును ఒక అమ్మాయి వుంది" తివారీ మళ్ళీ రిపీట్ చేశాడు. "ఆమె ఒక పెద్ద సేట్ దగ్గర వుంటోంది"

"తరువాత?"

"ఆ సేటు పెద్ద శ్రీమంతుడు. ఆ అమ్మాయికి అడిగినంత డబ్బు ఇస్తాడు. ఆ అమ్మాయిని ఎప్పుడూ సంతోషంతో వుంచుతాడు. చాలా అందంగా వుంటుందా అమ్మాయి. ఆమెకు వీణ నేర్పితే నాకు నెలకు మూడు వందలు ఇస్తుంది''

"తరువాత?"

"తరువాత ....ఇప్పుడు అవి నాకు దొరకవు. ఇప్పుడు నిన్ను ఆ అమ్మాయి దగ్గరకు తీసుకెళ్తాను. కానీ వాటిల్లోంచి నూటయాభై ప్రతినెలా నాకిచ్చెయ్యాలి"

"ఇస్తాను"

"బావుంది. రేపే నిన్ను అక్కడకు తీసుకెళ్తాను"

* * *

రెండోరోజు తివారీ కేశవ్‌ను మలబార్ హిల్ మీదకు తీసుకెళ్ళాడు. హిల్‌మీద చాలా బిల్డింగులున్నాయి. ఒక బిల్డింగ్ అన్నిటికన్నా కాస్త ఎడంగా కట్టబడి వుంది. తివారి కేశవ్‌ను లిఫ్ట్‌మీద అన్నింటికన్నా చివరిఅంతస్తుమీదకు తీసుకెళ్ళాడు. లిఫ్ట్‌బాయ్ తివారీని చూచి లోలోపల నవ్వుకున్నాడు. అతడి నవ్వుకు అర్థం కేశవ్‌కు ఇట్టే అర్థమైంది. తివారీ నల్లతుమ్మ మొద్దులా వుంటాడు. పైగా అప్పుడే ఆముదంలో స్నానం చేసి వచ్చినట్లు నున్నగా నిగనిగలాడుతుంటాడు. అతడి ఆకారాన్ని చూచిన వారికి ఎవరికైనా ఒక్కక్షణం నవ్వు





వస్తుంది.

పధ్నాలుగో అంతస్తులో ఏదో ఫ్లాట్ ముందు నిలబడి కాలింగ్ బెల్ నొక్కాడు తివారి. తలుపు తెరుచుకుంది. పువ్వుల ఫ్రాకు వేసుకుని వున్న ఓ యూదుల అమ్మాయి లోపలనుంచి తొంగి చూచి ఇద్దరినీ లోపలకు రమ్మని ఆహ్వానించింది.

కేశవ్, తివారీ ఇద్దరూ లోపలికి నడిచారు.

ఒక బారాటి కారిడార్...దానికి రెండు వైపులా తలుపులు తెరుచుకుని వున్నాయి. రెండు గజాలకో టీపాయ్ చొప్పున పెట్టి, వాటి మీద రకరకాల పూలతో నిండి వున్న ఫ్లవర్‌వాజ్ లున్నాయి. గోడల మీద చాలాచోట్ల అద్దాలు బిగించి వున్నాయి. చుట్టూ అతి చిన్న వెలుగును ప్రసరింపజేసే రకరకాల విద్యుద్దీపాలు అమర్చి వున్నాయి.

తరువాత ఇద్దరు బాదంకాయ రంగు గోడలున్న గదిలోకి అడుగు పెట్టారు. గదిలో నీలిరంగు ముఖమల్ సోఫాలు వేసి వున్నాయి. చుట్టూ ఖరీదైన పువ్వుల పర్దాలు వ్రేలాడుతున్నాయి. గదిమధ్యలో చిన్న ఫౌంటెన్ వుంది. అది రెండు పల్చటి నీటిధారలను పైకి ఎగజిమ్ము తోంది. మరి కాస్త దగ్గరకెళ్ళి చూస్తే తెలిసింది. నిజానికది ఫౌంటెన్ కాదు. అదొక అర్ధనగ్నంగా వున్న స్త్రీ ప్రతిమ. ఆ ప్రతిమ స్తనాల్లోంచి పాలరంగులో వున్న నీళ్ళు ధారగా పైకి ఎగజిమ్మబడు తున్నాయి.

ఆ ఫౌంటెన్ పక్కనే ఒక అందమైన స్టాండుకు ఒక పంజరం వ్రేలాడుతోంది. ఆ స్టాండు పక్కనే ఒక యువతి నిలబడి పంజరంలో వున్న చిలకలకు జీడిపప్పులు తినిపిస్తోంది. ఆ అమ్మాయిని చూడగానే తివారి ఒంగి నమస్కరించాడు. అప్పుడు తివారీ వృత్తి ఏమిటో కేశవ్‌కు అర్థమై పోయింది. ఆ అమ్మాయి వీరిద్దరివైపు చూడ కుండానే తివారీని బయటకు వెళ్ళిపొమ్మని చేత్తో సంజ్ఞ చేసింది. దాంతో తివారీకు ఆ ఇంట్లో స్థానమేమిటో కూడా కేశవ్‌కు అర్థమైంది.

ఆమె చేసిన సంజ్ఞ తివారీకు అర్థం కాలేదు. అలాగే తల వంచుకుని నిల బడి "అమ్మగారూ! ఒక గొప్ప వైణి కుణ్ణి తీసుకొచ్చాను. ఇలాంటి వైణికుడు మొత్తం భారతదేశంలోనే ఉండడు" అని వినయంగా చెప్పాడు.

ఆ యువతి కేశవ్ వైపుకు తిరిగింది. కేశవ్‌ని ఒక్క క్షణకాలం తీక్షణమైన దృష్టితో చూచి చాలా కఠినమైన స్వరంలో తివారీతో అంది "ఇక నువ్వు వెళ్ళు. వీరితో నేను మాట్లాడతాను"

తివారీ వెళ్ళిపోయాడు. చాలా సేపు గడిచిపోయింది. కానీ ఆ అమ్మాయి కేశవ్‌తో ఏ మాట మాట్లాడకుండా చిలకకు జీడిపప్పు తినిపిస్తూ నిలబడి పోయింది. చివరకి కేశవ్‌తో అంది— "వచ్చి ఈ సోఫాలో కూర్చోండి"

ఆమె స్వరంలో ఒక చిరు కంపన నిండివుంది. ఆ స్వరం ఎక్కడో విన్నట్టనిపించింది.

"శోభా నువ్వా?" కేశవ్ ఆ యువతిని గుర్తించి ఆశ్చర్యంగా అడిగాడు "నువ్విక్కడేం చేస్తున్నావు? ఇంతమంచి స్థానంలో వున్నావు? పెళ్ళిచేసుకున్నావా?"

ఆ యువతి పూర్తిగా కేశవ్ వైపుకు తిరిగింది. కేశవ్ దగ్గరకు వచ్చి అంది "అన్ని ప్రశ్నలు మీరు ఒక్కసారిగా వేస్తే జవాబు ఎలా చెప్పగలను? ఏం

చేస్తున్నానంటారా? అదే చేస్తున్నాను. మొదట చేసిన పనే"

"అంటే...?"

"నా శరీరాన్ని అమ్ముకుంటున్నాను. ఒక ఖరీదైన మనిషికి ఈ శరీరాన్ని తాకట్టు పెట్టి ఈఖరీదైన ఎత్తైన ప్రదేశంలో వుంటున్నాను. ఈ బొంబాయి నగరంలో సుఖంగా వుండే పద్ధతి నేర్పాడతను. ఒక బజారు వేశ్య దగ్గర ఏ యవ్వనం అయితే వుంటుందో, సరిగ్గా అలాంటి యవ్వనమే ఈ మల్ బార్ హిల్ మీద వుండే ఉంపుడుకత్తెల దగ్గర వుంటుంది. కేవలం అమ్మే విధానంలో తేడా... అంతే. మీ రెండు ప్రశ్నలకు జవాబు చెప్పేశాను. ఇకపోతే మూడో ప్రశ్న పెళ్ళి చేసుకున్నావా?- ఈ ప్రశ్నకు ఏం జవాబు చెప్పగలను. ఒకవేళ చెప్పినా మీతోనే ఎలా చెప్పగలను నా పెళ్ళి జరిగింది మీతోనే..."

కేశవ్ ఒక్క అడుగు వెనక్కి వేశాడు-"అది పెళ్లి కాదు శోభా!"

"మీ దృష్టిలో కాకపోవచ్చు" శోభ చాలా శాంతంగా అంది "నా దృష్టిలో అయింది. అయిపోయింది. అన్నీ పోగొట్టుకున్న నేను మీ జ్ఞాపకాలను ఇంకా పారేసుకోలేక పోతున్నాను. నేను వీణ నేర్చుకోవాలని కాదు చూస్తున్నది. నేను ఒక వైణికుడి కోసం వెదుకుతున్నాను. దినపత్రికలో ప్రకటింపజేశాను. నౌకర్లతో, అపరిచితులతో అందరితో చెప్పాను. ఒక వైణికుణ్ణి వెదికి నా దగ్గరకు తెమ్మని చెప్పాను. అందరూ రకరకాల వాళ్ళను తెచ్చారు. కానీ నేను కోరుకుంటున్న వైణికుడు ఈవేళ కనిపించాడు"

కేశవ్ సోఫాలోంచి లేచి నిలబడి అన్నాడు "నేను వెళ్తాను". శోభ అతడి చేయి పట్టుకుంది- "మీరు ఎప్పుడు వచ్చినా అదే మాట చెబుతారు. మీ పాదాలకు అంటివున్న దుమ్ము చూస్తుంటే ఈ నగరపు ధూళిధూసరమైన రోడ్లన్నీ నడిచారని తెలిసిపోతోంది. నేనున్న ఈ దారి ఒక్కటే పనికి రాలేదా మీకు. మీ పాదాలతో నా శరీరాన్ని ఒక్కసారి స్పృశించండి"

"నన్ను వెళ్ళనివ్వు"

"ఇప్పుడు నేను మిమ్మల్ని.. నా భర్తను నాకు తిరిగి ఇవ్వమని కూడా అడగను. మీరు ఇక్కడ వుండండి, నా కళ్ళ ముందుండండి. నాకు వీణ నేర్పించండి. నా సేటు చాలా ధనవంతుడు. నేను మీకు నెలకు ఐదు వందలు...కాదు వెయ్యి...కాదు మీరు అడిగినంత ఇస్తాను. మీ ఒళ్ళంతా దుమ్ము నిండిపోయివుంది. మీ బట్టలు చిరిగిపోయి వున్నాయి. మీ జుత్తులో ఇసుక కూరుకుపోయి వుంది. మీ కనుపాపల మీద చేదు పేరుకుపోయి వుంది. నా దగ్గరకు వచ్చేయండి. నా చేతులతో మీకు స్నానం చేయిస్తాను. మురికి అంతా కడిగివేస్తాను. పువ్వులా సుఖంగా మిమ్మల్ని చూచుకుంటాను, పూజించుకుంటాను. జౌహరీ సేట్ కేవలం రాత్రిళ్ళు వచ్చి ఒకటి రెండు గంటలుండి వెళ్లిపోతాడు. రోజులో మిగిలిన సమయమంతా మన స్వంతం అవుతుంది"

"జౌహరీ సేటా!?" కేశవ్ అడిగాడు.

"అవును. ఆయన మీకు తెలుసా? నగరంలోకల్లా పెద్ద వజ్రాల వ్యాపారి. అతడే నన్ను ఉంచుకున్నాడు. చాలా మంచివాడు. అతడిప్పటికిచ్చిన డబ్బు నాకు జీవితాంతం హాయిగా వుండటానికి సరిపోతుంది. నిజం చెబుతున్నాను. మనమింక అనవసరమైన దారిద్ర్యంలో వుండవలసిన అగత్యం లేదు. మీరు




జీవితాంతం నా దగ్గర వుండవచ్చు. నా దగ్గరున్న డబ్బు, ముత్యాల హారాలు, వజ్రాలు, బంగారు ఆభరణాలు అన్నీ మీకిచ్చేస్తాను...''

కేశవ్ లేచి తలుపువేపుకు నడుస్తున్నాడు.

''ఎక్కడికి వెళ్తున్నారు?'' శోభ అశాంతిగా అంది. అల్లకల్లోలంగా నిరాశతో కంపిస్తూ అంది ''మళ్ళీ వెళ్ళిపోతున్నారా?...వెళ్ళకండి...దయచేసి వెళ్ళకండి...మీ పాదాలకు మొక్కుతాను. వెళ్ళకండి...నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళకండి! మీకు తెలియదు. నేను అన్నీ వుండి కూడా ఏమీలేనిదాన్ని. ఏమీలేని... అస్సలేమీలేని నిరుపేదరాల్ని''

శోభ కుమిలి కుమిలి ఏడుస్తోంది. విలపిస్తోంది.

కేశవ్ నిశ్శబ్దంగా తలుపు తెరుచుకుని బయటకు వెళ్ళిపోయాడు. కారిడార్‌లోకి వెళ్ళాడు. ఫ్లాట్సు దాటి వెళ్ళిపోయాడు. లిఫ్ట్ దిగి కిందకు వచ్చాడు. రోడ్డెక్కి పరుగెడుతున్నాడు. కేశవ్‌కు అనిపించింది. ఒక స్త్రీ పంజరం పట్టుకుని అతడి వెనుక పరుగెత్తుకు వస్తున్నట్టు—వెంబడిస్తున్నట్టు, 'రా! నా ముత్యాల పంచ రంగుల రామచిలుకా రా!' అని పిలుస్తున్నట్టు.

* * *

మదన్ మిత్రులతో కలసి ఓల్డ్‌జాన్ రెస్టారెంట్‌లో టీ తాగుతున్నాడు. రంభ ఫోన్ చేసింది. సాయంత్రం ఐదు గంటలకు కాలేజ్ అవగానే అదే రెస్టారెంట్‌కు వచ్చి తన కోసం ఎదురుచూడమని చెప్పింది. మదన్‌కు ఓల్డ్‌జాన్ రెస్టారెంట్ అంటే చాలా ఇష్టం.

ఓల్డ్‌జాన్ పేరుకు తగినట్టు అంతా పాతమోడల్ ఫర్నిచర్‌తో అలంకరింపబడి వుంటుంది. చాలా అందంగా వుంటుంది. అక్కడ కూర్చుంటే గత శతాబ్దంలో కూర్చున్నట్టు అనిపిస్తుంది. పాత చరిత్ర పుటలు తిరగేస్తున్నప్పుడు రెండు పేజీల మధ్య ఒక గులాబీ కనిపిస్తే ఎలా వుంటుందో—సరిగ్గా ఓల్డ్‌జాన్‌ను చూస్తే అలాగే అన్పిస్తుంది. బేరర్స్ అందరూ యాభై ఏళ్ళ వయసు పైబడినవాళ్ళుంటారు. ముఖమ్మీద విషాద గంభీరతను నింపుకుని చిరునవ్వులు చిందిస్తుంటారు. ఆ వాతావరణంలో ఏవో పండిపోయిన ఆకుల వాసన వస్తుంటుంది.

అయితే అన్ని విషయాల్లో పాతదనాన్ని నింపుకున్న ఓల్డ్‌జాన్‌లో టీ, కాఫీ మాత్రం అద్భుతంగా వుంటాయి. అలాగే స్వీట్లు, హాట్లు కూడా ఒక ప్రత్యేక పరిశుభ్రమైన రుచితో వుంటాయి. దాంతో అందరి మనసుల్లో ఆ రెస్టారెంట్‌కో ప్రత్యేక స్థానం ఏర్పడింది. అక్కడికి విదేశీ టూరిస్టులు, చదువుకున్నవాళ్ళు, మేధావులు, చిత్రకారులు, చిత్రపరిశ్రమవాళ్ళు ఎక్కువగా వస్తుంటారు. ముఖ్యంగా కళల పట్ల ఉత్సాహాన్ని కనబర్చే నవయువతులు ఎక్కువగా వచ్చేవాళ్ళు. ఖాదీభండార్ చీరలు కట్టుకుని హైహీల్స్ విసర్జించి, మెడలో వెండి నగలు ధరించి వచ్చి—కాఫీ ఒక్క కప్పు సేవించి, లాల్చీలు ధరించి, ఎండిపోయిన దవడలు వేసుకుని వుండి ఒకవైపు ఆకలి దహించివేస్తున్నా గంటల తరబడి కళలను గురించి మాట్లాడే కళాకారులతో చర్చించి తమ కాడిలాక్స్‌లో ఎక్కి వెళ్ళిపోయే వాళ్ళు — నడచు ఖాదీభండార్ నిసర్గ సుందరీమణులు.

మదన్ నాలుగున్నర నుంచే ఓల్డ్

జాన్‌లో కూర్చుని రంభ కోసం ఎదురు చూస్తున్నాడు. అప్పుడు ఐదుదాటి.. ఆరు దాటి ఆరున్నరఅయింది. కానీ రంభ ఇంకా రాలేదు. ఉదయం ఫోను చేసినప్పుడు ఏదో అత్యవసరమైన విషయం మాట్లాడ వలసి వుందని మరీ చెప్పింది. అలాంటి రంభ ఇంకా రాలేదు. ఎందుకు రాలేదు? మదన్ ఆలోచిస్తున్నాడు.

రెస్టారెంట్‌కు ఒక మూలలో బక్క పల్చటి, జుట్టు బాగా పెరిగి భుజాలను తాకుతున్న చిత్రకారుడు ఒక సుందరితో మాట్లాడుతున్నాడు. ఏం మాట్లాడు తున్నాడో తెలియదు. దాదాపు గంటంబావు నుంచి ఏకధాటిగా మాట్లాడుతూనే వున్నాడు. అతడి ముందున్న కప్పులో కాఫీ ఎప్పుడో చల్లారిపోయింది. ఎదురుగా కూర్చున్న సుందరీమణి కళ్ళల్లో చిక్కటి ఆశ్చర్యం నిండివుంది. అప్పటికి నాలుగు సార్లు పర్సులోంచి లిప్‌స్టిక్ తీసి రాసు కుంది. తల వెంట్రుకలు ఒక పాయ ముఖమ్మీదకు జార్చి వ్రేలితో రింగులు చుడుతోంది. మళ్ళీ అంతలోనే వాటిని సాఫు చేసోంది. చిత్రకారుడు అదేపనిగా వాగుతూనే వున్నాడు. సుందరీమణి చిరునవ్వు నవ్వుతూ ఊం కొడుతోంది. మధ్య మధ్యలో చి త్ర కా రు డి స్వో దా పె ర గ డా ని కి ... 'బ్రహ్మాండం... ఓ అద్భుతం... ఓహో పరమాద్భుతం... నిజంగా నిజం... వాస్తవం'... లాంటి చిన్న చిన్న డైలాగులు ప్రయోగిస్తోంది. ఆవిడ అనే ఒక వాక్యం కాదు అర్థవాక్యంకూడా చిత్ర కారుణ్ణి మరీ మరీ ప్రేరేపిస్తోంది. అతడు కాఫీ ఒక్క గుక్క తాగి మళ్ళీ మొదలు పెడతాడు. అతడు చెబుతున్న విష యాలు ఒక్కటి ఆ సుందరీమణి తల కెక్కటం లేదు. ఆవిడకు అర్థంకావు కూడా! కానీ అందంగా వుంది. ఈరోజుల్లో హైసొసైటీలో ప్రవేశం లభించాలంటే అందం ఒక్కటే చాలదు. అందంతో పాటు సింగారం వుండాలి. కళల పట్ల నిజమైన అవగాహన, ఆదర్శపూరిత మైన ప్రేమ లేకున్నా కళలు అర్థం కాకున్నా, అవసరం లేకున్నా వున్నట్టు నటించగలగాలి. కళలంటే తనకు చాలా ఇష్టమని అందరితో పదేపదేచెప్పుకోవాలి. అదొక ఫ్యాషన్. 'ఏం సంగీతం! ఏం చిత్రం!- ఏం నటన!- ఏం శిల్పం!- ఏం నవల!- ఏం నాటకం!'- ఒకటేమిటి అరవైనాలుగు కళల్ని గురించీ రెండు మూడు పడికట్టు మాటలు మాట్లాడితే సరిపోతుంది. విన్నవాళ్ళు దంగైపోతారు. ఎన్ని కళలు తెలుసు ఈ అమ్మాయికి? నిలువెల్లా కళారాధన మూర్తీభవించిన ఉన్నత సంస్కృతికి ప్రతిబింబం అను కుంటారు. చాలు ఆ మాత్రం డ్రామా. ఈ రోజు ప్రతి తెలివిగల పిల్లా అదే చేస్తుంది. తల, హృదయం అంతాఖాళీగా వుంటుంది. మాటలు కోటలు దాటేస్తుం టాయి. ఆ మాటలు విని ఏ శ్రీమంతుడో వలలో పడిపోతాడు. నాటకం రక్తికడు తుంది. త్వరలో వాళ్ళిద్దరికి పెళ్ళి అయి పోతుంది.

ప్రస్తుతం రెస్టారెంట్‌లో వున్న చిత్రకారుడు ఆ సుందరీమణి చిత్రాన్ని గీస్తున్నాడు. ఇప్పటికే చాలా భంగిమల్లో చిత్రించాడు. వాటితో ఆ సుందరీమణికి ఉన్నత వర్గాల్లో మంచి స్థానం ఏర్ప డింది. చివరికి ఏ శ్రీమంతుడినో పట్టే స్తుంది. ఆ చిత్రకారుడు అదే మూలన కూర్చుని కాఫీ తాగుతుంటాడు. చివరికి ఒక రోజు అనుకుంటాడు– నేను సుందరీ





షణుల బొమ్మలు గీస్తున్నానా? శ్రీమంతులకు జోడి కలిపే దళారి పనిచేస్తున్నానా? రెండోదే నిజం అని అతడికి తెలిసిపోతుంది. తెల్ల కాగితం మీద బొగ్గు ముక్కలతో నాలుగు గీతలు గీసుకుని చూచుకుంటాడు. తన దురదృష్టాన్ని నిందించుకుంటాడు.

ముగ్ధత్వం, నిజాయితీ, అమాయకత్వం నిండిన అమ్మాయిలుండే రోజులు కావివి. ఏమున్నా లేకున్నా పెదవులమీద ఒక శృంగార భంగిమ, కాస్సంత కళాసేవ, కళల పట్ల నాలుగు డైలాగులు చెప్పగలిగితే చాలు. టిక్కెట్టు దొరికిపోతుంది.

మదన్ గడియారం చూచాడు. పావు తక్కువ ఏడైంది. వెళ్ళిపోదామని లేస్తున్నాడు. అంతలో రంభ వచ్చింది. వచ్చి రావటమే "సారీ ఆలస్యమైంద"ని చెప్పుకుంటూ రొప్పుకుంటూ, సిగ్గుపడుతూ చెప్పి అతడికి ఎదురుగా కూర్చుండిపోయింది. నారింజరంగు బ్లౌజ్ వేసుకుంది. అదే రంగులోవున్న కంచివరం నేతచీర కట్టుకుంది. ఒక చేతిలో పుస్తకాలు, ఒక చేతిలో పెన్ను వున్నాయి. తేనెలూరుతున్న చూపులతో మదన్‌వైపు చూస్తూ అంది-

"ఏం జరిగిందంటే...?" తన ఆలస్యానికి క్షమాపణ చెబుతున్న ధోరణిలో చెప్పింది రంభ- "మా క్లాస్ పిల్లలమధ్య చిన్న రభస జరిగింది. వాళ్ళకు సర్దిచెప్పి, వాళ్ళ తగువు తీర్చి వచ్చేసరికి అక్కడే ఆరున్నరయిపోయింది. ఏంచేయను. తప్పలేదు మరి" రంభ ఇంకా ఏవో తగువును గురించిన వివరాలు చెప్పబోయింది. మదన్ మధ్యలోనే ఆపేస్తూ అడిగాడు-

"అన్నే మాటల్లోపడి మర్చిపోయాను. ఏం తెప్పించను. కమలారసం తాగుతావా? చికిన్ సాండ్‌విచ్ తింటావా?"

"కమలారసం ముందు కావాలి" రంభ అంది "ఎందుకంటే నాకు చాలా దాహం వేస్తోంది. చికెన్ సాండ్‌విచ్‌కు బదులు మరేదైనా హాట్ తెప్పించు. కాస్త కారంతో కరకరలాడేవి కావాలంటోంది జిహ్వ. తరువాత టీ కూడా తాగుతాను."

మదన్ ఉడుక్కుంటూ అన్నాడు- "ఒక నిర్ణయంమీద, ఒక్క పడవమీద ప్రయాణిస్తావేమోనని చూస్తాను. కానీ అది నీవల్ల కానేకాదు."

"కానీ ఇప్పుడో నిర్ణయానికి వచ్చాను" రంభ అంది తలలోంచిజారిపడిన పువ్వును మదన్ చేతిలో వుంచుతూ.

"ఏమిటది?" మదన్ అడిగాడు.

"నిన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను" రంభ తల వంచుకుని కిందకు చూస్తూ అంది.

మదన్ తృళ్ళిపడ్డాడు. అతని చేతిలో వున్న టీ కప్పు జారి టేబిల్‌మీద పడింది. టీ ఒలికిపడి పాంట్ తడిసిపోయింది. ఆ శబ్దం విని బేరర్ పరుగెత్తుకు వచ్చాడు. తన భుజంమీద వున్న టవల్‌తో మదన్ పాంట్‌ను తుడిచాడు. టేబిల్ శుభ్రపరచాడు. ఈ పనులన్నీ జరిగే లోపున మదన్‌కు కొన్ని నిమిషాల పాటు నిశ్శబ్దంగా ఆలోచించుకునే అవకాశం దొరికింది.

"నువ్వు నిజంగా ఆ మాట అంటున్నావా?" మదన్ అడిగాడు-"లేక జోక్ చేస్తున్నావా?"

"ఇంతకు ముందు ఈ విషయమై ఎప్పుడైనా నేను మాట్లాడానా నీతో?" రంభ అడిగింది.

"లేదు" మదన్ అంగీకరిస్తూ

అన్నాడు. కానీ మదన్‌కు ఏం జవాబు చెప్పాలో అర్థం కావటం లేదు. అతడు ఆ మాట వినటానికి సిద్ధపడి లేడు దాంతో కంగారు పడిపోయాడు. దీనికి కారణం రంభ విచిత్రమైన చర్యలు, ప్రాణాంతకమైన పనులు. మొదటినుంచీ రంభ ఒక నిర్ణయమంటూ లేని మనిషి. మదన్ ఎన్నోసార్లు వివాహ సందేశాన్ని ధ్వామని చూశాడు. కానీ రంభ పనులు చూస్తూ చూస్తూ ధైర్యం చాలక ఊరుకుండి పోయాడు.

రంభ అంది "నీ మౌనాన్ని చూస్తుంటే ఈ వార్త విని నీకేవిధమైన ఆనందం కలిగినట్టు లేదు!"

మదన్ తన స్థానంలోంచి లేచి వచ్చి రంభ పక్కన కూర్చున్నాడు. అతడి గుండె అమితవేగంతో కొట్టుకుంటోంది. ఆ నిమిషంలో అతడు చదువుకున్న చదువు, విజ్ఞానం, చరిత్ర, వేదాంతం అన్నీ మర్చిపోయాడు. తనొక పురుషుడు, రంభ ఒక స్త్రీ అన్న ఒక్క విషయం మాత్రమే అతడికిప్పుడు గుర్తుంది. అతడు రంభ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఇద్దరూ ఒక్క మాట కూడా మాట్లాడుకోలేదు. మాట్లాడవలసిన అవసరమూ లేదు. ఓల్డ్ జాన్ గోడలు కరిగిపోయాయి. ఫర్నిచర్ అదృశ్యమైపోయింది. చుట్టూ కూర్చుని వున్న మనుషుల కంఠధ్వని శూన్యంలో కలిసిపోయింది. ఈ ప్రపంచంలో వాళ్ళిద్దరు మాత్రమే వున్నారు. ఒంటరిగా వున్నారు. ఒక ప్రపంచం వుంది. వాళ్ళిద్దరున్నారు. అంతవరకు వాళ్ళిద్దరి మధ్య పష్కించి పోయివున్న బంధం తక్షణమే చిగిర్చింది. పూలు పూసింది. పరిమళాలు వెదజల్లుతోంది. ఆకాశపు అన్ని అక్షాంశ రేఖల మీద ప్రేమ నిలబడి వుంది. కేవలం వాళ్ళిద్దరి ప్రేమ, సుందరస్వప్న సౌధంలా—పైన విజయకేతనం ఎగురుతోంది.

మదన్ అడిగాడు "మీ డాడీతో ఈ విషయం చెప్పావా?"

"డాడీని అడిగేముందు నిన్నడగటం ముఖ్యంకదా?" రంభ అంది. "సరే నేను ఆయనకూ చెబుతాను కానీ నువ్వు అనుకుంటున్న విధంగా కాదు."

"మరే విధంగా?" మదన్ విస్మయంలోంచి అడిగాడు.

"ఈ వార్త హటాత్తుగా చెప్పి నిన్ను ఎలా ఆశ్చర్యపర్చానో అదే విధంగా డాడీని కూడా ఆశ్చర్యపరుస్తాను."




రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

కేశవ్ బైకుల్లా బ్రిడ్జ్ బస్టాప్‌లో నిలబడి ఆలోచిస్తున్నాడు. మూడు ఏళ్ళ క్రితం వచ్చిన ఆ భయంకరమైన అమావాస్యరాత్రి అతణ్ని జీవచ్ఛవంగా మిగిల్చి తను మాత్రం శివుడి పాదపీఠం నీడలోకి చేరుకుంది. అతడి ఆశయం సిద్ధించ లేదు. అతడు చేరవలసిన మజిలీ రెండేళ్ళ క్రితం ఎంత దూరంలో వుందో ఇప్పుడూ అంతే దూరంలో వుంది. జీవించి వుండటానికి ఎట్టి పరిస్థితుల్లోనూ వీల్లేని కేశవ్

ఇంకా జీవించే వున్నాడు. ఎందుకని ?

అసలు శివుడు ఆనాటి తన ప్రార్థనను ఆలకించాడా? ఆ రోజు లిద్దర్‌నదీ తీరాన పూలహారం ఎవరునుంచి కుడికి మారింది. కానీ రంభను మాత్రం పొందలేక పోయాడు. అయినా ఇంకా కేశవ్ బతికే వున్నాడు. తన ప్రయత్నం కొనసాగించమని శివుడు ఇంకా వ్యవధి నిచ్చాడా? అసలు ఇదంతా అబద్ధమని పిస్తోంది. కేవలం భ్రమ, కల్పన అనిపిస్తోంది. తను ఈ శతాబ్దంలోనే పుట్టి వుంటాడు. కాకపోతే తనలో రెండు వేల సంవత్సరాలనాటి ఆలోచనా ధోరణి మిగిలి వుందేమో? విచిత్రం కాకపోతే శిల మనిషిగా ఎప్పుడైనా మారిందా? మారగలుగుతుందా? అసంభవం.

ఇవన్నీ మతి తప్పిన ఒక స్థితి తాలూకు కల్పనలు. తను ఈ యుగం వాడే. ఈనాటి జీవన విలువల మధ్య చిక్కుకుని వున్నవాడే ! సందేహం లేదు. రక్తమాంసాలు నిండిన ఈశరీరం ప్రేమలో సఫలమైనా విఫలమైనా ఇక్కడే వుండవలసి వస్తుంది. ఏ ఎల్లోరాకో తిరిగి వెళ్ళవలసిన అవసరం లేదు. శిలగా మారవలసిన అవసరం అంతకన్నా లేదు.

ఈ వర్తమానంలో....ఈ సమాజంలో వుండవలసిన మనిషి. ఏదో శివుడి ఆజ్ఞ, బరువును భుజాలపై మోసుకుని తిరగటం అవివేకం అవుతుంది. కల్పనా జగతులోంచి ఎత్తుకున్న ఆ బరువును దించేయాల్సి వుంటుంది.

అయితే శివుడు ఈ విషయం చూచి ఏమనుకుంటాడు. అదీ ఆలోచించాలి. అసలు శివుడెవడు? ఏమిటి అనగలడు? జీవితం చాలా ఖరైనది. కష్టమైనది. మృత్యువు కడు దూరంలో వుంది. అవని వసువుతో ప్రేమించటం వ్యర్థం అని మనుషులంటారు కదా? అదే అంటాడు శివుడు కూడా! ఒకవేళ అంటే గింటే....

ఒక సంవత్సరం కాక రెండో సంవత్సరం కూడా పూర్తైపోయి మూడో సంవత్సరం మొదలైంది. త్వరలో ముగిసిపోతుంది కూడా. ఇంతకాలం చూచిన అనుభవాల దృష్ట్యా కేశవ్ ఆలోచనా ధోరణి ఆ రకంగా మారిపోయింది. అదే గట్టిపడిపోయింది. అతడు రెండు వేల ఏళ్ళనాటి కేశవ్ కాదు. ఈనాటి వాడే. ఏదో మతిభ్రమణం వల్ల తన భూతకాలం గుర్తులేదు. అంతే అని కేశవ్ పూర్తిగా నమ్ముతున్నాడు.

కేశవ్ తను ఈ కాలం నాటి వాడేనని గట్టిగా నిర్ణయం చేసుకున్నాడు. ఆ నిర్ణయం అతడికెంతో తృప్తి నిచ్చింది. అతడి కాళ్ళకూ, చేతులకూ చుట్టుకున్న సంకెళ్ళు ఒక్కసారిగా తెగిపోయినట్టు అనిపించింది. గుండెలమీది నుంచి పెద్ద బరువు ఏదో దిగిపోయినట్లనిపించింది.

ఇప్పుడు కేశవ్ తనకు తనే కొత్తగా అనిపిస్తున్నాడు. శాంతంగా వున్నట్టని పిస్తోంది. అతడి కళ్ళలోకి కొత్త వెలుగు ఒకటి హఠాత్తుగా ప్రవేశించింది. తన చుట్టూ వున్న జన సమూహాన్ని ఒక కొత్త కోణంలోంచి ఉత్సాహంగా, ఉల్లాసంగా పరికిస్తున్నాడు.

ఇంతలో బస్సొచ్చింది. కేశవ్ ఈల వేసుకుంటూ బస్సెక్కి ఒక సీట్లో కూర్చోబోతున్నాడు—అతడికి ఎదురుగ్గా సీట్లో మాయా, గామా ఇద్దరూ కూర్చుని కనిపించారు.

కేశవ్‌ను చూడగానే వాళ్ళిద్దరూ ఆనందంతో అరిచారు. "అరె విగ్రహం పుష్టి ! నువ్వింకా ఇక్కడే వున్నావా ?" అని

నవ్వుకుంటూ మార్ఘా కేశవ్ పక్కనే కూర్చున్నాడు.

గామా కేశవ్ భుజమ్మీద ఒక గట్టి దెబ్బ వేసి "ఎందాకా?" అని అడిగాడు.

గామా దెబ్బకు కేశవ్‌కు తన భుజం బొమికె చిట్లినట్లనిపించింది. ఆ నొప్పిని పళ్ళ బిగువున భరిస్తూ-

"కొలాబే వరకు వెళ్తున్నాను" అన్నాడు.

మార్ఘా మోచేతో కేశవ్ డొక్కలో పొడుస్తూ "నువ్వు కొలాబే వెళ్ళటానికి వీల్లేదు. మాతో మా ఇంటికి రావాలి" అన్నాడు.

మళ్ళీ వెంటనే గామా వేపు తిరిగి "నిజం చెప్పు గామా! ఇంతటి మంచి శరీరం ఉన్న యువకుణ్ని నువ్వింత వరకూ చూశావా? ఇంత మంచి శరీరం వుంచుకుని దరిద్రంగా బ్రతుకుతున్నా డంటే సిగ్గు పడవలసిన విషయం కదా?"

"ముమ్మాటికీ నిజం!" గామా అన్నాడు "ఓ విగ్రహం పుష్టి"! గామా కేశవ్‌తో అన్నాడు "అనవసరంగా జీవితాన్ని చేతులారా ఎందుకు పాడు చేసుకుంటావు. మాతో వచ్చెయ్. నిన్ను నెంబర్ వన్ పహిల్వాన్ని చేస్తాం! ఏం?" అని చెబుతూ గామా కేశవ్ గెడ్డం కింద మరో దెబ్బ ఇచ్చుకున్నాడు. కేశవ్ భయంకరమైన ఆ దెబ్బ తాలూకు నొప్పికి వణికిపోతూ అన్నాడు "దయచేసి ఈ సారికి నన్ను ప్రాణాలతో విడిచిపెట్టండి. చాలా అవసరమైన పనుండి 'కొలాబే'కు వెళ్తున్నాను. అక్కడ నుంచి రాగానే మీ దగ్గరకు వస్తాను."

"నిజంగా వస్తావా?" మార్ఘా అడిగాడు.

"నిజంగా వస్తాను" కేశవ్ జీవితంలో మొదటిసారి అబద్ధం చెబుతూ అన్నాడు. ఇంకేం చేయగలడు? అబద్ధం చెప్పకుండా ఎలా జీవించి ఉండగలడు. ఆ సమయంలో ఆత్మరక్షణార్థం అబద్ధం చెప్పవలసే వచ్చింది.

మార్ఘా వెంటనే తన చొక్కా జేబు లోంచి విజిటింగ్ కార్డ్ తీసిఇస్తూ అన్నాడు "ఇదే మా అడ్రస్. ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడు వచ్చెయ్. నిన్ను మనిషిని చేస్తాం. తెలిసిందా?"

మార్ఘా ఆనందంతో కేశవ్ వీపు సవరించాడు. తననెవరో నిప్పుల గుండంలో దొర్లిస్తున్నట్టనిపించింది కేశవ్‌కు. డొక్కలో నొప్పి, భుజమ్మీద నొప్పి, గెడ్డం కింద నొప్పి ఇంకా నొప్పెడుతుంటే అతి కష్టమ్మీద చిరునవ్వును పెదవుల మీదకు తెచ్చుకుంటూ అన్నాడు "వస్తాను... తప్పకుండా వస్తాను"




కొలాబేలో దిగి కేశవ్ మరియన్ రెస్టారెంట్ దగ్గరకెళ్ళి ఫ్రెడ్‌తో మాట్లాడాడు. ఫ్రెడ్ ఆర్కెస్ట్రా ఆ రెస్టారెంట్‌లో పని చేస్తుంది.

"నేనిప్పుడు మీ ఆర్కెస్ట్రాలో వయొలిన్ వాయించటానికి సిద్ధపడి వచ్చాను" కేశవ్ ఫ్రెడ్‌తో అన్నాడు.




కేశవ్ ఒకనాడు తనకు వచ్చిన అవకాశాన్ని ఈనాడు ఉపయోగించుకోదల్చుకున్నాడు? చాలా కాలం క్రితం భగీరథ్ పహల్‌గావ్‌లో ఏర్పాటు చేసిన పార్టీలో కేశవ్ వయోలిన్ వాయించగా ఫ్రేడ్ విన్నాడు. ఆ రోజే కేశవ్‌ను తన ఆర్కెస్ట్రాలోకి రమ్మని ఆహ్వానించాడు. ఆరోజు కేశవ్ నిరాకరించాడు.

"నేను పవిత్రమైన వీణ మీద దేవతల పాటలు పాడేవాణ్ని. మీ ఆర్కెస్ట్రాలో వయోలిన్ వాయించటం జరగదు"

"వయోలిన్ కూడా పవిత్రమైనదే" ఫ్రేడ్ అన్నాడు. "వయోలిన్ మీద ఎందరో పాశ్చాత్య సంగీతకారులు ఎన్నో అమర గీతాలు పాడారు"

"ఛీ! పాశ్చాత్య సంగీతం కూడా ఒక సంగీతమేనా!" కేశవ్ చీత్కరిస్తూ అన్నాడు. "అది కాలి చిటికిన వేలు దగ్గర మొదలై చీల మండ వరకు వచ్చి చీలిపోతుంది"

"ఈరోజు ఇక్కడ పాడిన క్లబ్బు గీతాలు చాలా అసహ్యాకరమైనవి. వీటిని విని పాశ్చాత్య సంగీతం మొత్తం ఇలాగే వుంటుందని అంచనా వేసుకోవటం పొరపాటు అవుతుంది. బిథోవెన్, బ్రాం, లిస్ట్, చెకొవ్‌స్కీ లాంటి ఎందరో మహా సంగీతకారుల శక్తిని కించపరచినట్టు అవుతుంది" ఫ్రేడ్ అన్నాడు "మీరు ఎప్పుడైనా బొంబాయి వచ్చినప్పుడు నా దగ్గరకు రండి. ఆ రోజు నిజమైన పాశ్చాత్య సంగీతాన్ని వినిపిస్తాను. అవి వింటే మీ ఆత్మ ఆనందంతో ఊగిపోతుంది. ప్రతి సంగీతానికి దాని తాలూకు పవిత్ర ఆత్మ వుంటుంది. కాని దురదృష్టమేమిటంటే ఒక సంగీతాన్నే కాక ప్రతి విషయాన్ని మధ్య దళారులు పాడుచేసి వాటి మీద దురవగాహన ఏర్పరుస్తారు. పాశ్చాత్య సంగీతాన్ని ఈ మధ్యదళారులే భ్రష్టు పట్టించి అవమానాల పాలుచేస్తున్నారు. తెలియనివారు అదే నిజమేమోనని అసహ్యించుకుంటున్నారు. ఎవరంతటికి వాళ్లు చుట్టూ గోడలు నిర్మించుకుని ఒక అభిప్రాయాన్ని ఆపాదించేసుకుని బతికితే సరిపోదు.స్వేచ్ఛగాస్వతంత్రంగా బయట కొచ్చి అన్నీ పరిశీలించి అప్పుడు ఒక అభిప్రాయానికి వస్తే బావుంటుంది. వాస్తవం కళ్ళముందు కొస్తుంది."

ఫ్రేడ్ ఒక తీవ్రమైన దృష్టితో కేశవ్‌ను నఖశిఖ పర్యంతం పరిశీలించాడు.

"నిజానికి ఆ రోజు పహల్‌గావ్‌లో మీరు ఒక చిన్న రాగం వినిపించారు. అది విన్నప్పుడే నేను అనుకున్నాను- మీరు ప్రయత్నిస్తే మంచి వయోలినిస్ట్ అవుతారని. సరే మీ దగ్గర వయోలిన్ వుందా?" అడిగాడు ఫ్రేడ్.

"నా దగ్గర వయోలిన్ లేదు"

"నా దగ్గర పని అయితే వుంది. కానీ వయోలిన్ లేదు. మీరెక్కడనుంచైనా వయోలిన్ తెచ్చుకోవల్సి వుంటుంది. పదండి ముందు టీ తాగుదాం"

ఫ్రేడ్ కేశవ్‌ను చాలా ఆదరపూర్వకమైన దృష్టితో చూచాడు. టీ ఇచ్చి అతడి కష్ట సుఖాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. సానుభూతి చూపించాడు. పని తప్పకుండా దొరుకుతుందని, భవిష్యత్తు బావుంటుందని హామీ ఇచ్చాడు. కానీ అతడు శలవు తీసుకుని వెళ్ళగానే కేశవ్ ఆలోచించాడు. "వయోలిన్ ఎవరిస్తారు?ఎక్కడ దొరుకుతుంది?"

రెస్టారెంట్ మెట్లు నెమ్మదిగా, నిరాశగా దిగుతుండగా అతడికి వెంటనే క్రైస్ట్

గుర్తుకొచ్చింది. క్రైరీ దగ్గర ఒక వయొలిన్ వుండేది.

* * *

"నా మనసు చెబుతూనే వుంది మీరు తప్పకుండా తిరిగి వస్తారని" కేశవ్‌నుచూచి క్రైరీఅంది. క్రైరీ ఫ్లాట్ రూపురేఖలన్నీ మారిపోయి వున్నాయి. ఫర్నిచర్ చివరికి-క్రైరీ హెయిర్ స్టయిల్ కూడా మారిపోయింది. క్రైరీ కేశవ్‌ను చూచి ఏ మాత్రం ఆశ్చర్యపడలేదు సరిగా స్టాండ్ ముందు నిలబడి బొమ్మ వేస్తున్నదల్లా అక్కడే వుండిపోయింది.

కేశవ్ క్రైరీ దగ్గరకు వెళ్ళి ఆశ్చర్యంతో అన్నాడు-

"అరె ఇది నా బొమ్మ"

"అవును మీ బొమ్మలు చాలా వేశాను నేను. ఇంతకు ముందు చిత్రకళ అంటే నాకేమాత్రం అభిమానం లేదు. కానీ మీరు తిరస్కరించి వెళ్ళాక ఎందుకో తెలియదు సంగీతం అంటే ఆసక్తి లేకుండా పోయింది. మీరు నాకు మిగిల్చిన బాధను ఒక పాట చేద్దామనుకున్నాను. కానీ వీలు పడలేదు. తరువాత నా అంతట నేనే చిత్రకళలోకి ప్రవేశించాను. మీ చిత్రాలు చాలా వేశాను చూస్తారా?"

కేశవ్ నెమ్మదిగా తల ఊపాడు.

క్రైరీ గోడకు చివరన వున్న కర్టెన్ తొలగించింది. గోడమీద చాలా చిత్రాలు కాన్వాస్ మీద గీచినవి తగిలించబడి వున్నాయి. క్రైరీ ఒక్కొక్కటి వెలుగులోకి తెచ్చి చూపిస్తోంది. ఆ చిత్రాల్లో రకరకాలుగా కేశవ్ చిత్రించబడి వున్నాడు. దొక్కుపోయిన నుదురుతో, కృతఘ్నుడైన కేశవ్ వెడల్పాటిదవడలతో చిన్ని ముఖంతో, క్రూరుడైన కేశవ్ విషం నిండిన కళ్ళతో జాలి, దయ, కరుణ ఏమాత్రం లేని కేశవ్, చెవిటి కేశవ్, గుడ్డి కేశవ్, కుంటి కేశవ్, స్ఫోటకం మచ్చలతో కురూపియైన కేశవ్ శుష్కించి కృంగి కృశించి అడుక్కుంటున్న కేశవ్, ఆకలితో అలమటిస్తున్న కేశవ్, మోసగాడిగా కేశవ్...ఇలా రకరకాల కేశవ్ చిత్రాలు చిత్రించింది క్రైరీ. ఆఖరి చిత్రంలో మరణించిన కేశవ్ కూడా వున్నాడు. అందులో కేశవ్ ఒక ఫుట్ పాత్ మీద చచ్చిపడి వున్నాడు. పైన తెల్లటి వస్త్రం కప్పబడి వుంది. కాళ్ళు, ముఖం మాత్రం కన్పిస్తున్నాయి. మృత్యువు తరువాత కేశవ్ ముఖం అందంగా వుంది. వెలిగి పోతోంది.

"నేను ఈవిధంగా మీమీద పగతీర్చుకున్నాను. మీకు ఆఖరి చిత్రంలో చావు వచ్చేసింది. అప్పుడు క్షమించేశాను" ఆఖరి చిత్రం వైపు చూస్తూ అంది క్రైరీ.

"కానీ నేను..నేను జీవించే వున్నాను."

క్రైరీ జవాబు చెప్పలేదు. తన ధోరణిలో చెప్పుకుంటూ పోతోంది "ఎంతటి మానసికమైన కష్టానికి గురి చేశారో నన్ను తల్చుకుంటే నా గుండె మండిపోతుంది. అందుకే నేను మీకింతటి శారీరక కష్టాన్ని కల్గించాను. నా ఆత్మకు పెద్దగాయం చేశారు మీరు. నేనూ ఈ చిత్రాల్లో మీ ఆత్మను గాయపరచి పగ తీర్చుకున్నాను. పగ తీర్చుకోవాలంటే సంగీతంతో లాభంలేదు. దానికి చిత్రకళ బాగా పనికి వస్తుందని నేను అనుకుంటున్నాను"

"ఓటమిలో సంగీతమూ పనికిరాదు. చిత్రకళ పనికిరాదు. ఏదీ పనికి రాదు. ఈ చిత్రాలను చూస్తుంటే నా మీద పగ తీర్చుకోవటం సంగతి అలా వుంచి




మిమ్మల్ని మీరు ఎంతగా హింసించుకు న్నారో అర్థమవుతోంది."

"నిజమే" క్రైరీ నెమ్మదిగా చెప్పింది— "అప్పుడప్పుడు వీటిని చూస్తే అవి మీ చిత్రాలు కావు – అవి నా చిత్రాలేనని పిస్తుంది"

ఒక్కసారిగా క్రైరీ నిలువెల్లా వణికి పోయింది. కేశవ్‌కు దూరంగా జరిగి, రేడియోగ్రాం మీదకు వంగుతూ అంది "ఇప్పుడు నా దగ్గరికెందుకొచ్చారు?"

"మీ దగ్గర ఏదో అర్థించాలని వచ్చాను"

"నా దగ్గర ఇంకేమీ మిగిలిలేదు మీకివ్వటానికి" క్రైరీ నిరాశగా అంది "ఇప్పుడు నా దగ్గర ఏమీ లేదు. అంతా ఖాళీ అయిపోయింది"

"ఎందుకలా అంటున్నారు?" కేశవ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం చెప్పగలను మీతో?" క్రైరీ గొంతులో గరళం జారుతున్న బాధ ధ్వనించింది.

"మీరు వెళ్ళిపోయాక ఆవేశంలో నేను ఒక తప్పటడుగు వేసేశాను. ఆ ఒక్క జారుడుమెట్టు జారితే చాలు స్త్రీ తనంతట తనే పతనమై పోతుంది. నేనూ అదే అయ్యాను. పాప కూపంలో చిక్కుకు పోయాను. ఆ వినీతికరమైన పనులకు పాల్పడ్డాను. నా దగ్గర ఇంకేముందని ఇవ్వను? ఏడుగురు ప్రియుల్ని మార్చాను. ఏడుసార్లు ఈ గోడలకున్న రంగు మార్చాను. ఏడు ఆకాశాలను ఏడేడుసార్లు అనురాగపు అంతిమస్వరం కోసం గాలిం చాను. కానీ ఆకాశమూ అందలేదు, అను రాగమూ దొరకలేదు. జీవితం గతితప్పింది. నాలో వున్న రాగమూ, రంగూ రెండూ పోయాయి. ఇలాంటి స్త్రీ దగ్గర ఇంకే ముంటుందని అడగటానికి వచ్చారు?"

"ఒక వయోలిన్!"

కేశవ్ ఇచ్చిన సాదా సమాధానం విని క్రైరీ మరికాస్త కుంచించుకు పోయింది. ముఖం తెలతెలబోయింది. భయంకర బాధతాలూకు, కష్టాల తాలూకు చిహ్నాలు గోచరించాయి. ఆమె దుఃఖం పొంగిపొర్లు తున్న కళ్ళతో కేశవ్ వైపు మౌనంగా చూస్తుండిపోయింది.

"కేవలం ఒక వయోలిన్— అంతేనా" క్రైరీ నిస్పృహగా అంది.

"అవును" కేశవ్ అనునయంగా అన్నాడు— "నేను అశక్తుణ్ణి. కేవలం ఒక్క వయోలిన్ మాత్రమే అర్థించ గలను."

హఠాత్తుగా క్రైరీ పగలబడి నవ్వ సాగింది. ఎంతసేపు అలా నవ్విందో కేశవ్ ఆ నవ్వును చూచి గడ్డ కట్టుకు పోయినట్టు నిలబడిపోయాడు. నవ్వి నవ్వి క్రైరీకు కడుపులో నొప్పి వచ్చేసింది. ఆమె కళ్ళల్లో కన్నీరు పొర్లుతున్నాయి. ఆ స్థితిలో క్రైరీకు ఏ జవాబు చెప్పాలో, ఎలా చెప్పాలో, ఏం చెప్పాలో అర్థంగాక నిలబడిపోయాడు కేశవ్. ఆశ్చర్య చకితుడైనట్టు చూస్తుండి పోయాడు.

చాలా సేపటి తరువాత క్రైరీ నవ్వుని అదుపులో పెట్టుకుంది. ఒక చంచల దృష్టితో కేశవ్‌ను పరిశీలిస్తూ అంది— "వయోలిన్ ఇస్తాను. కానీ ఊరికే కాదు. మీరు కొంత ఖరీదు చెల్లించవలసి వుంటుంది!"

"నా దగ్గర ఒక్కపైసా కూడాలేదు" కేశవ్ అసహాయంగా అన్నాడు.

క్రైరీ కేశవ్‌కు అతి దగ్గరగా వచ్చి అంది "ఒక్క పైసా లేకపోతే పోని



వ్వండి ఒక్క క్షణమైన లేదా ? ఒక చూపైనా లేదా? ఒక్క చిన్న ప్రేమైనా లేదా?'' క్లైరీ తన రెండు చేతులు కేశవ్ మెడచుట్టూవేసింది. మళ్ళీ అంతలోనే కేశవ్ గెడ్డం పట్టుకుని బతిమాలుతున్నట్టు తన వేళ్ళకున్న చిన్నచిన్న గోళ్ళతో గెడ్డాన్ని నెమ్మదిగా స్పృశిస్తూ వుండిపోయింది. కేశవ్ స్థబ్దుడైపోయి, విస్మయంలో స్తంభించిపోయి నిలబడిపోయాడు. కొన్ని క్షణాల మౌనం తర్వాత అతి శాంతంగా, కోమలంగా "నేను మీకు ప్రేమ ఇవ్వ లేనని మీకు తెలుసుకదా?" అన్నాడు కేశవ్.

"ప్రేమ కావాలని ఎవరు అడుగు తున్నారు?" క్లైరీ ఒక్క క్షణం శ్వాసను బిగపట్టి అంది "నేను ఖరీదు అడుగు తున్నాను?''

కేశవ్ ఆలోచిస్తున్నాడు. ప్రేమకు, ఖరీదుకు మధ్య చాలా అంతరం వుంది. ఒకప్పుడు ఈ రెంటికీ మధ్య అంతరం



వుండేదికాదు. కానీ ఇప్పుడు వచ్చింది. ప్రేమ వేరు. ఖరీదు వేరు. ప్రేమ ఇవ్వలేకపోతే ఖరీదు ఇవ్వవచ్చు. ఆ రోజుల్లో అందరూ కేవలం ప్రేమనే అడిగేవారు– వీణ ఎప్పుడూ ప్రేమనే కోరుకుంటుంది. కానీ ఇది వయోలిన్ కాబట్టి ఖరీదును కోరుకుంటుంది.

"మీరు వెళ్ళిన రోజునుంచి నేను మళ్ళీ వయోలిన్‌ను తాకనైనాలేదు" కైరీ అంది.

కైరీ కేశవ్‌ను ఆ గదిలో విడిచి, తన బెడ్‌రూంలో కెళ్ళిపోయింది. కొద్ది క్షణాలు గడిచాక కైరీ బెడ్‌రూంలోంచి వయోలిన్ సంగీతం వినవచ్చింది. ఆ రాగాలు వియోగాగ్నిలో కాలి పోతున్నట్లు, అభియోగాన్ని వినిపిస్తున్నట్టున్నాయి. బాధ నెమ్మది నెమ్మదిగా రగులుకుంటున్నట్టున్నాయి. మంద్రంగా, రుద్ధంగా వినిపిస్తున్నాయి. మెత్తటి పట్టుకుచ్చులు దగ్ధమైపోతున్నట్టు వినిపిస్తున్నాయి. మోగుతున్నది వయోలిన్ కాదు. కైరీ గులాబి

రంగు వేళ్లు తన చెక్కిళ్ళపై నడుస్తున్నట్టు అన్పించింది కేశవ్‌కు హటాత్తుగా.

కేశవ్ స్టాండుమీద ఉన్న తన అసంపూర్తి చిత్రాన్ని దగ్గరగా నిలబడి ఒక్క క్షణంపాటు చూచాడు. మరుక్షణం బ్రష్ అందుకుని నల్లరంగులో ముంచి చిత్రం మీద అడ్డదిడ్డంగా నాలుగు నల్లటి గీతలు గీచాడు. తల వంచుకుని అక్కడనుంచి బయటకెళ్ళిపోయాడు.



13

మెత్తటి దూదితో తయారైన పడక కుర్చీమీద కూర్చుని వుంది శోభ. ఆమె సేవిక ఆమె గోళ్ళకు రంగు వేస్తోంది. అప్పుడే జౌహరి భగీరథ్ ఇద్దరూ ఆ గది లోకి వచ్చారు. వాళ్లిద్దర్ని చూచి రంగు వేస్తున్న సేవిక కంగారుపడిలేవబోయింది. జౌహరీ ఆమె కంగారును చూసి వెంటనే అన్నాడు "నీ పని నువ్వు చెయ్యి ఫర్వా లేదు."

జౌహరి, భగీరథ్ ఇద్దరు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నారు. శోభ అంతవరకు గోళ్ళకు రంగు వేస్తున్న సేవికను అవతలికి వెళ్ళిపొమ్మని సైగ చేసింది. రంగు బాటిల్ తీసుకుని సేవిక లోపలి కెళ్ళిపోయింది.

"వీరు... వీరు... నా స్నేహితులు భగీరథ్."

శోభ అప్పుడే రంగు వేసుకున్న తన గోళ్ళను చూస్తుండిపోయింది కొద్దిసేపు. తరువాత భగీరథ్ వైపు చూచి ఓ చిరునవ్వు నవ్వింది.

"హలో" అతి నిర్లక్ష్యంగా అన్నాడు భగీరథ్.

పెదవుల మీద ఒకమూల వంకర నవ్వుని నింపుకుని శోభను పరిశీలిస్తున్నాడు భగీరథ్. ఆమె అతడికి 'హలో'కు మళ్ళీ 'హలో' అని జవాబు చెప్పలేదు.

జౌహరి గొంతు సవరించుకుంటున్నట్టు చిన్నగా దగ్గి అన్నాడు.

అతడి స్వరం విచిత్రంగా మారిపోయింది. "శోభా!నేను ఈ ఫ్లాట్,దీనిలో సామానులు అన్నీ అమ్మేశాను. సంగతేమిటంటే నేనువీరికి డబ్బుబాకీవున్నాను. ఆ బాకీకింద ఈ ఫ్లాట్ వీరికి ఇచ్చేశాను" అన్నాడు,

"అయితే మనమీ ఫ్లాట్‌లోంచి మరో కొత్త ఫ్లాట్‌లోకి వెళ్ళవలసి వుంటుందన్నమాట. సరే అలాగే చేద్దాం" అంది శోభ.

భగీరథ్ జౌహరివైపు చూచి ఓ నవ్వు నవ్వాడు. భగీరథ్ నుంచి తన దృష్టిని మళ్లించుకుంటూ మళ్ళీ అన్నాడు జౌహరి,

"నువ్వు ఇక్కడే వుంటావు."

శోభ ఆశ్చర్యపడుతూ అంది "సేట్! ఈ ఫ్లాట్ మీది కానప్పుడు నేనిక్కడ ఎలా వుండగలను?"

ఈ ప్రశ్నకు జౌహరి ఏ సమాధానమూ చెప్పకుండా కూర్చున్నాడు. అతడి ముఖం జేవురించుకుపోయి వుంది. అతడి పెదవులు ఎందుకో కంపిస్తున్నాయి.

చివరికి భగీరథ్ అన్నాడు "నువ్వూ నా బాకీ కింద జమకట్టబడ్డావు".

"నేను కూడానా!?" శోభ ఆ మాటవిని

తృప్తిపడింది "ఈ ఫ్లాట్, దీనిలో వున్న సోఫాలు, కుర్చీలు, పర్దాలు, చివరకి వంట సామానులు మీ బాకీ కింద జమ కట్టబడవచ్చు. కానీ నేను ఎలా జమకట్టబడతాను"

"అవును. నువ్వు కూడా?" భగీరథ్ దృఢ స్వరంతో అన్నాడు, "నువ్వు, నీ చిలక, దాని పంజరం కూడా బాకీ కింపనే జమ. కానీ కంగారు పడకు. నేను నీకు ఎలాంటి కష్టం కలగనివ్వను. జౌహర్ సేట్ నీ విషయాలన్నీ ఏ వి ధ ం గా పట్టించుకునేవాడో, ఎన్ని డబ్బులు ఖర్చు కోసం ఇచ్చేవాడో నేనూ అలాగే చూసుకుంటాను. నిన్ను సుఖంగా వుంచుతాను. నీ కేవిధమైన ఇబ్బంది కలగదు. కేవలం ఫ్లాట్ యజమాని మారతాడు. అంతే! ఇంకేమీ మారదు"

"ఇంకేమీ మారదు...?" శోభ విస్మయంగా భగీరథ్ ముఖంలోకి చూస్తూండిపోయింది. ఎలాంటి మగవాళ్లు వీళ్ళు! కేవలం స్త్రీ శరీరంమీద తన పేరున్న ఒక బోర్డు తగిలించి దాన్నే పెళ్ళి అంటారు. ప్రేమ అంటారు. వేశ్యా వృత్తి అంటారు. మళ్ళీ ఏమీ మారదు అంటారు. స్త్రీ అంటే కేవలం ఒక ఫ్లాట్ అనా, ఒక బోర్డుఅనా, ఒక బాకీఅనా, వెచ్చటి రక్త మాంసాలున్న ఒక విచిత్ర జంతువనా వీళ్ళ వుద్దేశం?బాకీ కింద సజీవమైన ఒక మనిషిని జమ కట్టేయటం?..ఏమనాలి దీన్ని? ఈ కసాయితనం నిండిన సమాజం మొదటి నుంచీ ఆడ మాంసాన్ని అతి చౌకగా విక్రయిసూ వుంది.

స్త్రీ శరీరంలోనూ ఒక ఆత్మ వుంటుందని, ఒక హృదయం వుంటుందని, ఆ హృదయంలో కొన్ని ఆకాంక్షలుంటాయని కొన్ని సుందర చిత్రాలుంటాయని వీళ్ళకు ఎన్నటికీ అర్థమే కాదా? స్త్రీ ఆశలను, ఆశయాలను ఎందుకిలా గాయపరుస్తున్నారు వీళ్ళు? ఒకవైపు చిత్రవధ పాలుచేస్తూ అంటున్నాడు - 'ఏమీ మారదు...'

శోభ నిలబడి అలాగే ఆలోచిస్తుండిపోయింది. ఏం చేయాలో అర్థం కాని పరిస్థితిలో పడిపోయింది. తన ముందు జరుగుతున్న తన శరీరపు వ్యాపారాన్ని చూచి ప గ ల బ డి నవ్వాలో కుమిలి కుమిలి ఏడ్వాలో తెలియని పరిస్థితిలో అచేతనురాలై పోయి నిలబడిపోయింది.

జౌహరి లేచి నిలబడ్డాడు. శోభతో ఒక్క మాటన్నా చెప్పకుండా తల వంచుకుని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

భగీరథ్ ఆనందంగా ఒక్క బలమైన శ్వాస పీల్చుకుని కుర్చీలోంచి లేచాడు. శోభకు దగ్గరగా వెళ్ళి ఆమెను తనవైపుకు తిప్పుకున్నాడు. విజయగర్వంతో ఆమె కళ్ళల్లోకి చూస్తూ చేత్తో ఆమె ముఖాన్ని పైకెత్తుతూ అన్నాడు-"హలో!"

జవాబుగా పంజరంలో వున్న చిలక భగీరథ్‌ను చూస్తూ బిగ్గరగా అరచింది "బ్లడీ స్వయన్" (పంది వెధవ!).

తిట్టు వినగానే భగీరథ్ కోపంతో మండిపడ్డాడు. పంజరం దగ్గరకెళ్ళి చిలకను బయటకు తీసాడు. చిలక రెక్కలు టపటప కొట్టుకుంటుండగా రెండు చేతులతో దాని మెడను గట్టిగా పిసికి నేలకేసి కొట్టాడు. చిలక చస్తూ చస్తూ అరుస్తూ చచ్చింది. "బ్లడీ స్వయన్"

భగీరథ్ వేగంగా గదిలోంచి బయటకు వెళ్ళిపోయాడు.

* * *

ఆ రాత్రి రం భ కు •నిద్ర కరువై

పోయింది. మనసంతా అల్లకల్లోలమై పోయింది. రంభ పక్కమీద అటూఇటూ అశాంతిగా పొర్లుతూ ఆలోచిస్తోంది– "ఇప్పుడేం చేయాలి?"

జౌహరీ రంభతో అంతా చెప్పేశాడు. భగీరథ్ దగ్గర తనే విధంగా అప్పు చేసిందీ, ఎంతకి బాకీపడివున్నదీ చెప్పాడు. అతడి ముందు తను చేతులు ఎత్తేసి నిలబడివున్నానని చెప్పాడు. రంభ భగీరథ్‌ను పెళ్లి చేసుకోకపోతే – చేసుకుంటానని మాటివ్వకపోతే–రెండు రోజుల్లో కల్లా తాము ఇల్లు ఖాళీ చేయవలసి వుంటుంది. దుకాణం, సామానులు అన్నీ ప్రతి చిన్న వస్తువుతో సహా భగీరథ్‌కు చెల్లుచేయవలసి వుంటుంది. మూడో రోజుకల్లా తాము బికారుల్లా రోడ్డుమీద నిలబడవలసి వుంటుంది అని చెప్పాడు. అయితే రంభ భగీరథ్‌ను పెళ్ళిచేసుకోక తప్పదు అని మాత్రం జౌహరీ అనలేదు. కానీ ఆ మాట అనకుండానే ఆ అర్థం వచ్చే విధంగా రంభకు అన్నీ చెప్పాడు.

జౌహరీ కూడా తనలాగే తన బెడ్‌రూంలో నిద్రకు వెలియై ఆలోచిస్తుంటాడనీ, తన సమాధానం కోసం ఎదురు చూస్తుంటాడనీ రంభకు తెలుసు.

రంభ ఆలోచిస్తోంది. ఊఁహుఁ– ఆ పంది వెధవని పెళ్ళి చేసుకోవటమా? అసంభవం. అలా ఎన్నటికీ జరగదు. ఎంతైనా తను పూర్తి అశక్తురాలు, అసమర్థురాలు కాదుగా? తనకూ కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం వుంది. తన సంపాదన తనకు, తన తండ్రికీ సరిపోతుంది. ఈ బంగ్లా లేకపోతే పోయింది. కారు లేకపోతేమానె. ఈ ఫర్నీచర్, ఖరీదైన దుస్తులు లేకుంటే ఫర్వాలేదు. ఏమౌతుంది ఇవన్నీ లేకుంటే?

తను మదన్‌ను పెళ్ళి చేసుకుంటుంది. అతడితో సాదాగా సీదాగా అందంగా ఆనందంగా వుండే మామూలు జీవితాన్ని అనుభవిస్తుంది. మదన్ ప్రేమ చాలా గొప్పది. తనను ఎంతో ప్రేమగా చూచుకుంటాడు. హాయిగా శాంతంగా కాలం గడిచిపోతుంది. ఈ కుళ్ళిపోయిన శ్రీమంతుడు భగీరథ్ వద్దు... అతడితో జీవితం అసహ్యం. వద్దు ... ముమ్మాటికి వద్దు!...

రంభ ఇంకా ఇంకా ఆలోచనల అగాథంలోకి కూరుకుపోయింది. తను పడుకున్న పట్టు పరుపు చక్కిలిగింతలు పెడుతోంది. మందంగా వెలుగుతున్న విద్యుద్దీపాల కాంతి రంభ కళ్ళతో ఆటలాడుకుంటోంది. ఇరాన్‌నుంచి తెప్పించిన మేలిరకం జలతారు పర్దాలు చుట్టూ మెల్లగా నాట్యం చేస్తున్నాయి. పారిస్‌నుంచి ప్రత్యేకంగా తెప్పించిన పాలరాతి స్త్రీ విగ్రహం, దానిమీద పొదిగివున్న వజ్రాలు ధగధగ ప్రకాశిస్తున్నాయి. అన్ని పాశ్చాత్య దేశాలనుంచి తెప్పించిన అతి ఖరీదైన ఫర్నీచర్,దేదీప్యమానంగా, పరిమళ భరితంగా కళ్ళముందు ఊయలలూగుతూ కన్పిస్తోంది–ఇంతటి రాజభోగాలు, ఇంతటి సౌఖ్యం–ఈలక్షల ఖరీదుచేసే ఫర్నీచర్, అది అందించే సుఖం అన్నీ రేపు ఈపాటికి వుండవు. ఒక్కటీ వుండవు...

అమ్మో – రంభ ఆ ఆలోచనకే వణికిపోయింది. కోట్ల ఖరీదుచేసే ఇన్ని సౌఖ్యాలు ఒక పేద మదన్ కోసం, ఉద్యోగం తప్ప మరేదీ లేని నిర్భాగ్య మదన్ కోసం, అతడి ప్రేమ కోసం, అతడు చెప్పే నాలుగు అందమైన ప్రేమ పూర్వకమైన మాటలకోసం త్యాగం చెయ్యాలా? కేవలం అతడి ప్రేమకోసం

ఇవన్నీ త్యాగం చేయటం... మూర్ఖత్వం అవుతుంది. అవదామరి... అతడి ప్రేమ వీటికన్నా ఖరీదైనదా? ఈ రాజభోగాల కన్నా విలువైనదా? ఇవన్నీ త్యాగంచేసి మదన్‌ను పెళ్ళి చేసుకుంటే చాలా విచారించవలసి వస్తుంది. రేపు తన మిత్రురాండ్రు అందరూ తన పేదరికాన్ని చూచి నవ్వుతారు. జోకులు వేసుకుంటారు. సమాజంలో ఇప్పటివరకూ తనకున్న ఖరీదైన స్టేటస్ ఒక్కసారిగాఎగిరిపోతుంది. తను మామూలు అమ్మాయి అయిపోతుంది. తన ఫ్రెండ్స్ తాలూకు ఖరీదైన సహంగులు చూచి ఈర్ష్యపడవలసి వస్తుంది. చివరికి ఈ త్యాగం ఆనందం ఇవ్వటానికి బదులు దుఃఖాన్ని, దరిద్రాన్ని ఇస్తుంది. చాలా వ్యర్థం. ఈ త్యాగం చేయటం తెలివి తక్కువ తనం అవుతుంది. ఇవన్నీ పోగొట్టుకుని తను చింతిస్తూ మదన్ జీవితాన్ని కూడా పాడుచేసినట్టవుతుంది. ఎవరికీ లాభం జరగదు. ఆనందం మిగలదు.

మరోవైపు తండ్రి- సమాజంలో ఉన్నత వర్గంలో లక్షాధికారిగా బతికిన మనిషి, తన కూతుర్ని అతి గారాబంగా పెంచిన మనిషి, లక్షల రూపాయలు కూతురు సంతోషం కోసం ఖర్చుచేసిన మనిషి ఏమైపోతాడు? సమాజంలో అతడికున్న గౌరవం, ప్రతిష్ట పోతుంది. మిగతా ధనిక మిత్రులు పోతారు. పైగా ఇప్పటివరకు సుఖవంతమైన జీవితానికి అలవాటు పడిన మనిషి- రేపు కూతురు రాల్చే కొన్ని మెతుకుల కోసం ఎదురుచూస్తూ దరిద్రంగా బతకవలసి వస్తుంది. అతడికున్న అన్ని రకాల గౌరవాలు మట్టిలో కలిసిపోతాయి. తన మాట వినకుండా ప్రేమకోసం మదన్‌ను చేసుకున్న తన కూతుర్ని, అవివేకంగా ఇద్దరి సుఖాలను సంపదలను పోగొట్టిన తెలివి తక్కువ కూతుర్ని రోజుకు లక్షసార్లు శపించడా?

రంభ రాత్రంతా ఆలోచిస్తూనే వుంది. ఈలోగా ప్రేమ వచ్చి రెండు మూడు సార్లు ఆమె గుండె తలుపులను తట్టింది. కానీ ఆ శబ్దం చాలా బలహీనంగా వుంది. ప్రేమ పిలుపు రంభకు ఆ నిమిషంలో వినిపించలేదు. సుఖభోగాల మోజులో ఆమె మునిగిపోయింది.

తెల్లవారింది. సూర్యుడు మాసిపోయినట్టు కన్పిస్తున్నాడు. వెలుగు తెల తెలబోతోంది. బలహీనతలు గెలిచాయి. ప్రేమ ఓడిపోయింది. రంభ గదిలోంచి తండ్రి గదిలోకి ఫోన్ చేస్తోంది. ఆమె చేతులు కంపిస్తున్నాయి. గొంతు ఆఖరిసారిగా వణికి ఆగిపోయింది. రంభ రిసీవర్ ఎత్తి అంది "డాడీ! నేను భగీరథ్‌ను పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్నాను''

తండ్రి జవాబు వినాలని ఎదురుచూడలేదు. రంభ ఫోన్ పెట్టేసింది. తన నైట్ గౌన్ సర్దుకుంటూ టేబిల్ దగ్గరకు నడిచింది. మదన్‌కు ఉత్తరం రాయసాగింది.

అప్పటికి పదిసార్లు పది ఉత్తరాలు రాసింది రంభ.

కానీ అన్నీ చింపివేసింది. ఒక్కటీ కుదరదు. మదన్‌కు ఆ విషయం ఎలా చెప్పాలో అర్థం కాలేదు. చివరకి రాయలేనని నిర్ణయించుకుంది. రంభకు వెంటనే మంచి ఆలోచన వచ్చింది. ఫోన్ వుండగా ఉత్తరం ఎందుకు రాయాలి. పైగా ఉత్తరం పూర్తి వ్యక్తిగతం అవుతుంది. ఏది రాసినా రికార్డ్ అయి కూర్చుంటుంది.

ఆ అక్షరాలకు సాక్ష్యం స్వదస్తూరి. చేస్తున్న మోసానికి రుజువుగా మనిషి ముఖంలా, అద్దంలా ఆ వుత్తరం మిగిలిపోతుంది. ఈ కష్టం ఎందుకు? ఫోన్ అయితే ఆ బాధ వుండదు. ఫోన్ ఒక యంత్రం–ఆ నిమిషంలో జరిగింది జరిగినట్టు అక్కడే అంతమైపోతుంది. ఉత్తరంలా కలకాలం అనుభూతికి, అనుభవానికి ప్రతిబింబంలా నిలబడదు. ఈ ఆలోచన బావుందనిపించింది. రంభ మదన్‌కు ఫోన్ చేసి చెప్పేస్తే సరిపోతుందని నిర్ణయించుకుంది.




మార్ఝా మాటననుసరించి కేశవ్ ఇప్పుడు ఫ్రీస్టయిల్ కుస్తీ పోటీల్లో పాల్గొంటూ వాళ్ళ దగ్గర వుంటున్నాడు. కేశవ్ అంటే మార్ఝూకు, గామాకు ఇష్టంకి అభిమానం. దాంతో ఏకబిగిన మూడు నెల్లపాటు కుస్తీ పట్లు నేర్పారు. వాళ్ళు ఊహించిన విధంగానే కేశవ్ శరీరం ఇనుములా గట్టిపడి అద్భుతంగా తయారైంది. కేశవ్ మీద వాళ్ళకున్న ఆశ కూడా నెరవేరినట్టయింది.

మార్ఝూ, గామా రోజూ నాలుగుగంటల సేపు కేశవ్‌కు శిక్షణ ఇస్తున్నారు. కేశవ్ వాళ్ళతోపాటే స్వచ్ఛమైన నెయ్యి, పాలు, వెన్న లాంటి పౌష్టికాహారాలు మాత్రమే తింటున్నాడు. కేశవ్ అప్పటికే చాలా మెళకువలు నేర్చుకున్నాడు. కానీ ఇంకా మార్ఝూ, గామా లాంటి వాళ్ళను ఎదుర్కొనేంత నేర్పు మాత్రం రాలేదు. మార్ఝూతో రెండు పట్లు పట్టగలిగేవాడు అప్పుడప్పుడు. కానీ గామా దగ్గర మాత్రం చిత్తు అయిపోయేవాడు.

"నీలో అన్నీ వున్నాయి" గామా తన చూపులతో కేశవ్‌ను తూకం వేస్తూ అన్నాడు– "బరువు, బలం, శరీరం, పుష్టి, శక్తి అన్నీ వున్నాయి–కానీ పోరాడి గెలవాలనే ఆసక్తి ఒక్కటి మాత్రం నీ దగ్గర లేదు".

"కానీ మీరిద్దరు నా మిత్రులు, నా మేలు కోరుకునేవాళ్ళు–మీతో పోరాడి గెలవటమేమిటి!" అన్నాడు కేశవ్

"గోదాలో దిగిన తర్వాత మిత్రత్వం స్నేహం అంటూ కూర్చోకూడదు. ఎదుట మన శత్రువు, పరమ విరోధి నిలబడి వున్నాడు. మనం వాడి కాళ్ళూ, కళ్ళు విరిచేయకపోతే ఆ పని వాడు చేసిపోతాడు అనుకోవాలి. అనుకోవటం ఏమిటి అది నిజం".

కేశవ్ ఒక్కక్షణం చిరునవ్వు నవ్వాడు. మళ్ళీ అంతలోనే బిగ్గరగా నవ్వాడు. వెంటనే మార్ఝూకు ఒక్కటి ఇచ్చుకున్నాడు. కేశవ్ దెబ్బకు మార్ఝూ లుంగలు చుట్టుకుని గోదాకు ఒక మూలన పడిపోయాడు.

గామా చప్పట్లు కొడుతూ నవ్వుతున్నాడు.

"అరె మార్ఝూ! శిష్యుడు తెలివిమీరిపోతున్నాడు" అన్నాడు.

మార్ఝూ జవాబుగా లేచి నిలబడ ఒక్కసారే కేశవ్‌ను కౌగలించుకున్నాడు. కేశవ్ ఎంత ప్రయత్నించినా మార్ఝూ

పట్టులోంచి తప్పించుకోలేక పోయాడు. మరుక్షణం రెండు చేతులతో కేశవ్‌ను పైకెత్తి గోదాలో విసిరి కొట్టాడు.

ఇంతలో మేనేజర్ మాధుర్ వచ్చే నెల జరగబోయే కుస్తీల వివరాలు పట్టుకుని వచ్చాడు. మాధుర్ బక్క పల్చగా నల్లగా వుంటాడు. నడివయసులో వుంటాడు. అతడి కన్ను ఒకటి ఎప్పుడూ అదురుతుంటుంది. చూచేవాళ్ళకు కన్ను కొడుతున్నాడు అనిపిస్తుంది. దాంతో చాలామంది ఆడవాళ్ళ చేతుల్లో అనేక సార్లు చావు దెబ్బలు తిన్నాడు మేనేజర్ మాధుర్.

మాధుర్‌కు ముందు ఒక కోపిష్టి పహల్వాన్ మేనేజర్‌గా వుండేవాడు. కోపం వచ్చినప్పుడల్లా మిగతా పహల్వానులతో కలియబడేవాడు. దాంతో ఆ పహల్వానులు అతడ్ని పట్టుకుని ఎప్పుడూ చితక బాదుతుండేవాళ్ళు. మళ్ళీ కోపం తగ్గగానే అందరూ కలసిపోయేవాళ్ళు.

మాధుర్ మేనేజర్ అయిన దగ్గరనుంచి అతడ్ని కొట్టే పని కాస్త తగ్గించారు పహల్వానులు.

మాధుర్ వచ్చేనెల ప్రోగ్రాం వివరిస్తున్నాడు. గామా, మార్ఘూ ఇద్దరు కూర్చుని వింటున్నారు. అంతా చెప్పేసి మాధుర్ వెళ్ళటానికి లేచి నిలబడ్డాడు. మార్ఘూ అన్నాడు "మరి కేశవ్ ప్రోగ్రాం విషయమేమైంది?"

మాధుర్ మళ్ళీ కూర్చుని కోటుజేబు లోంచి ఒక ఫారం తీశాడు. "కేశవ్ ముందు ఈ కాంట్రాక్ట్ మీద సంతకం పెట్టాలి. తరువాత మిగతా విషయాలు" అన్నాడు.

"ఆ కాంట్రాక్టులోని షరతులేమిటి?" కేశవ్ అడిగాడు. "మేనేజర్ మాటను గౌరవించాలి. అనుమతి లేకుండా బయట నగరంలో తిరగకూడదు. ఎక్కడ గాయాలైనా అభ్యంతరం చెప్పకూడదు. వచ్చిన ఆదాయంలో సగం కంపెనీ వాళ్ళకు ఇవ్వాలి" మార్ఘూ వివరించాడు.

"సగం ఎందుకివ్వాలి?" కేశవ్ అడిగాడు–

"కుస్తీ పట్టేది నేను. దెబ్బలు తినేది నేను. మళ్ళీ సగం ఆదాయం కంపెనీకి ఇవ్వాలి. ఇదేమిటి?"

మాధుర్ అన్నాడు "నువ్వు కొత్తగా వచ్చావు కాబట్టి నీకు మా ఖర్చులు తెలియవు. కంపెనీ నడిపే ఖర్చు కాక మీ గురించి పబ్లిసిటీ ఇవ్వవలసి వుంటుంది. పబ్లిసిటీకి చాలా ఖర్చు అవుతుంది"

"నువ్వు సంతకం చెయ్యి ముందు మార్ఘూ నిర్లక్ష్యంగా అన్నాడు. కేశవ్ వెంటనే సంతకం చేశాడు. కాంట్రాక్టు ఫారం జేబులో పెట్టుకుంటూ తన స్కీం ఒకటి వినిపించాడు మాధుర్. ఆ స్కీం ఏమిటంటే – మొదట్లో చిన్న చిన్న పహల్వానులు, బలహీనంగావుండే పహల్వానులతో కేశవ్ కుస్తీ పోటీ ఏర్పాటు చేయబడుతుంది. కేశవ్ ప్రతిసారి గెలుస్తాడు. ప్రతిసారి పబ్లిసిటీ అవటంతో కేశవ్‌కు మంచి పేరు వస్తుంది. జనం దృష్టిలో కేశవ్ పెద్ద పహల్వానైపోతుంటాడు. కేశవ్ పోటీ అనగానే జనం విరుచుకు పడతారు. అలా జనంలో పేరు వచ్చాక చివరికి మార్ఘూకు, కేశవ్‌కు మధ్య పోటీఏర్పాటవక తప్పదు. అప్పుడు కేశవ్ ఓడిపోతాడు. కానీ ఈలోగా జనం దగ్గర నుంచి బాగా డబ్బు గుంజుకోవచ్చు.

"కేశవ్ ఆశ్చర్యపడుతూ అడిగాడు ముందుగా నాతో పోటీకి దిగిన పహ



ల్వాన్లులందరు ఓడిపోతారని నిశ్చయంగా మీకెలా తెలుస్తుంది? అలాగే మార్ఘూతో పోటీలో నేను ఓడిపోతానని ఎలా తెలుసు మీకు? ఆ నిమిషంలో ఏం జరుగుతుందో తెలియకుండానే అన్నీ నిర్ణయించేస్తున్నారే"

మాధుర్ అన్నాడు. "నేను చెప్పిన స్కీం ఎన్నటికీ తప్పదు. నాకు తెలుసు అదలాగే జరిగితీరుతుందని. నా ఆలోచన తప్పటం అనేది ఇంతవరకుజరగని పని. అంతేకాదు గెలిచిన వాడికి ఎంతిస్తామో, ఓడిన వాడికీ అంతే ఇస్తాం. అయితే ఎవరు గెలవాలో, ఎవరు ఓడిపోవాలో ముందే నిర్ణయించి చెబుతాం. మేం చెప్పి

నట్టు నడుచుకోక తప్పదు. మేం ఓడి పొమ్మని చెప్పినవాడు ఓడక తప్పదు. అది మా ఆజ్ఞ తెలిసిందా?"

అంతా విని కేశవ్ మండిపడ్డాడు. చివరికి అన్నాడు "అర్థమైంది."

"నేను నీకు సహాయం చేద్దామని చూస్తుంటే నా మీదే మండిపడుతున్నావు. ఏం లోకంరా నాయనా ఇది. సహాయం చేయటానికి వచ్చినవాణ్ని తన్ని పంపించే లోకం" అనుకుంటూ వెళ్ళిపోయాడు మాధుర్.

మార్ఘూ, గామా పగలబడి నవ్వుతున్నారు.



* * *

కేశవ్ మొదటి జోడీ వినాయక్ రావుతో ఏర్పాటయింది. వినాయకరావు అనుభవజ్ఞుడైన పహల్వాను. అతడికి కేశవ్‌కు తెలియని కొన్ని మెలకువలు తెలుసు. కానీ మేనేజర్ వినాయకరావును ఓడిపొమ్మని చెప్పాడు. మేనేజర్ చెప్పి నట్టు వింటే డబ్బు వస్తుంది. తరువాత మరో పెద్ద పహల్వానుని ఎప్పుడో తన చేతిలో ఓడిపోయేట్టు చేస్తాడు. అనుకుని వినాయకరావు కేశవ్ చేతిలో ఓడి పోయాడు.

కేశవ్‌కు ఐదువేలు వచ్చాయి. వాటిల్లో

రెండున్నర వేలు మేనేజర్‌కిచ్చేవాడు. మొదటి రోజుల్లో కేశవ్ అయితే ఆరోజే కాంట్రాక్ట్ ఫారం చింపేసి అక్కడనుంచి వెళ్ళిపోయి వుండేవాడు. ఇప్పుడున్నది ఆ కేశవ్ గాదు, ఈ కేశవ్ ఒక కొత్త కేశవ్. అతడు ఈ అవినీతి కరమైన ప్రపంచంలో బతకవలసిన వాడు. కాబట్టి కేశవ్ ఏం చేయలేక రాజీపడిపోయాడు. ఎలాఅయినా అతడు ఈ ప్రపంచంలో బతికి తీరాలి. తన లక్ష్యాన్ని సాధించి తీరాలి. అయితే ఇందులో కేశవ్ చేస్తున్న అవినీతి కూడా లేదు. ఈ మాయోపాయాలన్నీ పన్నుతున్నవాడు మేనేజర్. పాపం అంటేల అతడికి అంటుతుంది.

కేశవ్ రెండో జోడి షంషేర్‌సింగ్. అయితే షంషేర్‌సింగ్ చాలా బలహీనుడు. కాబట్టి కేశవ్ అతణ్ని తేలికగా ఓడించేశాడు.

మూడో జోడి గుల్జార్. గుల్జార్ అప్పటికే పెద్దపేరున్నవాడు. చాలా కుస్తీ పోటీల్లో గెల్చినవాడు. పెద్ద పెద్ద వస్తాదుల ఆశీర్వాదాలు కూడా పొంది వున్నాడు. పోటీ ఏర్పాటైంది. ఈసారి కేశవ్ చిత్తుగా ఓడిపోతాడు. గుల్జార్ గెలుస్తాడు. అని చూస్తున్న జనం అభిప్రాయపడ్డారు. అనుకున్న ప్రకారమే మొదట్లో గుల్జార్ కేశవ్ మీద మంచి దెబ్బ తీశాడు. కానీ మధ్యకొచ్చేసరికి గుల్జార్ తప్పుడు పట్లు పట్టసాగాడు. దాంతో కేశవ్ విజృంభించాడు. ఓవరికి కేశవ్‌దే పైచేయి అయింది. కేశవ్ చేతిలో గుల్జార్ చిత్తుగా ఓడిపోయాడు.

ఆ గెలుపు కేశవ్‌ను అప్పటికి హీరోగా నిలబెట్టింది. జనం కేశవ్ చుట్టుముట్టారు. కేశవ్‌ను పైకెత్తుకుంటూ గోదా చుట్టూ తిప్పి కరతాళ ధ్వనులు చేశారు. పత్రికా విలేఖరులు కేశవ్ ఫొటోలు తీసుకున్నారు. రెండో రోజు ఏ పేపర్లో చూచినా కేశవ్ విజయపరంపర అచ్చయిపోయివుంది. గోదాకే ఒక కొత్త హీరో, ఒక కొత్త నక్షత్రం అని అందరూ ప్రశంసించారు.

నాలుగో జోడి పంజాబ్‌లో పెద్ద పేరున్న పహల్వాన్ అఫ్తాబ్‌తో ఏర్పాటైంది. ఆ రోజు వరకు ఒక్క మాఝూ తప్ప అతడ్ని ఎవ్వరూ ఎదుర్కోలేక పోయారు. కానీ కేశవ్ చేతిలో అఫ్తాబ్ కూడా చిత్తుగా ఓడిపోయాడు. దాంతో కేశవ్ పేరు మోగిపోయింది. ఎవరినోట విన్నా ప్రశంసలు. జనంలో కేశవ్ అభిమానులు విపరీతంగా పెరిగిపోయారు. చివరికి కేశవ్‌కు, మాఝూకు మధ్య పోటీ ఏర్పాటు చేయాలని జనం పట్టుపట్టి కూర్చున్నారు. రోజుకి వేలకొద్దీ ఉత్తరాలు ఆ కోరికనే కోరుతూ వచ్చి పడుతున్నాయి.

ఈ సందర్భంలో మేనేజర్ మాథుర్ చాలా తెలివిగా ప్రవర్తించాడు. జనం దృష్టిని ఇంకా ఆకట్టుకోవటానికి ఈసారి ఒక యూరోపియన్ పహల్వానుకు, కేశవ్‌కు మధ్య పోటీ ఏర్పాటు చేశాడు.

అయితే ఆ యూరోపియన్ నిజానికి పహల్వాన్ కాదు. ఓ పెద్ద జేబుదొంగ. పోలీసుల దాడులకు తట్టుకోలేక ఒక రోజు అక్కడనుంచి పారిపోయి వచ్చేశాడు. ముందు ఒక ఇటలీ ఓడలో కళాసిగా చేరి అక్కడనుంచి బొంబాయి చేరుకున్నాడు. అతడి జీవితంలో ఇంత వరకు కుస్తీపట్టి ఎరుగడు. కనీసం బాక్సర్ కూడా కాదు.

కానీ మనిషి లావుగా ఎత్తుగా దృఢంగా వుండి పెద్ద పహల్వానులా కన్పిస్తాడు.




అతడి పరిస్థితి కనిపెట్టి మేనేజర్ మాధుర్ చక్కటి ఉపాయం ఆలోచించాడు. అతడి పేరుమార్చి జనం ముందు పెద్ద యూరోపియన్ పహల్వానులా నిలబెట్టాడు. విపరీతంగా పబ్లిసిటీ చేశాడు.

భారతదేశంలో ప్రజల దృష్టిలో తమ పహిల్వాను ఒక విదేశీ పహల్వానును ఓడించాడని తెలిసే చాలు మన పహల్వానును ఆకాశానికెత్తేసారు. ఆ విదేశస్థుడు ఎవడు, ఎంతటి శక్తివంతుడు ఇవన్నీ అవసరం లేదు. అతను ఓడిపోయి భారత పహల్వాను గెలిస్తే చాలు. స్వాతంత్ర్యం వచ్చాక కూడా జనంలో తగ్గని ఈ మూర్ఖత్వాన్ని మేనేజర్ మాధుర్ చక్కగా పసికట్టాడు. వెంటనే పహల్వానులా కనిపిస్తున్న జేబుదొంగను గొప్ప యూరోపియన్ పహల్వానును చేసేశాడు. అతడి అసలు పేరు విటోరా. మాధుర్ దాన్ని మార్చి బంగా-బంగా అని ప్రచారం చేశాడు.

విటోరా తిరిగి తన స్వదేశానికి వెళ్ళిపోవాలనుకుంటున్నాడు. వెళ్ళాలంటే డబ్బు కావాలి అందుకని అతడు వెంటనే ఒప్పేసుకున్నాడు. నాలుగు దెబ్బలు తిన్నాసరే ఈ దేశం నుంచి తన దేశం వెళ్ళిపోగలిగితే చాలనుకున్నాడు. నిజానికి విటోరా ఓడినా పదివేలు ఇవ్వాలి. కానీ మాధుర్ మాయచేసి కేవలం మూడువేలు మాత్రమే ఇస్తానని మిగతా ఏడువేలు తను తీసుకుంటానని, అలా అయితే కుస్తీపోటీలో పాల్గొనిస్తానని షరతు పెట్టాడు. వేరే గత్యంతరం లేక విటోరా అంగీకరించాడు.

బంగా బంగాని ఓడించటం అతి తేలికైన పని అయిపోయింది కేశవ్‌కు. అయితే బంగా బంగా మొదట్లో పహల్వానులా నటిస్తూ నాలుగు దెబ్బలుతినక తప్పలేదు. తరువాత దెబ్బలకు తట్టుకోలేక కింద పడి పోయాడు. అతడి నోటి వెంట, ముక్కు వెంట రక్తం ధారలు కట్టింది. యూరోపియన్ పహల్వాను నోటి వెంట రక్తం చూచి జనం పిచ్చెత్తి పోయారు. కేశవ్‌ను మరింత ఆకాశానికెత్తేశారు. ఆనందంలో పిచ్చిపట్టినట్టు అందరూ కేశవ్‌ను ఎత్తుకుని చప్పట్లు కొట్టుకుంటూ జయజయధ్వానాలు చేస్తూ ఊరేగించారు.

ఈ సారి జనం తమ అభిమాన హీరోకు, మార్షూకు మధ్య, లేదా గామాతో పోటీ ఏర్పాట్లు చేయమని పదే పదే అడగసాగారు. ఈ వ్యవహారంలో మేనేజర్ మాధుర్ ముందే ఒకనిర్ణయానికొచ్చాడు. పోటీ కేశవ్‌కు, మార్షూకు మధ్య జరుగుతుంది. ఓడిన వాడికి పదిహేను వేలు, గెలిచినవాడికి యాభై వేలు డబ్బు దొరుకుతుంది. ఈ సారి కేశవ్ ఓడిపోవాలని కూడా నిర్ణయించాడు.

ఈ కుస్తీ పోటీలు నిజానికి న్యాయమైన పోటీలు కావు. ఒక ఆట కూడా కాదు. కేవలం వ్యాపారం. ఈ వ్యాపారం మాధుర్ అనుకుంటున్న విధంలా నడిస్తేనే లాభాలు వస్తాయి. కేశవ్ కూడా ఆనందంగా వున్నాడు. ఇంతవరకు వరుసగా అందరి మీద గెలవటంతో అతడి బ్యాంక్ బాలెన్స్ కూడా బాగానే పెరిగింది. కేశవ్ మరీ ధనవంతుడైతే కాలేదు గానీ ఇప్పుడు పేదవాడు మాత్రం కాదు. దారిద్ర్యం నుంచి బయట పడ్డాడు. ఈసారి మార్షూతో ఓడిపోతే మరొక ఏడున్నర వేలు వస్తాయి. అసలు పదిహేను కానీ సగం మాధుర్‌కు పోతాయి.

కేశవ్‌కు హఠాత్తుగా శివుడి మీద భక్తి పుట్టింది. శివుడు తన పట్ల

చాలా దయగా వున్నాడనిపించింది. కానీ అంతలోనే మరో ఆలోచన కూడా వచ్చింది. ఈ రెండో ఆలోచన మొదటి ఆలోచనను చిత్తు చేసింది—ఎవడా శివుడు? ఎక్కడ వుంటాడు ? ఎలా వుంటాడు ? అంతా అబద్ధం. తనూ అందరి లాంటి మామూలు మనిషి. ఈ ప్రపంచంలో బతకటానికి ఈ యుగంలోనే పుట్టిన [illegible] ఇక్కడి కష్టనష్టాలు అనుభవించటానికి పుట్టాడు. ఏదో మతి భ్రమణం వల్ల వూరు, తల్లి దండ్రుల పేరు మర్చిపోయాడు. ఇందులో శివుడి దయఏముంది?




మూర్షాతో కుస్తీపోటీ ఇంకా రెండు రోజులుందనగా కేశవ్ గుర్రప్పందాల కోసం పూనా బయలుదేరాడు. రైల్లో ప్రయాణిస్తున్నాడు. కేశవ్ పక్క పెట్టెలో హటాత్తుగా శోభ కనిపించింది. ఆమె నుదుట కుంకుమ, పాపిట సిందూరం మెరిసిపోతున్నాయి. చూడగానే సిగ్గు పడుతున్న కొత్త పెళ్లికూతురు అనిపిస్తోంది. నిజానికి కొత్త పెళ్ళికూతురు కాదు. కానీ ఆమె కళ్ళల్లో ఆ రోజు ఒక పవిత్రమైన కాంతి, ముఖమ్మీద అమాయకత్వం నిండిన సిగ్గు కనిపిస్తోంది. కేశవ్ శోభను చూడగానే త్రుళ్ళిపడ్డాడు. ఆశ్చర్యంగా ఆమె దగ్గరకు వెళ్లి పిలిచాడు.

"శోభా!"

శోభ ముఖం ఒక్క క్షణంపాటు కళావిహీనమైపోయింది.

"ఎక్కడికి వెళ్తున్నావు ?" కేశవ్ మళ్ళీ అడిగాడు.

"తిరిగి మా వూరు వెళ్లిపోతున్నాను"

"ఎందుకు?"

"నేను పెళ్లి చేసుకున్నాను" శోభ పమిటి కొంగులో ముఖాన్ని దాచుకుంటూ అంది. ఆమె ముఖం లజ్జా భారంతో ఎర్రగా కందిపోయింది. శోభ ఆ స్థితిలో చాలా శాంతిగా వున్నట్టు కనిపించింది.

"ఎవరిని?" కేశవ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"పండిత్ దీన్‌దయాల్‌ని. ఆతడికి శివాలయంలో సగం వాటా వుంది.''

"కానీ... నీ... నీ... ఆ సేటు సంగతి ఏమైంది?"

"హుష్... నెమ్మదిగా మాట్లాడు. ఆయన కూజాలో నీళ్ళు పట్టుకురావట-నికి వెళ్ళారు. వచ్చేస్తూనే వుంటారు" శోభ ఒక్క నిమిషం ఆగి అంది. "ఆ సేటు నన్ను మరో సేటుకు అమ్మేశాడు. అవును దాన్ని అమ్మకమే అంటారు. మొదట నేను చాలా కంగారు పడిపోయాను. కానీ రెండో సేటు మొదటి సేటుకన్నా మంచివాడు. నన్ను అన్ని విధాలా ఆనందంగానే వుంచే ప్రయత్నం చేశాడు. కానీ అతడు ఒకరోజు నాకు ఇరవై వేల రూపాయలు హటాత్తుగా ఇచ్చి "ఇప్పుడు నాకు నీలాంటి స్త్రీల అవసరం లేదు. నువ్వు ఎక్కడికి వెళ్ళదల్చుకుంటే అక్కడికి వెళ్ళవచ్చు. ఎందుకంటే త్వరలో నా పెళ్లి కాబోతుంది,నీ మొదటి సేట్ కూతురు రంభతో నా పెళ్లి జరుగుతుంది" అన్నాడు.

"రంభా !'' కేశవ్ ఉలిక్కిపడ్డాడు.

ఎవరో తన కడుపులో బల్లెం గుచ్చినట్లు అనిపించింది. స్పృహ తప్పబోతున్నట్లు అనిపించింది. వెంటనే రెండు చేతులతో రైలు కిటికీ ఊచలు గట్టిగా పట్టుకున్నాడు.

"ఏం? రంభ మీకు తెలుసా?" శోభ అడిగింది. మళ్ళీ శోభ చెప్పసాగింది- "రంభ జౌహారీ సేట్ కూతురు. ఆమె తోనే భగీరథ్ సేట్ పెళ్ళి కాబోతోంది. భగీరథ్ సేట్ ఆరోజు నాకు ఇరవై వేలిచ్చి నీ ఇష్టం వచ్చిన చోటుకు పొమ్మన్నాడు. అంతకుముందే నేను మరో ముప్పైవేలు దాచి వుంచాను. నా దగ్గర మొత్తం యాభై వేలున్నాయి. అప్పుడు ఇంత డబ్బు దగ్గర వుంచుకుని ఇంకా ఈ మురికి కూపంలో వుండకూడదని నిశ్చయించుకున్నాను. వెంటనే బయట పడటానికి మార్గాలు ఆలోచించాను. వెంటనే ఒక మంచి భర్తను కొనుక్కోవాలనుకున్నాను. భర్త లేకుండా స్త్రీకి ముక్తి లభించదని మీకు తెలుసుకదా?

"అందరికన్నా ముందు నాకు మీరే గుర్తుకొచ్చారు. కానీ మీరు అప్పటికే నన్ను ఎన్నోసార్లు గాయపర్చి వున్నారు. కాబట్టి మిమ్మల్ని అడగాలనుకోవటం అనవసరమనుకున్నాను. అప్పుడు ఈ దీన్‌దయాల్‌తో మాట్లాడి పెళ్ళి చేసుకున్నాను. ఈయన మా వూరినుంచి ఏదో పనిమీద బొంబాయి వచ్చి వున్నారు. హటాత్తుగా నాకు కనిపించారు. మొదట ఆయన పెళ్లికి అంగీకరించలేదు. కానీ నా దగ్గర యాభై వేలున్నాయని తెలియగానే వెంటనే ఒప్పుకున్నాడు. పెళ్లి చేసుకుని నన్ను మా వూరికి తీసుకెళుతున్నాడు. అక్కడికెళ్ళాక ఏదైనా వ్యాపారం చేసుకుందామనుకుంటున్నాం...అరె ఆయన వస్తున్నారు. ఇక మీరు వెళ్ళండి. నేను ఒక అపరిచిత వ్యక్తితో మాట్లాడుతుండటం ఆయన చూస్తే బావుండదు"

అంతవరకు చెప్పి శోభ ఒక చిరునవ్వు నవ్వింది. ఆమె కళ్ళల్లో తను నిర్మించుకోబోతున్న భవిష్యత్తు తాలూకు స్వప్న సౌధాలు కనిపిస్తున్నాయి.

నిజానికి కేశవ్ అప్పటివరకు శోభ చెప్పిన మాటలేవీ సరిగ్గా వినలేదు. రంభ కబురు వినగానే అతడి గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి. పెద్ద ఇనుప లోలకంతో గడియారం లోపల గుండెల్లో ఆడుతున్నట్టనిపించింది.

రంభ పెళ్ళి భగీరథ్‌తోనా? అవును ఎందుకు కాకూడదు. కానీ రంభ తనను ప్రేమించింది. ప్రేమించానంది. శివుడి ముందు పెళ్లికి ఒప్పుకుంది. కానీ ఇప్పుడు భగీరథ్‌ను పెళ్ళి చేసుకుంటోంది. ఎలాంటి ప్రేమ ఇది? రంభ ప్రేమించానంటే నువ్వెలా నమ్మావు? ఈ రోజుల్లోమెత్తటి కౌగిళ్ళు, వెచ్చటి ముద్దులు చూచి ప్రేమ అనుకుంటే సరిపోతుందా? వాటిని పూవుల్లా తెంపుకొచ్చి ఆ రోజుకు ఫ్లవర్ వాజ్ పెట్టుకుంటారు. తెల్లారేసరికి అవి వాడిపోతాయి. వాటిని బయటకు విసిరివేస్తారు. రెండో రోజు మళ్ళీ కొత్త పూలు, కొత్త స్పర్శలు మొదలవుతాయి. ప్రియుళ్లు మార్చివేయబడతారు. కేశవ్ తనను తనే ప్రశ్నించుకుంటున్నాడు.

ఆ అమ్మాయిని ఎందుకంత దారుణంగా నమ్మావు? గుండెల నిండా ఎందుకు నింపుకున్నావు? జీవితాంతం నీ కోసం ఎదురుచూస్తూ కూర్చుంటుందని-కనీసం నిన్ను తల్చుకుంటుందని ఎలా విశ్వసించావు. చూడబోతే నీ వూహల్లో రంభ తన డ్రాయింగ్ రూంలో సోఫాలో కూర్చుని 'కేశవ్...కేశవ్' అని నీ నామ

జపం చేస్తూ కూర్చుని వుంటుందని భ్రమించినట్టున్నావు. పిచ్చివాడా?

తనచుట్టూవున్న ప్రపంచం ఒక్కసారిగా కూలిపోతున్నట్టు అనిపించింది. భూకంపం వచ్చి తను నిలబడి వున్న ప్లాట్‌ఫారం రైల్వే స్టేషన్ గిర్రున తిరిగి తిరిగి భూమిలోకి కూరుకుపోతున్నట్టనిపించింది.

కేశవ్ రైలు పెట్టెలోకి ఎక్కి తడబడుతున్న అడుగులతో నడుస్తున్నాడు. తన సీటు మీద పడిపోయాడు. చాలాసేపటివరకు దప్పిక గొన్న పిచ్చి కుక్కలా రొప్పుతూ వుండిపోయాడు. తరువాత అతి కష్టమ్మీద లేచి నిలబడి ఫ్లాస్కులో వున్న చల్లటి నీళ్ళు తాగగలిగాడు. ఎలాగో తనను తాను అదుపులో పెట్టుకుంటూ సీటులో చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు. ఆలోచిస్తున్నాడు.

ఆ అమ్మాయికోసం ఎంతగా పరితపిస్తూ తిరిగాడు తను. ఎన్ని కష్టాలు,ఎన్ని నష్టాలు ఎదుర్కొన్నాడు. ఎన్ని ఎదురు దెబ్బలు తిన్నాడు. నిజానికి ఒక చిన్న కుటీరంలో ఆ అమ్మాయితో సుఖంగా వుండవచ్చు. జీవితాంతం శాంతిగా బతకవచ్చు. కానీ ఆమె సుఖం కోసం, ఆమె సంతోషం కోసం తన జీవితపు పెద్ద పెద్ద ఆదర్శాలు, నమ్ముకున్న ఉన్నతమైన సిద్ధాంతాలు, ఆత్మ తాలూకు విలువలు సమస్తం వదిలివేశాడు. విసిరి పారేసుకున్నాడు, ఇప్పుడు పహిల్వానుల ముష్టిఘాతాలు తిని ఎలాగో డబ్బు సంపాదించాడు. కానీ అమ్మాయి దూరంగా వెళ్ళిపోతోంది. భగీరథ్‌ను ప్రేమించేస్తోంది. పెళ్ళి చేసుకుంటోంది. ఎందుకని? భగీరథ్ దగ్గర నోట్లు కట్టలు కట్టలు పడి వున్నాయి. ఆ గాడిదకు ఒక వీణాస్వరం తెలియదు. ఒక్క రాగాన్ని ఆస్వాదించలేదు. జీవన సౌందర్యం అణువంతైనా తెలియదు. కానీ ఆ గాడిద దగ్గర బోలెడు డబ్బుంది. కాబట్టి ఆ గాడిద కేశవ్‌కన్నా చాలా గొప్పదైపోయింది. ఈ కేశవ్ ప్రేమ, ఉన్నతమైన ఆత్మ విలువలు, పరితపించే హృదయం, నిజాయితీ ఇవి ఎవరికీ కనిపించవు. ఎవరికీ అవసరమూ లేదు. కానీ ఆ కనిపించే వ్యామోహపరిచే వస్తువు పేరు రూపాయి. కానీ రాగం రూపాయి కన్నా గొప్పది. చాలాగొప్పది. దాన్ని బాంకులో వేయజాలరు. ఎవ్వరూ వేయజాలరు. హృదయం రూపాయికన్నా గొప్పది. దాన్ని చెక్కులా మార్చలేదు. ఎవ్వరూ మార్చలేరు. అనుభూతి నిజమైన ప్రేమ బజారులో కొంటే దొరకదు. ఆత్మ సౌందర్యం శ్రీమంతుల భోషాణాలలో బందీ అయివుండదు. కానీ ఏమిటీ ప్రపంచం ఇలా వుందేమిటి ? ఈ విలువలు ఇంత క్షుద్రంగా, నీచంగా వున్నాయెందుకు?

కేశవ్ గుండెల్లో ఒక లావా బద్దలవుతోంది. మస్తిష్కం ఉడికిపోతోంది. రక్తనాళాల్లో నిప్పుకణాలు ప్రవహిస్తున్నాయి. శరీరం అంతరాంతరాలన్నింటా విస్ఫులింగాలు ఎగురుతున్నాయి. పూనాలో గుర్రప్పందాల్లో వున్నంత సేపూ కేశవ్ చాలా నిర్లక్ష్యంగా డబ్బును పందెంగా ఒడ్డాడు. చిత్తు కాగితాల్లా భావించి విసిరివేశాడు. కానీ ముప్పైవేలు గెల్చుకున్నాడు. ఎందుకు గెల్చుకున్నాడో తెలియదు. ఆ డబ్బులు అంతే నిర్లక్ష్యంగా జేబులో కుక్కుకున్నాడు. ఇప్పుడు ఆ కాగితాల వల్ల లాభమేముంది? వాటికి అర్థమేముంది? జేబులో నిండిన ఈ పిచ్చి కాగితం ముక్కలు ఎందుకు? ఏం చేసు

కుంటానికి!?

తనవద్ద ఇప్పుడున్న డబ్బుతో ఒక అందమైన ఫ్లాట్, ఒక కారు, ఒక టెలిఫోన్ కొనగలడు కేశవ్. కానీ ఎవరి కోసం? జీవితాన్ని చాలా అందంగా ఊహించుకున్నాడు. కళ్ళల్లో ఒక సుందర మందిరాన్ని నిర్మించుకున్నాడు. సౌందర్యాన్ని, ప్రేమనీ ఆరాధించాడు. కానీ ఇప్పుడుఅవన్నీ కేశవ్‌ని నిర్లక్ష్యంచేసి వెళ్ళిపోయాయి. తన దుఃఖాన్ని రూపాయలతో చెప్పుకుంటే తీరుతుందా? ఆ నోట్లు అతడి బాధను తీర్చగలుగుతాయా? ఒక యుగ కాలం ఆ నోట్లు పిండుతూ నిలబడినా ఒక్క కన్నీటి బొట్టు రాదే? ఆ శుష్కమైన కాగితం ముక్కలు దుఃఖాన్ని ఎలా వినగలుగుతాయి. శోభలా కేశవ్ ఒక మూర్ఖుడు కాదు - కాలేడు. తన దగ్గర ఉన్న డబ్బులతో ఒక భార్యను కొనుక్కోజాలడు. అతడి దొక కళాకారుడి హృదయం. సంగీతమయమైన ప్రపంచం. కానీ దురదృష్టవంతుడు. అన్ని పందాల్లో నెగ్గాడు. ప్రేమ పందెంలో మాత్రం చిత్తుగా ఓడిపోయాడు.

కేశవ్ ఆ రోజే బయలుదేరి పూనా నుంచి బొంబాయి చేరుకున్నాడు. కేశవ్‌ను తీసుకెళ్ళటానికి మాథుర్ స్టేషన్‌కొచ్చాడు. రేపే కుస్తీ పోటీలు.

మాథుర్ కేశవ్‌ని ఒక హోటల్ గదిలో దించాడు. ఆ గది ఇరవై రోజులుగా కేశవ్ కోసం బుక్ చేయబడివుంది. రాత్రంతా కేశవ్ ఆ గదిలో ఒంటరిగా కూర్చుండిపోయాడు. రెండో రోజు ఉదయాన్నే బ్యాంక్‌కెళ్ళి వున్న డబ్బంతా డ్రా చేసుకొచ్చి రూంలో పడేశాడు. తరువాత గోదా దగ్గర కొచ్చేశాడు. గామా దగ్గర రెండు గంటలసేపు కుస్తీ శిక్షణ పొందాడు. మార్ఝూ నవ్వుతూ చూస్తుండిపోయాడు. ఎందుకంటే ఈ అందమైన శరీరం వున్నా, అందమైన హృదయమున్నా కేశవ్ ఓడిపోతాడు. తను గెలుస్తాడు.

* * *

స్టేడియం జనంతో కిక్కిరిసి పోయి వుంది. తమ అభిమాన పహిల్వాన్ కేశవ్‌కు, మార్ఝూకు మధ్య జరగనున్న పోటీ చూద్దామని ఎన్నాళ్ళుగానో ప్రజలు ఎదురు చూస్తున్న రోజు రానే వచ్చింది. జనం విరుచుకుపడ్డారు. అధిక సంఖ్యాకులు కేశవ్ గెలిస్తే బావుంటుందని అనుకుంటున్నారు. అతడి గెలుపునే మనసారా కోరుకుంటున్నారు. కేశవ్, మార్ఝూ ఇంకా గోదాలోకి దిగలేదు. జనం వాళ్ళకోసం అశాంతిగా ఎదురుచూస్తున్నారు. కేకలు, ఈలలు వేస్తున్నారు.

కాసేపట్లో మైకులో అనౌన్స్‌మెంట్ వినిపించింది. కేశవ్, మార్ఝూ గోదాలోకి దిగారు. కుస్తీ పోటీ ఆరంభమైంది. నాల్గు రౌండ్లవరకు మార్ఝూ పైచేయిగా వున్నాడు. ఐదో రౌండ్‌కొచ్చేసరికి కేశవ్‌ది పైచేయి అయింది. ఆరో రౌండ్‌లో మార్ఝూ గెలవాలి. కేశవ్ ఓడిపోవాలి అని ముందే నిర్ణయించి వుంచాడు మేనేజర్ మాథుర్.

రెండు మూడు సార్లు కేశవ్ చెవి దగ్గర ఓడిపో, కింద పడిపో అని మార్ఝూ గొణిగాడు. కానీ కేశవ్ వినిపించుకోలేదు. మరింత పట్టుదలతో పోరాటం సాగిస్తున్నాడు.

కేశవ్ ఆలోచించాడు. ఈ ప్రపంచంలో ఇంకా నీతి పాటించటం అనవసరం. నిజమే! మార్ఝూ తనకు ప్రియమిత్రుడు. అతడే

తనను పహల్వాన్ని చేశాడు. ఆదు కున్నాడు. తననీ స్థితికి తీసుకొచ్చాడు. కానీ ప్రేమకూ, స్నేహానికీ విలువ, అర్థం లేని అవినీతికరమైన, క్షుద్రమైన ప్రపంచంలో బతుకుతూ ఏవో ఉన్నత విలువలను పాటించాలనుకోవటం, నీతికి కట్టుబడి వుండటం అనవసరం. అవివేకం; అలాంటప్పుడు తను ఎందుకు ఓడిపోవాలి? ఓడిపోను- పోరాడతాను-యాభై వేల బహుమతి గెల్చుకుంటాను. ఇంత డబ్బు గెల్చుకునే అవకాశం మళ్ళీ రాకపోవచ్చు. వచ్చినా రాకున్నా తనకనవసరం. నీతీ, న్యాయం, స్నేహం, ప్రేమ అనవసరం. పోరాడతాను–

ప్రాణాలకు తెగించి పోరాడుతున్న కేశవ్‌ను చూచి మార్ఖూ ఆశ్చర్యపోయాడు. మళ్ళ ఓడిపొమ్మని చెప్పాడు. కేశవ్ వినలేదు. మార్ఖూ కోపంతో ఎదురు తిరిగాడు. కేశవ్ కీళ్ళూ కాళ్ళూ నిలువునా విరిచేసే భయంకరమైన పట్టు పట్టటానికి, దెబ్బలు వేయటానికి నిర్ణయించుకున్నాడు. మార్ఖూ బలంకొద్దీ దెబ్బ తీయాలని తీస్తున్నాడు. ఫ్రీస్టయల్ కుస్తీలో ఎలాంటి దెబ్బ తీయటానికైన అనుమతి ముందునుంచే వుంది. మార్ఖూకు పోను పోను కోపం పెరిగిపోయింది. కేశవ్‌ను విపరీతంగా కొట్టాడు. కేశవ్ నోటి నుంచి, ముక్కు నుంచి రక్తం ధారలు కట్టింది. అయినా కేశవ్ చలించ లేదు. మరికాస్త పట్టుదలతో ప్రాణాలకు తెగించి పోరాడుతున్నాడు. విజయమో, వీరస్వర్గమో ఏదో ఒకటి తేల్చుకునే విధంగా వున్నాడు. చచ్చిపోతాడు. కానీ ఓడిపోడు. ఈ భావన మనసులో చోటు చేసుకున్న క్షణంనుండి కేశవ్ అన్నిటికీ తెగించి నిలబడ్డాడు. నిజానికి కేశవ్ కన్నా మార్ఖూ చాలా బలవంతుడు, అనుభవజ్ఞుడు. కేశవ్‌కు తెలియని అనేక కుస్తీ రహస్యాలు తెలిసినవాడు.

ప్రజలు కళ్ళు చించుకుని చూస్తున్నారు. ఇంతవరకు కనీ వినీ ఎరుగని, వాళ్ళు చూడని కుస్తీపోటీ ఆ రోజు వాళ్ళ కళ్ళ ముందు జరుగుతోంది. అందరూ ఆసక్తిగా, ఆశ్చర్యంగా గుండెలు బిగపట్టుకుని చూస్తున్నారు. అందరూ తమ అభిమాన హీరో కేశవ్ గెలవాలని కోరుకుంటున్నారు. కేకలు వేస్తున్నారు.

మార్ఖూ తనకు తెలిసిన కుస్తీ రహస్యాలన్నీ, భయంకరమైన మెళకువలన్నీ ప్రయోగించాడు. కానీ కేశవ్ రక్తసిక్తమై పోయి కూడా పోరాడుతూనే వున్నాడు. శరీరాన్ని ఇంకా గట్టిగా బిగపట్టుకుని నిలబడే వున్నాడు. చివరికి మార్ఖూ అలసిపోయాడు. ఇంక పోరాడలేడు అని కేశవ్ తెలుసుకున్నాడు. అదే మంచి అదును. దాటితే మార్ఖూను ఓడించటం సాధ్యపడదు. అంతే కేశవ్ బలాన్నంతా కూడదీసుకుని ఒక్క ఉదుటన మార్ఖూను రెండు చేతులమీద పైకెత్తాడు. ఒక్క క్షణం మాత్రమే జనం ఆ దృశ్యాన్ని లీలగా చూడగలిగారు. మరు క్షణంలో మార్ఖూ అచేతనంగా స్పృహ లేకుండా కిందపడి వున్నాడు.

* * *

మేనేజర్ మాధుర్ ఆఫీసులో కూర్చుని కోపంతో చిందులు తొక్కుతున్నాడు. "నువ్వు మార్ఖూని మోసం చేశావు?" అన్నాడు కేశవ్‌తో

కేశవ్ రక్తసిక్తమై మాధుర్ ఎదురుగా నిలబడి వున్నాడు. అతడి కళ్ళల్లో రక్తపు జీరలు కదం తొక్కుతున్నాయి.

మాధుర్ మాటలు విన్న మరుక్షణమే కేశవ్ చెయ్యెత్తి మాధుర్ ముఖం పగిలిపోయేటట్టు ఒక దెబ్బ వేశాడు.

"తే- నా యాభై వేలు."

మాధుర్ భయంతో వణికిపోతూ యాభై వేలు తీసి కేశవ్ చేతికిచ్చాడు. ఆ యాభై వేలు, అంతకుముందు బ్యాంక్ లోంచి డ్రా చేసుకొచ్చిన యాభై వేలు తీసుకుని టాక్సీలో రంభ ఇంటివైపు బయలుదేరాడు కేశవ్. అతడి నోటివెంట, ముక్కు వెంట ఇంకా రక్తం ప్రవహిస్తూనే వుంది. మొహంనిండా రక్తం గడ్డ కట్టుకుపోయి వుంది. కేశవ్ ఆవేవీ లెక్క చేసే స్థితిలో లేడు. అలాగే బయలుదేరాడు.

మనసులో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నప్పుడు ఇంక శరీరాన్ని శుభ్రం చేసుకుని మంచి దుస్తులు వేసుకుని బయలుదేరటం అనవసరం అనిపించింది, కేశవ్ ఒక్కటే కోరుకుంటున్నాడు. ఆ క్షణంలో సాధ్యమైనంత త్వరగా రంభ దగ్గరగా చేరుకుంటాడు.

ఆ లక్ష రూపాయిలు- ఆ దగుల్బాజీ రంభ, మోసగత్తె రంభ, తిరుగుబోతు రంభ, అబద్ధీకురాలు రంభ, అవినీతి నిండిపోయిన రంభ మొహమ్మీద ఈడ్చి కొడ్తాడు. ఆ విశ్వాసఘాతకురాలి మొహమ్మీద ఆ మొత్తం నోట్లు గుమ్మరించేస్తాడు.

"టాక్సీ స్పీడుగా పోనీ" కేశవ్ పళ్ళు నూరుతూ టాక్సీడ్రైవర్ని ఆజ్ఞాపించాడు.

మధ్యలో ఒన్వే ట్రాఫిక్ దగ్గర టాక్సీ ఆగిపోయింది. "ఆ పచ్చలైటు వెలిగేవరకు మనం కదలటానికి వీల్లేదు" అన్నాడు డ్రైవరు.

"టాక్సీ ముందుకు త్వరగా పరుగెత్తించు. పచ్చలైటుకోసం ఎదురుచూచే ఓపిక లేదు. సమయం లేదు. పోనీ పర్వాలేదు. మరో వంద రూపాయిలు అదనంగా ఇస్తాను" అన్నాడు కేశవ్.

"సార్! మీరు వందగాదు-లక్ష ఇచ్చినా ట్రాఫిక్ రూల్స్కు విరుద్ధంగా నేను కారు నడపను" టాక్సీ డ్రైవర్ శాంతంగా అన్నాడు.

కేశవ్ జేబులోంచి రివాల్వర్ బయటకు తీశాడు. కానీ అదృష్టంకొద్దీ ట్రాఫిక్ సిగ్నల్ అయింది. పచ్చలైటు వెలిగింది. టాక్సీ ముందుకు పరుగెత్తింది.

టాక్సీ వేగంగావచ్చి జౌహరి దుకాణం ముందు ఆగింది. కేశవ్ ఒక్క ఉదుటన టాక్సీలోంచి దిగి చకచకా మెట్లెక్కి పైకి చేరుకున్నాడు.

భగీరథ్ తలుపుల పక్కనే నిలబడి వున్నాడు. కూలీలు జౌహరి సామానులు బయిటకు మోస్తుంటే చూస్తున్నాడు.

"రంభ ఎక్కడుంది?" కేశవ్ ఒక్క అడుగు భగీరథ్వైపు వేస్తూ అడిగాడు.

"రంభ పారిపోయింది-లేచిపోయింది"

"లేచిపోయిందా?" కేశవ్ ఉలికిపాటుతో అడిగాడు.

"అవును మదన్తో పారిపోయింది" భగీరథ్ చెప్పేసి తన పనిలో నిమగ్నమైపోయాడు.

"రంభ మదన్ ఇంటి దగర వుంటుందా?" కేశవ్ మళ్ళీ అడిగాడు. "లేదు అక్కడ కూడా లేదు" భగీరథ్ నెమ్మదిగా అన్నాడు "వాళ్ళు......వాళ్ళిద్దరు ఎల్లోరాకు పారిపోయారు"

"ఎల్లోరా? ఎల్లోరాకు ఎందుకు పోయారు?"

"ఎల్లోరాకు దగ్గరలో కొత్తగా త్రవ్వకాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ ఆధ్వ

ర్యంలో ఆ పని మొదలైంది. అందు కని కేంబ్రిడ్జ్‌నుంచి హిస్టరీ ప్రొఫెసర్ జేస్‌మిన్ హిల్టన్‌ని పిలిపించారు. హిల్టన్ మదన్‌ని ఆరు నెలలుపాటు తనకు అసి స్టెంటుగా వుండమని కోరాడు" భగీరథ్ నిరాశగా అంతా వివరించాడు.

"కానీ...కానీ...రంభ మిమ్మల్ని చేసుకోబోయింది కదా?" కేశవ్ ఆశ్చ ర్యంగా అడిగాడు.

"ఆఖరి క్షణంలో రంభ తన అభి ప్రాయాన్ని మార్చుకుంది. తాను మదన్ని ప్రేమిస్తున్నానని చెప్పింది"

ఆ మాట చెప్పి భగీరథ్ ముఖాన్ని మరో వైపుకు మరల్చుకున్నాడు. కేశవ్ తలమీద పిడుగు పడినట్టయింది. స్తంభించి పోయి అలాగే నిలబడిపోయాడు.

జౌహరీ సేట్ సామానంతా బయటకు చేరవేస్తున్నారు. కేశవ్ భగీరథ్‌ని అడి గాడు "జౌహరీసేట్ సామానంతా ఎక్క డికి పోతుంది?"

"బయట రోడ్డు మీదకు!"

"ఎందుకు?"

"ఎందుకంటే వ్యవహారం మధ్యలోనే తెగిపోయింది. జౌహరీ రంభను నాకిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. కానీ చేయలేక పోయాడు. అతడు నాకు చాలా డబ్బులు బాకీ వున్నాడు. అందుకని నేను అతడి మొత్తం ఆస్తిపాస్తుల్ని బాకీ కింద ఆక్ర మించుకున్నాను" భగీరథ్ చాలా మామూ లుగా చెప్పాడు.

"చాలా మంచిపని చేశారు మీరు" కేశవ్ భగీరథ్‌ను అభినందిస్తూ అతడి చేతిని బలంగా నొక్కాడు. వెంటనే వెను తిరిగి వచ్చి టాక్సీలో కూర్చున్నాడు.

* * *

ఎల్లోరాలో సూర్యుడు అస్తమించాడు. ఆ ప్రాంతంలో రాత్రి ఉదాసీనమైన చీకటితో ఆరంభమైంది. రంభ సామాను ల్లోంచి లాంతరు తీసి వెలిగించి టేబిల్ మీద పెట్టింది. ఓ నవల తీసి చదవ సాగింది.

పుస్తకం చదివే ముందు ఎల్లోరా ఉత్తర భాగం వైపు చూసి తరువాత పుస్తకం మొదలుపెట్టింది. అటు ఉత్తర భాగాన త్రవ్వకం జరుగుతోంది. మదన్ ఇంకా అక్కడే వున్నాడు.

రంభ వాచీ చూసుకుంది. ఆరయింది. మరో అరగంటలో మదన్ వచ్చేస్తాడు. పుస్తకంలో ఇంక ఎన్ని పేజీలు మిగి లున్నాయో చూసింది. ఇంక ముప్పై పేజీలు మాత్రం మిగిలున్నాయి. నిస్సం దేహంగా మదన్ వచ్చేలోపు పుస్తకం పూర్తి అయిపోతుంది. రంభ నిశ్చింతగా ఓ శ్వాసపీల్చుకుని కుర్చీమీద కూర్చుంది. పుస్తక పఠనంలో మునిగిపోయింది. పుస్తకం పేజీల్లోంచి ఒక చిత్రమైన కాగి తపు సుగంధం వస్తోంది. దానికి ఆమె తలలోన పెట్టుకున్న మొగిలిపూల పరి మళం కూడా తోడైంది. ఆ పరిమళాలతో పాటు అక్షరాల మధ్య తన ప్రియమైన మదన్ ముఖం ముద్దుముద్దుగా కనిపిస్తోంది. ఈ పాటికి బయలుదేరే వుంటాడు. తన కాకి ఫ్యాంట్‌కు అంటుకున్న మట్టిని దులుపు కుంటూ గడియారం చూసుకుంటూ వచ్చే స్తూనేవుంటాడు. త్రవ్వకాల్లో బయటపడిన చారిత్రక శిథిలాల గురించి ఆలోచించి అలసిపోయి, ప్రొఫెసర్ హిల్టన్‌తో చర్చించి అలసిపోయి వస్తూనే వుంటాడు.

పువ్వుల గురించి, వెన్నెల గురించి,

చుక్కల గురించి మాట్లాడని మదన్.. ఎప్పుడూ ప్రత్వకాల్లో బయటపడిన పాత శిల్పాలను గురించి మాత్రమే ఆలోచిస్తూ తిరిగే మదన్...రంభను చూడగానే అన్నీ మర్చిపోతాడు. చరిత్ర, శిల్పాలు, మూర్తులు అన్నీ మర్చిపోయి అలాగే రంభ ముఖంలోకి చూస్తూ కూర్చుంటాడు. అప్పుడే మొదటిసారిగా జీవితంలో ఉష స్సును చూస్తున్నవాడిలా రంభకు ఎదు రుగా కూర్చుండిపోతాడు.

ఆలోచిస్తున్న రంభ ముఖంమ్మీద ఒక ప్రేమపూర్వకమైన చిరునవ్వు వెలిసింది. ఆమె నెమ్మదిగా పుస్తకం ముడిచేసి టేబిల్ మీద పడేసింది. పుస్తకం మూసి పడేస్తూ కళ్ళెత్తి చూసింది. ఏదో రంభ భయంతో కెవ్వుమంది. ఆమెకు ఎదురుగా ఎవరో అపరిచితుడు నిలబడి వున్నాడు. అతడి గెడ్డం పెరిగిపోయి వుంది. బట్టలు పీలికలై వ్రేలాడుతున్నాయి. కాళ్ళనుంచి తలవరకు దుమ్ము పేరుకుపోయి వుంది.

అతణ్ని చూచి రంభ భయపడి పోయింది. ఆమె ఒక్కసారిగా కుర్చీ లోంచి లేచి నిలబడింది. భయంతో వణుకు తున్న స్వరంతో అడిగింది-

"ఎవరు నువ్వు?"

అపరిచితుడు చాలాసేపు మౌనంగా వుండిపోయాడు. రంభ కళ్ళల్లో కళ్ళు దించి చూస్తుండిపోయాడు. తరువాత విచి త్రంగా చూస్తూ అన్నాడు-

"ఇప్పుడు కనీసం నన్ను గుర్తుపట్టే స్థితిలో కూడా లేవన్నమాట."

"కేశవ్" రంభ బిగ్గరగా అరిచింది. ఆమె భయం దూరమైపోయింది. ఆమె కేశవ్ ముందుకు కుర్చీ జరుపుతూ "కూర్చో" అంది.

కేశవ్ అలాగే నిలబడి చూస్తున్నాడు. కూర్చోలేదు. కొద్ది క్షణాల తరువాత అన్నాడు-"నేను కూర్చోవటానికి రాలేదు నిన్ను ఒక్క ప్రశ్న అడుగుదామని వచ్చాను. ఒక్క ప్రశ్న వేస్తాను?"

"అడుగు" రంభ చిరునవ్వు నవ్వుతూ అంది. ఆ నిమిషంలో కేశవ్ స్వరంలో విచిత్రమైన కఠినత్వం నిండివుంది.

"నువ్వు నా కోసం ఎందుకు ఎదురు చూడలేదు?" కేశవ్ అడిగాడు.

"ఎందుకంటే నువ్వంటే నాకు ప్రేమ లేదు" రంభ స్పష్టంగా చెబుతున్నట్టు అంది.

"ప్రేమ లేనప్పుడు నన్ను పెళ్ళి చేసుకుంటాననీ, ప్రేమిస్తున్నాననీ కూడా ఎందుకు చెప్పావు. బొంబాయి రాక్షస నగరపు వీధుల్లోకి నన్ను ఎందుకు విసిరివేశావు?"

"అప్పుడు నేను నిన్ను ప్రేమిస్తున్నా ననుకుని భ్రమించాను. కానీ అది నిజమైన ప్రేమకాదు. కేవలం నీ అందమైన ముఖం చూచి, నీ అందమైన శరీరాన్ని చూచి, నీ అమాయకమైన మాటల్ని చూచి ఇష్ట పడ్డాను. అది ప్రేమకాదు అని అప్పుడు నాకు తెలియదు. అంత అవగాహనశక్తి అప్పుడు నాకు లేదు. నేను నా గుండె లోతుల్లోకి దిగి అక్కడ ఎవరి ముఖం వుంది? నేను ఎవర్ని కోరుకుంటున్నాను? ఏ మేరకు కోరుకుంటున్నాను అని చూసు కోలేదు. కేవలం పైపైన బాహ్యమైన కొన్ని స్పందనలను చూచి ప్రేమ అని భ్రమించాను. ఏ విషయంపట్లనైనా నిదా నంగా నిర్ణయం చేసుకునే లక్షణం మా మోడ్రన్ బ్రతుకుల్లోంచి ఏనాడో ఎగిరి పోయింది. మా చుట్టూ ఎప్పుడూ సంక్షి ప్తత నిండి వుండేది. కాబట్టి ఒక నిర్ణయం మీద నిలబడటం నాకు సాధ్యపడలేదు.

కేశవ్! అదీకాక ప్రతి స్త్రీ తనచుట్టూ వున్న ఎన్నో ప్రేమల్లోంచి ఒక ప్రేమను ఎన్నుకోవల్సి వుంటుంది. ఆ ఒక్క ప్రేమే కదా జీవితాంతం మిగిలిపోతుంది. అందు కని ఈ విషయంలో తప్పులు జరిగిపోతుం టాయి. నీ విషయంలో అదే జరిగింది. తప్పు చేసేశాను. ఒకవేళ నిన్ను కోరు కుంటున్నాను అనుకో- కానీ ఆ తరువాత పరిస్థితులు ఎలా వచ్చాయంటే నేను అని వార్యంగా భగీరథ్‌ను పెళ్ళి చేసుకోవాల్సి వచ్చింది. కానీ చివరి క్షణంలో నేను అంతటి త్యాగం చేయలేకపోయాను. భగీరథ్‌లాంటివాణ్ణి పెళ్ళి చేసుకోవట మంటే నిలువునా ఆత్మహత్యచేసుకున్నట్టే అనిపించింది. అప్పుడు మదన్‌తో పారి పోయివచ్చేశాను"

కొన్ని క్షణాలు రంభ మౌనం వహించి మళ్ళీ అంది "ఇప్పుడు నేను బావున్నాను. సంతోషంగా, ఆనందంగా వున్నాను"

కేశవ్‌చేదు మింగుతున్నట్లు అన్నాడు- "మరి నేను కేవలం నీ ఒక్క మాటమీద నమ్మకంతో నా జీవితాన్ని అగ్నిగుండం లోకి విసిరేసుకున్నాను. కష్టనష్టాల్ని భయంకరమైన దారిద్ర్యాన్ని ఎదుర్కొ న్నాను. నీచమైన, క్షుద్రమైన మనుషుల మధ్య జీవించాను. నీ కాంక్షను పూర్తి చేయటానికి, నువ్వు కోరింది సాధించి నీకు సమర్పించటానికి నేను నమ్ముకున్న గొప్ప గొప్ప సిద్ధాంతాలు, ఆత్మవిలువలు, మానాభిమానాలు అన్నీ ధ్వంసం చేసు కున్నాను. చూడు నా ఈ దుస్తుల్లాగే నా ఆత్మ చిరిగి పీలికలైపోయింది. నా గుండెముక్కలు చెక్కలైపోయింది. ఈ దుమ్ములాగే నా అందమైన అంతరంగం శిధిలమై ధూళితో నిండిపోయింది. అంతా సర్వనాశనమైపోయింది. ఇప్పుడు నువ్వు 'నేను సుఖంగా, సంతోషంగా వున్నాను' అంటూ నవ్వుతున్నావు"

"కేశవ్! నన్ను క్షమించు" రంభ సిగ్గుతో తల వాల్చుకుని అంది. "పరిస్థి తులు ఇలా పరిణమిస్తాయని, ఫలితాలు ఇలా వుంటాయని నాకు తెలియదు. ప్రేమ ఇంతబాధ పెడుతుందని కూడా నాకు తెలి యదు. నేను హృదయపూర్వకంగా నిండు మనస్సుతో నిన్ను ఏనాడూ ప్రేమించ లేదు. ఆనాటి నా చంచల స్వభావం, అపసవ్య మనస్తత్వం కేవలం ఒక యువతి హృదయపు చంచలత్వం...అది ప్రేమ కాదు. ఇలా జరుగుతుందని నాకు తెలియదు"

"ఒక యువతి హృదయ చంచలత్వం కాదు" కేశవ్ భగ్గున మండిపడుతూ అన్నాడు-నువ్వు చేసింది ముమ్మాటికి మోసం, దగా, దగుల్బాజీతనం. నువ్వు నన్నుకావాలని మోసం చేశావు అది నిజం. నువ్వొక తిరుగుబోతు ఆడపిల్లవి! హృద యాలతో ఆడలాడుకునే రాక్షసివి! ఒక చోట ఒకడితో కాలు నిలువని నీచురాలివి! ఆడిన మాట తప్పి మోసానికి జంకు లేకుండా సిద్ధపడే ఆడపిల్లవి!

"నీలాంటి మోసగత్తెకు ఎలాంటి శిక్ష పడాలో నాకు తెలుసు. ఇన్ని నేరాలకు పాల్పడిన నిన్ను వదలను. నీకు ఏ శిక్ష పడాలో అదే శిక్ష నేనే విధిస్తాను...... బద్మాష్!...నీచురాలా!"

కేశవ్ జేబులోంచి రివాల్వర్ బయటకు తీశాడు.

"వద్దు...వద్దు" రంభ భయంతో కంపించిపోతూ అంది "వద్దు...వద్దు. కేశవ్ అలా చేయవద్దు... నువ్వు చేయ

కూడదు...నువ్వు చేయకూడదు"

కేశవ్ రివాల్వర్ పేల్చాడు.

బుల్లెట్ శబ్దంతోపాటు, ఒక కేకవేస్తూ రంభ నేలకు కూలిపోయింది.

రంభ నేలకు కూలిన మరుక్షణమే ఆకాశంలోంచి ఒక గర్జన వినిపించింది. దూరంగా పిడుగు పడింది. కేశవ్ చెవులకు ఆ గర్జన ఇంకా వినిపిస్తోంది. అతడి కళ్ళలో మెరుపులు మెరుస్తున్నాయి. అతడి కాళ్ళ కింద నేల గిర్రున తిరుగుతున్నది. కేశవ్ అదుపు తప్పి నేలమీద పడిపోయాడు. నెమ్మదిగా కుర్చీ పట్టుకుని లేచి నిలబడ్డాడు. అతి కష్టమ్మీద నిలదొక్కుకోగలుగుతున్నాడు. అతడి తల ఇంకా తిరుగుతోంది. అతడి రక్తనాళాల్లో సీసం కరిగించి పోస్తున్నారు ఎవరో! అతడి కాళ్ల టన్నుల బరువెక్కిపోతున్నాయి. అతడు మళ్ళీ శిలగా మారిపోబోతున్నాడు.

"కాదు...కాదు...ఇది అబద్ధం" కేశవ్ భయకంపితుడౌతూ అరుస్తున్నాడు. కానీ మరుక్షణమే అది అబద్ధం కాదని, తను నిజంగా శిలగా మారిపోతున్నానని తెలిసింది. అతడి శ్వాస ఆగి ఆగి నడుస్తోంది. అతడి చెవుల్లో ఏదో శబ్దం...గాలి ఇరుకు రాతి బండల మధ్య నుంచి వీస్తున్నట్టు వినిపిస్తోంది. అతడి కళ్ళకు చీకట్లు కమ్ముకుంటున్నాయి. కాళ్ళు మొద్దుబారి బరువెక్కిపోతున్నాయి.శరీరం రాతి సంకెళ్ళ మధ్య బిగుసుకుపోతోంది.

"కాదు....కాదు....శంకరా!....ఇది నిజం కాదు" కేశవ్ భయంతో వణికిపోతూ స్వగతంలో అనుకున్నాడు. తనను చుట్టుకున్న భయం వల్ల ఇలా అనిపిస్తోంది. రివాల్వర్ కేశవ్ చేతిలోంచి జారి, రంభ శరీరం పక్కనే పడిపోయింది. కొన్ని క్షణాలపాటు రంభ శరీరాన్ని చూస్తుండిపోయాడు కేశవ్. తరువాత కిందకు వంగి రెండు చేతులతో రంభను ఎత్తి భుజంమీద వేసుకున్నాడు. ఎల్లోరా పాత గుహల వైపు నడవసాగాడు. కానీ అతడికాళ్లు లేవటం లేదు. అడుగులు పడటం లేదు. కాళ్లు నేలకు అతుక్కుపోయినట్టు, కాళ్ళ కింద పెద్ద బరువు వ్రేలాడగట్టినట్టు అనిపిస్తోంది. శరీరంలో రక్తప్రవాహం ఆగిపోతోంది. అయినా కేశవ్ ఆత్మ బలాన్ని ఆధారం చేసుకుని బలాన్నంతాకూడగట్టుకుని నడుస్తున్నాడు. తడబడుతూ, తట్టుకుని నిలబడుతూ ఎల్లోరా లోపలకు నడుస్తున్నాడు.

నెమ్మది నెమ్మదిగా అతడి శరీరం శిలలోకి రూపాంతరం చెందుకుంటూ పోతోంది. అతడి మొత్తం శరీరాన్ని ఒక రాక్షస పిడికిలి గట్టిగాపట్టుకుని శరీరంలోని రక్తాన్నంతా, ప్రాణాన్నంతా పిండుతున్నట్టు అన్పిస్తోంది.తనను జడప్రాయంగా మార్చివేస్తున్నట్టుఅనిపిస్తోంది. సుత్తులతో మోది, మోది అతణ్ని రాతి. బొమ్మగా చెక్కుతున్నట్టు అనిపిస్తోంది. కానీ కేశవ్ అతి కష్టమ్మీద ఈడ్చుకుంటూ, తడబడుతూ నడుస్తూనే వున్నాడు. ఎల్లోరా లోపలికి ప్రవేశించాడు. కాళ్లు ఇంకా లేవటం లేదు. అతడికి కాళ్లు మోకాళ్ళ వరకు మొద్దుబారిపోయాయి. ఇప్పుడు కేశవ్ రంభను అలాగే ఎతుకుని మోకాళ్ళ మీద పాకుతున్నాడు.అలాగే పాక్కుంటూ పాక్కుంటూ చివరకి శివుడి పాదపీఠం దగ్గరకు చేరుకున్నాడు. రంభ శరీరం అతడి భుజమ్మీంచి చేతుల్లోంచి జారి కింద పడిపోయింది. రంభ దొర్లుకుంటూ వెళ్ళి శివుడి పాదాలు ముందు పడిపోయింది.

కేశవ్ పూర్తిగా శిలగా మారిపోయాడు. అతడు ఎక్కడ వున్నాడో అతడికి తెలియదు, ప్రాణంతో పాటే అన్ని జ్ఞాపకాలూ ఎగిరిపోయాయి. కేశవ్ ప్రతిమగా మారిపోయాడు.

* * *

అర్ధరాత్రి అయింది. శివుడు కళ్ళు తెరిచాడు. తన కాళ్ళ దగ్గర పడివున్న కేశవ్‌ను చూచి చిరునవ్వు నవ్వాడు.

ఈ రోజు మూడో సంవత్సరపు అమావాస్య రాత్రి, దేవీదేవతలు,యక్షులు, గంధర్వులు, కిన్నెరులు, కింపురుషులు అందరూ శివుడి చుట్టూ సభ తీర్చి వున్నారు. అందరూ కేశవ్ శిలా ప్రతిమను ఆశ్చర్యంగా చూస్తున్నారు.

శివుడు కేశవ్ ప్రతిమను తన కాలితో స్పృశించాడు. కేశవ్ ఉలిక్కిపడుతూ లేచి కూర్చున్నాడు.

"ఏమిటి కేశవ్? - విశేషాలేమిటి?" శివుడు అడిగాడు. ఇప్పుడు కేశవ్ తన వేల సంవత్సరాల నాటి పాత ప్రపంచంలో వున్నాడు. ఈ కొత్త ప్రపంచంలోకి ప్రవేశించిన తరువాత సంగతులు ఒక టొకటే అతడికి గుర్తుకొచ్చాయి. కేశవ్ కంగారు పడిపోయాడు. సిగ్గుతో, అవమానంతో తల వంచుకున్నాడు, అతడి ముందు రంభ శరీరం అతణ్ని పరిహశిస్తూ పడివుంది. కేశవ్ ఒక్క క్షణం కళ్ళు రెండూ గట్టిగా మూసుకుని, వెంటనే తల వంచేసుకున్నాడు. ఆ దృశ్యం చూట్టానికే భయపడిపోతున్నట్టు కనిపిస్తున్నాడు.

"ఈ అమ్మాయినేనా నువ్వు ప్రేమించింది?" శివుడు నవ్వుతూ రెండవ ప్రశ్న వేశాడు.

రెండో ప్రశ్న విని చుట్టూ కూర్చుని వున్న దేవతలు అందరూ నవ్వుతున్నారు. కేశవ్ సిగ్గుతో తల వంచేసుకునేవున్నాడు.

"నామాట కాదని వెళ్ళావు. ప్రేమించటానికని వెళ్ళావు. మరి హత్య ఎందుకు చేశావు" శివుడు కఠినంగా అన్నాడు. "నేను-పార్వతి, సరస్వతి చెప్పగా నీకు ఒక సంవత్సరానికి బదులు మూడు సంవత్సరాల ఆయుర్దాయాన్ని ప్రసాదించాను. అయినా ప్రేమను సంపాదించలేక పోయావు."

కేశవ్ కళ్ళల్లోంచి కన్నీటి ధారలు కురుస్తున్నాయి. అతడు దుఃఖంతో పూడుకుపోయిన స్వరంతో అన్నాడు- "నేను ఈ అమ్మాయిని ప్రేమించాను. కానీ ఈ అమ్మాయి నన్ను మోసం చేసింది."

"అది నీ తప్పు" శివుడు అన్నాడు. "నువ్వు నీ ప్రపంచపు విలువలు తీసుకుని ఈ కొత్త ప్రపంచంలోకి ప్రవేశించావు. కానీ ఆ ప్రపంచపు విలువలు మారిపోయి వున్నాయి. నువ్వు ఇవేవీ గమనించకుండా...?"

"కానీ పవిత్రమైన సిద్ధాంతం మారదుగా?..." కేశవ్ మధ్యలోనే ప్రశ్నించాడు.

"నిజమే! కానీ ఈ యుగపు ప్రేమ సిద్ధాంతం కూడా మారిపోయింది. మును పటి ప్రేమ సిద్ధాంతపు విలువలు ఇప్పుడు ఎవరూ పాటించటం లేదు. ఒక కొత్త సిద్ధాంతం ఏర్పడింది. బహుశా రాబోవు కాలంలో మానవత్వం నిండిన మంచి ప్రపంచం ఏర్పడితే అప్పుడు మరో గొప్ప ప్రేమ సిద్ధాంతం కూడా ఏర్పడుతుంది. కానీ ప్రపంచం ఆ మేరకు ఎదగాలంటే అభివృద్ధి కావాలిగదా? అభివృద్ధి...అది ఏదైనా నువ్వు ఆపగలుగుతావా? నిరో

ధిసావా? వద్దంటావా?"

"లేదు...లేదు...నేను అలా అనటం లేదు. విమానం, రైలు, కార్లు ఇవి మంచి వస్తువులే కానీ ఈ ప్రపంచం చాలా పాడై పోయింది. ఉన్నతమైన విలువలన్నీ ధ్వంసమైపోయాయి. మా రోజుల్లోలా ఒక్క విలువ కూడా సజీవంగా లేదు", కేశవ్ అన్నాడు.

"ప్రతి యుగం తన యుగపు విలువలు మాత్రమే మంచివనుకుంటుంది. కానీ అభివృద్ధి క్రమంలో అన్నీ మారుకుంటూ పోతాయి. ఒక్కోసారి అభివృద్ధి వెర్రి తలలు కూడా వేస్తుంది. మంచితో పాటు చెడు కూడా పేరుకు పోతుంది. అయినా అభివృద్ధి జరగక తప్పదు. కొన్ని మంచి విలువలతోపాటు, కొన్ని చెడ్డ విలువలను కూడా భరించక తప్పదు. ఈ అమ్మాయి తన ప్రపంచపు కొన్ని విలువల మధ్య చిక్కుకుని అలా ప్రవర్తించింది. నువ్వు అర్థం చేసుకోలేకపోయావు. మంచో చెడో ప్రతి యుగానికి తనదనే రంగు, రుచి, వాసన వుంటాయి. వాటిని బట్టే మనుషులుంటారు" అన్నాడు శివుడు.

"శంకరా నన్ను క్షమించు..." కేశవ్ శివుడి పాదపీఠం మీద మోకరిల్లాడు. "ఈ ప్రపంచంలోకి వెళ్ళి తప్పు చేశాను. నన్ను క్షమించు. నా కంటే ముందు తరంలో వున్న ఈ అమ్మాయిని బ్రతికించు" కేశవ్ వేడుకున్నాడు.

"ఆ అమ్మాయి జీవించే వుంది. నువ్వు పేల్చిన బుల్లెట్ కేవలం ఆమె భుజం పక్కనుంచి మాత్రమే దూసుకెళ్ళింది. ఆ అమ్మాయి ఎందుకని జీవించి వుందంటే ఎవరైనా భవిష్యత్తును గాయపర్చగలరే కాని, ప్రాణం తియ్యజాలరు. భవిష్యత్తు ఎప్పుడూ జీవించే వుంటుంది. ఎదుగుతూ కుంటూ పోతూనే వుంటుంది. అర్థమైందను కుంటాను నీకు. నాట్యానికి వేళయింది. నేను నాట్యం చేస్తాను. నీ వీణను అందుకో-ఆనందంతో ప్రమోగించు. భవిష్యత్తును ఆహ్వానించు" శివుడు గంభీరంగా అన్నాడు.

శివుడి మాటలతో ప్రసన్నుడయ్యాడు కేశవ్. అతడిలోని అశాంతి, దుఃఖం మాయమైనాయి. ఆనందంతో వీణను చేతుల్లోకి తీసుకున్నాడు. కేశవ్ చేతులు వీణా తంత్రుల మీద నాట్యం చేస్తున్నాయి. శివుడి పాదాలు ఈ భూభాండంమ్మీద నర్తిస్తున్నాయి. మరో కొత్త కళాసృష్టి ఊపిరి పోసుకుంటోంది.

* * *

తెల్లవారింది. సూర్యుడి లేత కిరణాలు రంభ ముఖంమ్మీద పడుతున్నాయి. రంభ ఉలిక్కి పడుతూ లేచి కూర్చుంది.

ఆమె శివుడి పాదపీఠం దగ్గర నిలబడి వుంది. రంభ చుట్టూ ఒకసారి పరిశీలించింది. ఆమె దృష్టి హటాత్తుగా ఒక చోట ఆగిపోయింది. ఆమెకు ఎదురుగా రెండువేల సంవత్సరాలనాటి వైణికుడి శిలాప్రతిమ మౌనంగా నిలబడి ఆమెనే చూస్తోంది.

ఆ ప్రతిమ కేశవ్‌ది. చేతిలో వీణ పట్టుకుని నిలబడి వున్నాడు. రంభ కల లోంచి పలవరిస్తున్నట్టు అంది-"కేశవ్!" మళ్ళీ ప్రతిమ వైపు చూచింది. మరు క్షణంలో నెమ్మదిగా నడుచుకుంటూ ఎల్లోరాలోంచి బయటకొచ్చేసింది.

కేశవ్ రాతి వీణను పట్టుకుని అక్కడే ఉండిపోయాడు. స్థిరంగా!..మౌనంగా!... నిశ్శబ్దంగా!...



# పాములతో చెలగాటం

పొట్ట కూటికోసం భయంకర విషసర్పాలతో చెలగాటమాడక తప్పదు కొందరికి. పాముల్ని పట్టడంలో ఎంత నేర్పున్నా ఒక్కోసారి వాటి కోరల్నించి తప్పించుకోవడం అసాధ్యం. దక్షిణాఫ్రికా అడవులు విష నాగులకు పెట్టింది పేరు. పధ్నాలుగు అడుగుల పొడవున్న 'బ్లాక్ మొంబా' అనే పాము అన్నింట్లోకీ ప్రమాదకరమైనది. ఈ పాము ఒక్కసారి కాటువేస్తే చాలు తిన్నగా యముడి దర్శనం లభిస్తుంది. జాక్‌లీస్ అనే అతను పాముల్ని పట్టి వాటిని పరిశోధనా సంస్థలకు అమ్ముతాడు. ఓసారి బ్లాక్ మొంబా అతని కాలి మడమ మీద కాటు వేసింది. కొద్ది క్షణాల్లో ప్రాణం పోతుందని తెలిసినా విషానికి విరుగుడు కోసం ముందు జాగ్రత్తతో తెచ్చుకున్న యాంటీ వెనం ఇంజక్షన్ తన చేతికి తనే పొడుచుకున్నాడు. స్నేహితుని జీపులో వెంటనే ఆస్పత్రికి వెళ్ళాడు. అప్పటికే అతని కళ్ళు చీకట్లు కమ్మి; శ్వాసాడ్డం కష్టమైంది.

డాక్టర్లతనికి కృత్రిమ శ్వాస కల్పించారు. లీస్ ప్రాణాలు రక్షించడం కోసం మృత్యువుతో యుద్ధం చేశారు. బతకడని తెలిసినా డాక్టర్లుగా వారి విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చారు. వారం రోజుల తర్వాత లీస్ మెల్లిగా కళ్ళు తెరిచి చేత్తో డాక్టర్ని దగ్గరికి రమ్మని సైగ చేశాడు. ఆశ వదులుకున్న డాక్టర్ల ఆశ్చర్యానికి అంతులేదు, బ్లాక్ మొంబా కాటు వేశాక బతికి బైటపడి రికార్డు సృష్టించిన ప్రప్రథముడు లీస్. అంత జరిగినా తన పని మానలేదు లీస్. దక్షిణాఫ్రికాకి చెందిన పీటర్ స్నైమెన్ ఈ సంఘటనతో ఉత్తేజితుడై లీస్ ఆధ్వర్యంలో ఓ రెండు డజన్ల సజీవ బ్లాక్ మొంబాలతో 40రోజుల పాటు ఒకే గదిలో కలిసివుంటానని ఛాలెంజ్ చేశాడు. 10 × 8 అడుగుల వైశాల్యంతో వున్న గాజు పెట్టెలో విషసర్పాలతో వున్న పీటర్‌ను లీస్ ఓ కంట కనిపెడుతూ వుండేవాడు. 25ఏళ్ళ



పీటరు నిద్రాహారాలు ఆ గాజు పెట్టెలోనే. ప్రతి రోజూ ఉదయం కాలకృత్యాలు తీర్చుకోడం కోసం ఓ అరగంట మాత్రం బైటకి వచ్చి మిగతా సమయం అందులోనే నలభై రోజులకు మించి గడిపిన పీటరు అంతకు ముందు డ్రేవర్ కుకర్ సృష్టించిన రికార్డును అధిగమించాడు. పాముల్తో నేర్పుగా ప్రవర్తిస్తే ఎన్నాళ్ళయినా వాటితో గడపవచ్చు అంటాడు పీటర్. గాజు పెట్టెలో ఉన్నన్నాళ్ళు ప్రతి పనీ మెల్లగా చేసేవాడు పీటర్. ఏ మాత్రం





పెద్ద శబ్దమైనా, బాహ్య ప్రేరణల పట్ల చాలా సున్నితంగా వుంటాయి మొసళ్ళు. ఓ సారి ఓ చిన్నపిల్ల గాజు పెట్టెలో పాములో బాటున్న పీటర్‌ని చూసి భయంతో గట్టిగా ఏడవడం మొదలెట్టింది. అంతే, ఓ మొసలి కోపంతో విసురుగా పడగవిప్పి పీటర్‌ని కాటువేయ బోయింది. కానీ కాటు అతని చేతిలో వున్న వస్తువు మీద పడ్డంతో వెంట్రుక వాసిలో అతనికి ప్రమాదం తప్పింది.

## గుడ్డివాళ్ళే నయం

కాళ్ళు, చేతులు తిన్నగావుండి ఆరోగ్యంగా వున్న మనిషి కూడా ఏం జీవితమో అని శూన్యంలోకి చూస్తాడు. కాని మద్రాసులోనిఎగ్మూర్ రైల్వేస్టేషన్‌లోఅనౌన్సర్‌గా పని చేస్తున్న గోపాల్‌కి అంధుడైనా జీవితం సల్లేరు మీద బండిలా సాగిపోతోంది. ఇతను టేబిలు మీదున్న ఆరు టెలిఫోన్లతో అభిమన్యుడిలా కుస్తీ పట్టాలి రోజూ. ఫోన్ కాల్స్‌కి జవాబివ్వడంతో పాటు కౌంటర్ దగ్గిరకొచ్చి అడిగేవాళ్ళకి కూడా జవాబు లిస్తుండాలి. గుడ్డితనం ఇతని సామర్థ్యాన్నేమాత్రం తగ్గించలేదు. ఇతను చెంగల్పట్ లోని కురుగుషి గ్రామ నివాసి. మద్రాసులోని లిటిల్ ఫ్లవర్ స్కూల్లోనూ, పౌండమల్లి అంగవికలుర స్కూల్లోనూ చదివి గుజరాత్ బన్నా వ్యవసాయ కళాశాలలో డిప్లొమా తీసుకున్నాడు. వ్యవసాయపు పనులు అన్నీ, స్ప్రేయింగ్ ట్రాక్టర్ నడపడం, విత్తనాలు వేయడం కూడావచ్చు. స్వంత ఊర్లో వ్యవసాయం సాగించేడు. అతని గుడ్డితనం ఆధారంగా ఎవరో మోటారును దొంగిలించడంతో నిస్సహాయ స్థితిలో ఉద్యోగం చేయాల్సి వచ్చింది. బొంబాయిలోని ఓ కంపెనీలో టెలిఫోన్ ఆపరేటరుగా పని చేసినపుడు ఓ సారి వెంటనే కనెక్షన్ ఇవ్వనందుకు ప్రొప్రైటర్ తిట్టేసరికి ఆ ఉద్యోగానికి రాజీనామాచేశాడు. కొన్నాళ్ళు మద్రాస్ డైరీఫామ్‌లో పనిచేశాడు. ఇతనికి తమిళం, తెలుగు, ఇంగ్లీష్, గుజరాతి, హిందీ, మరాఠీ భాషలొచ్చు.

ఇతను మరోగుడ్డి అమ్మాయిని వివాహం చేసుకున్నాడు. ఆరోగ్యంగా వున్న ఓ పాపవుంది వీరికి. భార్యరోజూ ఇతనితో ఆఫీస్ వరకూ వచ్చి వదిలి వెళుతుంది.



ఉదయం ఆఫీసుకి రాగానే కంట్రోల్ రూమ్‌కి ఫోన్ చేసి రైళ్ళ రాకపోకల పరిస్థితి ఎలా వుందో తెలుసుకొంటాడు. అప్పుడు ఏ రైలు ఏ ప్లాట్‌ఫామ్ మీదికి వస్తుందో శబ్దాన్ని బట్టి చెపుతుంటాడు. రైలు బయల్దేరే సమయాన్ని చెప్పాలంటే కేబిన్‌కి ఫోన్‌చేసి వివరాలు కనుక్కుంటాడు. గోపాల్ మిత్రులు కూడా ఇతనికి అన్నివిధాలా సహాయపడతారు. కనుక గోపాల్‌కి కళ్ళులేవన్న లోటుతప్ప

మామూలు మనిషికి ఏ మాత్రం తీసిపోడు.

# మృత్యు సముద్రం

సాయం సంధ్య సూర్య కిరణాలు పడి మెరుస్తున్నాయి సముద్రంలో నీళ్ళు. ఉదయమనగా పడవల మీద బయల్దేరిన చేపలవాళ్ళు వెలిగిపోతున్న ముఖాలతో వెనక్కి బయల్దేరారు. ఆకాశం నిర్మలంగా వుంది. తుఫాను వచ్చే సూచన ఎక్కడా లేశమయినా లేదు. ఇంతలో చేపలవాళ్ళకి దూరంగా తుఫాను వస్తున్న వాసన వచ్చింది. ఇంకా సముద్రంలోనే వుండి పోయిన పడవలోని బెస్తవాళ్ళు శక్తినంతా వినియోగించి పడవను ఒడ్డువైపు నడుపుతున్నారు. కాని ఇంతలో ఉవ్వెత్తున లేచిన అల ఒకటి పడవ మీద విరుచుకు పడింది. దెబ్బకు పడవ ముక్క ముక్కలైంది. అందులోని బెస్తవారు ప్రాణభీతితో అరిచారు. ఒడ్డుకు చేరి ఆందోళనగా చూస్తున్న బెస్తవారు పెద్ద తుపాకి తెచ్చి ఓ లైఫ్‌లైన్‌ను పేల్చారు. కాని ఆ త్రాడు బలమైన గాలి తాకిడికి చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్న వారిని చేరలేకపోయింది. క్రమంగా మునిగిపోయిన పడవలోని వారు సముద్రపు అలల్లో కొట్టుకుపోతున్నారు. ఒడ్డున ఉన్నవారు మరో లైఫ్‌లైన్‌ను విసిరారు. అయినా ప్రయోజనం లేకపోయింది. ఒడ్డునవున్న కొందరు ధైర్యంగా ఓ లైఫ్ బోట్‌లోకి ఎక్కి మునిగిపోతున్న వారిని రక్షించడానికి బయల్దేరారుకాని ముసలివారు వారిని శతవిధాలా విరమింపజేయడానికి ప్రయత్నించారు. అయినా వినకుండా సముద్రంలోకి వెళ్ళారు. వెంటనే విరుచుకుపడిన బ్రహ్మాండమైన అల వెనుక ఆ లైఫ్‌బోట్ మాయమయింది. ఒడ్డున నిస్సహాయంగా నిలబడి చూస్తున్న బెస్తవాళ్ళు వారి ఆత్మశాంతికి ప్రార్థన చేశారు.

మొత్తం మీద పద్దెనిమిది మంది బెస్త యువకులు మరణించారు చిత్రంగా వారి మరణానంతరం తుఫాను జాడే లేకుండా సముద్రం శాంతించింది. ఇలాంటివి తరచూ జరుగుతాయి కాని 1972 ఆగస్ట్ 2న జరిగిన దీనికో



ప్రత్యేకతవుంది. ఈ తుఫాను రావడం వాళ్ళు చనిపోగానే మాయమవడం ప్రతి సంవత్సరంఆగస్ట్2వతేదీనఅదేప్రదేశంలో జరుగుతోంది. ప్రమాదం జరిగినప్పుడు మరణించిన పడవవాళ్ళే ప్రతిసారీ కన్పిస్తుంటారు. అదే సన్నివేశం పునరావృతమవుతుంది. అది నిజమని సముద్రంలోకి వెళ్ళినవారి పని అంతేసంగతులు. ఇప్పటికీ ప్రతి సంవత్సరం ఇది జరుగుతుంటుంది. స్థానిక గంగపుత్రులు ఆ సమయంలో ఎవరినీ సముద్రంలోకి పోనీయరు. తూర్పు జర్మనీలోని హామ్‌బర్గ్ వద్దగల





సాల్ట్ ఐలాండ్ (ఉప్పుద్వీపం) ఒడ్డున ఈ వింత సంభవించే ప్రదేశంలో వివరాలను తెలిపే ఓ సమాధిరాయి వుంది.

# అసలైన భక్తుడు

తమిళనాడులోని కుంభకోణం దగ్గర తాండవన్‌తొట్టం అనే ఓ చిన్న గ్రామంలో శివకామి సుందరి అమ్మవారి పురాతన దేవాలయం వుంది. అందులో పంచ లోహాలతోచేసినవిగ్రహాలెన్నో వున్నాయి. సంవత్సరానికోసారి ఇక్కడ ఆకాశ మరియమ్మన్ పండుగ సందర్భంగా ఉత్సవాలు జరుపుకుంటారు. ఊరేగింపు చేస్తారు. 1971లో ఓ సారి, 1972లో మరో సారి సరిగ్గా ఉత్సవం రాత్రి గుడి తలుపులు బద్దలు కొట్టి ఎవరో లోపలి పంచలోహ విగ్రహాలు తస్కరించారు. అందులో ప్రసిద్ధమైన నటరాజస్వామి విగ్రహం కూడా వుంది. దేవాలయం అధికారులు పోలీసు కేసు పెట్టారు. పండుగ నాడు వూళ్ళోకి పడవంత కారు వచ్చింది. పిల్లా, మేకా విరగ బడి విచిత్రంగా దాన్ని చూస్తుంటే ఇంజను పాడైందని చెప్పి అందర్నీ తరిమేశారు కారువాళ్ళు. బహుశ వాళ్ళేదొంగతనంచేసివుంటారని పోలీసులు భావించి పరిశోధన చేశారు గానీ ఫలితం లేక పోయింది. పోయిన విగ్రహాల ఖరీదు కొన్ని లక్షలుంటుంది. ఈ సంఘటన తర్వాత భక్తులు గుడికి రావాలంటేనే భయపడుతున్నారు. కొందరు స్థానికులు దేవాలయ పునరుద్ధరణ సంఘాన్ని ఏర్పాటు చేసి చందాలు వసూలు చేసి తిరిగి కొత్త విగ్రహాలను ప్రతిష్ఠించ డానికి పూనుకున్నారు.

80 ఏళ్ళ యజ్ఞేశ్వర్ శివకామి సుందరి పరమ భక్తుడు. పోయిన విగ్రహాలను ఎప్పటికైనా పట్టుకుంటేగాని ప్రాణాలు వదలనని దేవి ముందు ప్రమాణం చేశాడు. అంత వయసులో కూడా అతను యువకుడిలా ఉత్సాహంగా హుషారుగా వుండేవాడు. కలకత్తా హార్బర్లో స్మగ్లింగ్ శాఖ అధికారులుఎన్నో విగ్రహాలను పట్టుకున్నారన్న వార్త పేపర్లో చదివి మద్రాసు తేనాంపేట పోలీసు స్టేషనుకు వెంటనే విషయం తెలియబర్చాడు. విగ్రహాలు తనిఖీ కోసం కలకత్తా నుండి మద్రాసు రప్పించ



బడ్డాయి.

యజ్ఞేశ్వర్, కొందరు గ్రామ పెద్దలను వెంట బెట్టుకుని వెళ్ళి విగ్రహాలను గుర్తుపట్టి వెనక్కి తెచ్చుకున్నాడు. వాటిల్లో నటరాజస్వామి విగ్రహం కాళ్ళు అప్పటికే కరిగించేశారు దుండగులు. ప్రభుత్వ లావాదేవీలయ్యాక విగ్రహాలను పునః ప్రతిష్ఠించి వాగ్దానం నిలబెట్టుకున్నాడు యజ్ఞేశ్వర్.

# గుప్తనిధి

అనేక వివాదాలకు గురియైన నేతాజి సుభాష్ చంద్రబోస్ మరణంలాగే అతనినిధికూడా వివాదాస్పద విషయంగా మారింది. ఆ మధ్య జనతా పార్టీ సభ్యుడు సుబ్రమణ్యస్వామి, నేతాజీ నిధి వున్న పెట్టె రహస్య ఉత్తరం నెహ్రూ వద్దకి తర్వాత జాతీయ వస్తు ప్రదర్శనశాల అధికారి జె. కె. రాయ్‌కి చేరాక వారిద్దరూ నిధిలోని కొన్ని వస్తువులను తీసుకున్నారని ఆరోపించడంతో ఇరవైనాలుగేళ్లు గుప్తంగా వుంచబడిన పెట్టెను మాజీ ప్రధాని మొరార్జీదేశాయ్ ఆదేశంతో తెరిచారు. పెట్టె తెరిచేటప్పుడు విద్యా, ఆర్థిక మంత్రులు, భారతీయ పురావస్తు పరిశోధనా విభాగం అధికార్లు, జాతీయ మ్యూజియం తరఫున అందరూ హాజరయ్యారు. ఆ పెట్టెలో వజ్రాలు, నగలు, కొన్ని లక్షల రూపాయలు వున్నాయి. ఈ నిధిని (సౌత్ ఈస్ట్ ఏసియా) నైఋతి ఆసియాలో నివసించే ఓ భారతీయుడు స్వాతంత్ర్య సమరం కోసం నేతాజీకి సమర్పించాడు. 1945 ఆగస్టు 17న నేతాజి కల్నల్ హబీబుర్ రహమాన్, ఇంకా 11 మంది జపాన్ మిలటరీ అధికారులతో ఓ యుద్ధ విమానం ఎక్కారు. తర్వాత తైహోకు విమానాశ్రయం వద్ద విమానం కూలిపోయి అందరూ మరణించారు. అయినా ఆ అగ్నిప్రమాదంలో వజ్రాలు, నగలు యథాతథంగానే మిగిలాయి. విమాన ప్రమాదంలో నగలు విమానాశ్రయమంతటా చెల్లా చెదురుగా పడిపోయాయి. నాశనమవగా మిగిలిన వాటిని సేకరించి టోక్యోకు పంపారు అక్కడి అధికారులు. నేతాజీ సన్నిహితుడు టోక్యోలోని భారతీయ స్వాతంత్ర్య సంఘం అధ్యక్షుడు రామమూర్తికి ఆ నిధి అప్పగించబడింది. ఆయన 1959లో టోక్యోలోని భారత రాయబారికి స్వాధీనం చేశాడు నిధిని. అక్కడనుంచి నెహ్రూకి, జె. కె.రాయ్‌కిచేరి నేషనల్ మ్యూజియంలో భద్రపర్చబడింది.

పెట్టెలోని నగలను వైజ్ఞానిక, రసాయనిక నిపుణులు పరీక్షించి సుబ్రమణ్యస్వామి ఆరోపణ పూర్తిగా నిరాధారమని తేల్చారు. అయితే నేతాజీ నిధికి సంబంధించి మిగిలిన రెండు పెట్టెలు ఏమయ్యాయన్న విషయం స్పష్టంగా తెలలేదు. ఖోస్లా కమిటీ, షానవాజ్ కమిటీ విచారణల్లో కూడా ప్రమాదంలో మూడు సూట్‌కేసుల్లోని నిధులూ చెల్లా చెదరవగా, దొరికినవాటిని ఒక సూట్ కేసులో పెట్టారని ఖోస్లా కమిటీ కొన్ని వివరాలందించింది. నేతాజీ అసలు నిధి ఎంతో ఎవరికీ తెలిని రహస్యంగానే మిగిలిపోయింది ఇప్పటికీ. *



Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

